శ్రీ

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణే నమ

# శ్రీరామపంచశతి

(సీసపద్యకృతి)



గ్రంథకర్త

శిలే నారాయణ కవి

# కవి పరిచయము

| | |
|---|---|
| శుభాభిధానము | నారాయణ |
| గృహాన్వయ నామము | శిలేవారు |
| విద్యార్హతలు | స్వాధ్యాయముతో M O L<br>సంస్కృత విశారద |
| వృత్తి | ప్రథమ శ్రేణి తెలుగు పండితుడు<br>ప్రభుత్వోన్నత పాఠశాల<br>హైదరాబాద్ |
| రచనలు | ముద్రితములు రత్నసానువు (ఖండకావ్య సంపుటి)<br>రామసుధాకర శతకము మంగళహారతులు<br>సంస్కృతములో (9) అష్టకవ<br>అముద్రితములు (కోకిల రామాయణము<br>తందనాన ప్రహ్లాద చరిత్రము (అక్షర నక్షత్రావళి)<br>ఖండకావ్యము (ముద్రణలో) అనేక భక్తి దేశభక్తి<br>లలితగేయములు నాలుగు (4) సంస్కృత<br>అష్టకములు |

1971 నుండి హైదరాబాద్ ఆకాశవాణి నుండి కవితాప్రసారాలు

ఆరాధన పత్రికలో అనేక కవితలు ముద్రితాలు కొన్ని అష్టకములు గేయములు టి వి లో ప్రసారితములు

శ్రీ

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీరామపంచశతి

(సీసపద్యకృతి)



గ్రంధకర్త

శిలే నారాయణ కవి

శ్రీరామ పంచశతి

ప్రథమ ముద్రణ 1999 అక్టోబర్ 2000

ప్రతులు 1000 విక్రమనామ సంవత్సర విజయ దశమి

వెల 45 రూ॥లు

గ్రంథములు దొరుకుచోట్లు

(1) శృంగేరి జగద్గురు శంకరమఠము,
నల్లకుంట, హైదరాబాదు - 500 044

(2) శిలే నారాయణ కవి కాకతీయనగర్ కాలనీ
ఇం నెం 9-4-84/63, గోల్కొండ (P O)
హైదరాబాద్ - 500 008

ఈ గ్రంధము తిరుమల తిరుపతి దేవస్థానము
వారి ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది



ముద్రణ సప్తగిరి ప్రింటింగ్ వర్క్స్ విద్యానగర్ హైదరాబాదు

# కృతజ్ఞతా కుసుమాలు

శ్రీ దైవభక్తి సంపన్నులారా!

నాకు ఏ జన్మల సత్కృత ఫలమోకాని భగవదనుగ్రహ ప్రసాదముచే చిఱుప్రాయముననే ఈమాత్రపు కవితయైన అంకురింపగా దానిని శ్రీరామనామముతో శ్రీకారము చుట్టి శ్రీరామ భద్రమూర్తికే సమర్పించితిని దైవముతో అప్పుడప్పుడు నాకు కలిగిన అనుభూతులను లోకములోని అనుభవములను శ్రీరామభద్రమూర్తికే విన్నవించి తరింప తలంచితిని ప్రస్తుతము త్రిశతి నుండి పంచశతిగా మారినది సప్తశతికి సిద్ధమగుచున్నది అంతా రామభద్రుని కృప శ్రీరామ పంచశతియైన ఈ కృతికి ప్రసుత్తము దీని ముద్రణకొఱకు ఆర్థిక సహకారమందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతాభివాదములు మరియు ఈ గ్రంథముద్రణకు కావలసినంత ఆర్థిక సహాయము చేసి శ్రీరామభద్రుని కృపకు పాత్రుడైన వదాన్యస్వభావులు సహజ దైవభక్తి సంపన్నులు నల్లగొండ జిల్లా బేగంపేటలో స్వయముగా శ్రీరామ మార్కండేయ కుసుమ హరనాథ మందిరములను నిర్మించి తమ పది ఎకరముల భూమిని సమర్పించిన భక్తాగ్రగణ్యులు హైదరాబాద్ శ్రీ కుసుమ హరనాథాశ్రమ ప్రధాన కార్యదర్శి కుసుమ హరనాథ సంస్థ ప్రచార కార్యదర్శి అయిన శ్రీ భోగ నర్సయ్య గారికి కృతజ్ఞతాభివాద సుమములు మరియు నాకు ప్రియమిత్ర రత్నములు సహృదయులు శ్రీమాన్ అమరవాది లక్ష్మణాచార్యులు శ్రీమాన్ అమరవాది లక్ష్మీనరసింహాచార్యులు నా కవితల పట్ల అభిమానము కలవారు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాసుమములు

దీనిని రెండవ వ్రాత ప్రతిగా వ్రాసి ఇచ్చిన మిత్రులు శ్రీమాన్ చక్రవర్తుల శ్రీనివాసా చార్యులు గారికి నా కవితలపట్ల అభిమానము చూపుచు ప్రోత్సహించిన శ్రీ యడవల్లి సీతారామ శాస్త్రి గారికి శ్రీ యం రంగయ్య అడ్వకేట్ గారికి శ్రీ ఎం వి యల్ నరసింహారావుగారికి కృతజ్ఞతలు

ఈ గ్రంథమును సుందరముగా ముద్రించిన సహనశీలి రామభక్తుడు పి సుభాష్, సప్తగిరి ప్రింటింగ్ ప్రెస్ వారికి నా కృతజ్ఞత

విబుధజన విధేయుడు

**శిలే నారాయణ కవి**

ఓం

శ్రీ గణేశ్వరాయనమ
శ్రీ సరస్వతీ మాత్రే నమ
శ్రీ లక్ష్మీ నారాయణాభ్యామ్‌నమ
శ్రీ సీతారామ చంద్రపరబ్రహ్మణే నమ

# శ్రీరామ పంచశతి

## (ప్రథమ కాండము)

శ్రీవత్సాంకిత వక్షసం శుభకరం శిష్టావనం పావనమ్
బ్రహ్మాదిత్రయమూర్తి శక్తి జనకమ్ బ్రహ్మాండ భాండోదరమ్
కల్యాణ ప్రద మప్రమేయ చరితమ్ కైవల్యరూపం శుభమ్
శ్రీ లక్ష్మీపతి మచ్యుతమ్ ఋషినుతం భావే భజేసంతతమ్

శ్రీ జానకీ రమా శ్రీ కళాత్మ విలాస!
సకల వేదపురాణ శాస్త్ర భాస!
నారదాది సురర్షి సూరితారకనామ!
లక్ష్మణాగ్రజ! మోక్ష లక్ష్యధామ!
వాల్మీకి మౌనీంద్ర వర్ణిత చారిత్ర!
పావని శ్రిత పాద! పద్మనేత్ర!
ఏకదారాచార! లోకాప్త కులవీర!
సద్గుణాకర నిత్య సత్యధీర!

తే దేవ దేవ! శ్రీ నారాయణావతార!
భావమున నిల్వు నీ భక్తి భాగ్య మొసగు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మశీల! బ్రహ్మానంద తత్వమూల!

సీ. ఓంకారనాద! సముద్దీప శ్రీ వత్స
దివ్యోన్నతోరసే తేనమోస్తు
నగరాజ ధారిణే ఖగ రాజగామినే
జ్ఞాన సంచారిణే తేనమోస్తు
మోక్షప్రదాయక ! భువన మోహన కళా
భాసమానాయ తుభ్యం మోస్తు
నారదాది సురర్షిధీర సంగీతాత్మ
భవ్యతత్వాయతుభ్యంనమోస్తు

తే. రామతారక! వేద పారాయణాయ
యక్ష గంధర్వ కిన్నరాద్యమరమునిగ
ణాది నిత్యసన్నుత చరితాయజయజ
యజయనారాయణాయతుభ్యంనమోస్తు 2

సీ. శ్రీ మత్పరబ్రహ్మ నామ సదానంద
శుభకళామయుహృదిన్ స్తుతినిచేసి
బ్రహ్మజిహ్వ దివ్య భవననివాసనిన్
భారతీమాతను భక్తి మ్రొక్కి
విష్ణు హృదయ మేఘ విద్యుల్లతోపమా
శ్రీదేవి చరణాల శిరము వంచి
శివుని దేహార్ధమై స్థిరత పాయక వెల్గు
లలితాంబ పదధూళి తల ధరించి

తే. సృష్టి చక్రమున్ క్రమముగా త్రిప్పుచున్న
బ్రహ్మ విష్ణు మహేశులపదము లంటి
తత్కృపంజేసి జన్మంబు ధన్యమొంద
భక్తి కవితలో శ్రీరామ భద్రుగొలెద 3

సీ దండంబులిడు భక్తగండంబులను జెండి
యండనుండెడి మహోద్దండ మూర్తి
అకులలములచే నర్చించుదాసుల
సాకఁ జూచెడి దయాసాగరుండు
దుర్మార్గతతిఁ గాలఁ ద్రొక్కుచు నడుగంట
ధర్మపాలనఁజేయు దైవతమ్ము
కుడుముల నుండ్రాళ్ల కడు భక్తినిడు వారి
యిడుముల నడఁగించు వడుగుసామి

తే అదిదే వదంపతులకు నా దిసుతుఁడు
అఱుమొగముల దేవునక గ్రజుండు
అఖిలలోకాలఁ దొలిపూజలందు కొనెడు
శ్రీ గణేశ్వరున్ సతతంబు జేరికొలుతు 4

సీ బ్రహ్మాది కీటక పర్యంతముగ సృష్టి
ప్రతిజీవికిని తగు బాణినేర్పి
ప్రణవాక్షరీ సప్త పట్టి తంత్రుల మీటి
సామవేద స్వరసరళి నింపి
ఒక పాద నూపురం బొయ్యన కదలించి
ఎల్లలోకముల నటింపజేసి
ఒక పదకమలంబు సకల సృష్టికి చల్ల
నీడగొడుగు గాను నిల్పినతము

తే అండపిండాల బ్రహ్మాండ భాండములను
ఒక్కమూలకు నొదిగించి చక్కనేలు
మాతలకు మాత భారతీమాత పూజ్య
చరణకంజాత యుగళమే శరణుమాకు 5

సీ. సనకసనందాది సర్వదేవర్షుల
సకల దేవతలను సన్నుతించి
వేదమంత్రోద్ధార విబుధ మహర్షుల
షట్శాస్త్ర నిర్మాణ చణుల మ్రొక్కి
జగదాదికవివుడై ఒగినాది గురుకావ్య
కర్తయౌ వాల్మీకి ఘనునుతించి
వేదముల్ విభజించి విమల పురాణముల్
ప్రవచించిన భగవద్వ్యాసు గొలిచి
కవిలోక గురుడై జగద్గురుడై యొప్పు
ఆదిశంకరగురునభినతించి

తే. దివ్యసార్థకమంత్రోపదేష్టనెంచి
అఖిల సద్గ్రంధకర్తలనలర దలచి
ఈ కవిత విన్నవించెద నాకు దోచు
వచ్చిరాని మాటల సీసపద్యశతుల 6

సీ. గురువుతో జనియించె గొప్పనౌ ప్రణవంబు
గురువుతో లఘు గణ గుణములయ్యె
గురువుతో నుదయించె గుణములు మూడును
గురువుతో వెలసెను గుణుతులెల్ల
గురువులో నినునిండె గుప్త మంత్రములన్ని
గురువుతో సర్వంబు గుట్టు దెలియు
గురువులోపల గన గొనబె బ్రహ్మాండముల్
గురువులో బ్రహ్మంబు గూడుగట్టె

తే. గురుని తెలియని బ్రతుకెల్ల గ్రుడ్డి గ్రుడ్డి
మూడు మూర్తులు శక్తులు మూడు గురుడు
గురుని కొలచిన జన్మకు పరమునిహము
శాశ్వతానంద సౌభాగ్య శాంతి కలుగు 7

సీ. లలినెనుబది నాల్గు లక్షలజాతులన్
మానవ జన్మమేమంచి దందు
పురుషుడై పుట్టుట పూర్వ పుణ్యం బందు
సంస్కార విద్యలు సాధు వందు
సదసద్వివేకతా చారమున్నత మందు
యోగజిజ్ఞాసత్వమున్నతంబు
అందు ఇంద్రియజేత అగుటయే శ్రేష్ఠంబు
అందుబ్రహ్మ జ్ఞాని యగుట మేలు

తే. అందు సంతతాను భవమౌ హంసవృత్తి
అమర నీ భక్తుడే ధన్యుడంద్రు బుదులు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 8

సీ. ఈ సృష్టి పథకంబులే ద్రష్టసాధ్యమౌ
నీవ స్వయంభువై నేర్పకున్న
ఏతాపసివలనౌ నీతత్వముల బాడ
దేవర్షి నారదుడీవు గాక
నీ కథ వర్ణింప ఏ కవితరమౌను
వాల్మీకి వీవయి పలుకకున్న
ఏ ఋషి వశమౌను నీ లీలలు దెలియ
వ్యాసర్షి వీవెయై వ్రాయకున్న

తే. తల్లితన పరిచయమును పిల్లలకును
తానె చేసికొన్నట్లు నీ తంత్రమిద్ది
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 9

సీ ఏ పుష్పములను జేరి ఎలమినాఘ్రాణింప
ఇంపుగా నీ గంధమిచ్చి పంపు
ఏ ఫలంబును గోరి ఎనసి ఆస్వాదింప
నీదు మాధుర్యమే నిండ యుండె
ఏ నాదములు విన్న ఆ నాదములునన్ని
నీ నాదమోదమై అదరించె
ఏ దిక్కులను జూడ ఆ దిక్కులన్నియు
నీ విశ్వరూపమై న్వెటిల్లె

తే ఏది తగిలిన కాంక్షతో ఈ జగమున
అందు నీదు స్పర్శానందమందుచుండె
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్త్వమూల। 10

సీ సంగీతమున సరస్వతికి పెద్దకొడుకు
నారదుండఖిల విశారదుండు
సకల విద్యలయంద సమపుత్ర రత్నంబు
మాత భారతికి ప్రాచేతసుండు
బ్రహ్మదేవుడె గురు బ్రహ్మయై వాల్మీకి
నాది కావ్యము వ్రాయనానతిచ్చె
సంక్షేపమున దెల్పె స్వామి వాల్మీకికి
రామ నీ చరిత నారద మహర్షి

తే సకల విశ్వంబు తరియింప శాశ్వతముగ
ఉభయ ఫలములనొందంగ నోలిజనులు
మౌని ముఖ్యుండు వ్రాసె రామాయణంబు
ఆది కావ్యంబు వినలేనియ తడునరుడె 11

సీ రామాయణామృత రససాగరంబున
లభియింపగాలేని రసముగలదె
రామాయణామరారణ్య సీమలయందు
సంభవింపని మహౌషధులు గలవె
రామాయణాక్షర బ్రహ్మాండమునలేని
చిత్రమౌ సాహిత్య సృష్టి గలదె
రామాయణ పవిత్ర భూమండలంబున
కలుగని నవరత్న ఖనులు గలవె

తే బ్రహ్మదేవుడే శ్రీ రామభద్రు చరిత
రచన చేసెను వాల్మీకి రసన జేరి
అఖిల విశ్వ కల్యాణ రామాయణముగ
ఆదికావ్య మందువు జాలె అఖిల కవిత। 12

సీ యోగియౌ వాల్మీకి యోగవాస ష్ఠాన
యోగశిక్షణ మొందు యోగి వీవు
ఆదికవీంద్రుని ఆదికావ్యము నందు
పురుషార్థ సద్ధర్మభోగి వీవు
వ్యాస మహాఋషి అధ్యాత్మ రామాయ
ణంబులో పారాయణంబు నీవు
ప్రాచేతసానంద రామాయణంబులో
సుందరార్థ పరమానంద మీవు

తే ఆదికవివె శ్రీరాముగా ఆదికవిగ
మారి రచియించితివి రామాయణాలు
ఆదికవి మౌనికిని నీకు భేదమేది
లోకముల సంస్కరింప సుశ్రీకరముగ 13

సీ రామాయణమునకు రామాయణమెసాటి
ఆది కవికి సాటి ఆదికవియె
రామ ప్రభువునకు రామ ప్రభుడె సాటి
సాధ్వి సీతకు సాటి సాధ్వి సీత
రామసోదరులకు రామ సోదరులెపో
సఖ జటాయువునకా సఖుడె సాటి
రామగురులసాటి రామగురులెచూడ
రామ సుతుల సాటి రామ సుతులె
రామదూతకు సాటి రామదూతయె సుమీ
రామ మిత్రుల సాటి రామకపులె

తే రామ నామామృతము సాటి రామనామ
మధుర సారామృతమె దివ్య మధురనామ
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 14

సీ సర్వజ్ఞ వాల్మీకి సాహిత్య సంపదే
నీ విశ్వరూపమై నివ్వటిల్లె
బ్రహ్మర్షి వాల్మీకి భవ్య కవిత్వమే
నీ ధర్మ చరితమై నేర్పునీతి
ఆది కవీశుని ఆదికావ్యాత్మయే
నీ యంతరంగమై నిలిచెజగతి
వాగ్దేవిగారాబు పట్టి వాల్మీకిసత్
కవనమే నీకు మేల్భవనమగును

తే ఆదికావ్య వాల్మీకి రామాయణంబు
ఎందు నుండునో నీవందెనుండు నిజము
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 15

సీ ఎవడు కంఠ్గై బొజ్జ నీరేడు లోకాల
సంధించివట పత్ర శాయియగునొ
ఎవని శ్వాసలతోడ నెల్ల బ్రహ్మాండముల్
పుట్టివర్ధిలి మఱిగిట్ట గలవొ
ఎవడు ప్రాకృతమాయ కీవలావలనిండి
సచ్చిదానందుడై సాగగలడొ
ఎవడు కల్పాంతాన ఏకాకృతిగనుండి
వెలుగు నీడలు లేక వెలుగ గలడొ

తే ఎవడు సాక్షియై ముచ్చేష్టలవలగలడొ
అ పరబ్రహ్మమైన నిన్నాశ్రయింతు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 16

సీ నాలుక నొకసారి నమ్మియేహరిపేరు
తలచిన తలపులో నిలుచుముక్తి
ఏ దేవుతత్వంబునూది బోధించునో
వేదసంచయమెల్ల విశ్వమందు
మూడుశక్తులగూడి మూర్తిత్రయంబునై
సృష్టిచక్రంబునే స్రష్టద్రిప్పె
త్యాగుల్ మహర్షులు యోగులు సాంఖ్యులు
పాటింతురే బ్రహ్మపదవి జేర

తే భూత భువనాల కాధార భూతమైన
యట్టి నారాయణుడవు నిన్నాత్మదలతు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 17

సీ. కరుణా సుధాసార కారణంబున విప్ప
దివ్యనేత్రాబ్జముల్ తేజరిల్ల
మొలక నవ్వులమూలమున మోము గలువపై
పగడంపు పెదవులు పల్లవింప
ఘన ధనుర్బాణముల్ గలిగిన కతమున
వీరబాహులు శూరసార మొలుక
కందర్ప శతకోటి సుందరాంగముపైని
బంగారు పుట్టముల్ బలసి మెఱయ

తే. సొగసు తలపై కిరీటంబు శోభచిలుక
అభయ హస్తంబు జూపుచునందరావె
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ. సప్తకోటి సుమంత్ర సంతానమున మేటి
రామతారక మంత్రరాజ మెన్న
భవమూర్ఛితులకెల్ల పావన సంజీవి
రామతారక మంత్రరాజమగును
శరణాగతాశ్రిత వరకల్ప సాలంబు
రామతారక మంత్రరత్నమరయ
అఖిలజీవుల హంస కంటినధ్యానంబు
రామతారకమంత్రరత్నమౌను

తే. వేయునేటికి తారక విధము బల్క
వశమె బ్రహ్మాది శేష గీష్పతులకైన
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 1

సీ  కల్యకాలమునందు కడు శ్రద్ధతోలేచి
స్నానసంధ్యాదినిష్ఠలను దీర్చి
సుప్రభాతంబులు స్తోత్రముల్ గావించి
శుచితోడ ప్రతిమల శుద్ధిచేసి
పత్రముల్ పుష్పముల్ ఫలములు గొని తెచ్చి
భక్తిమై నీపాద పద్మములను
పూజించి యాత్మలో పొందుగా సంధించి
అష్టాక్షర సుమంత్ర మార్యమతము

తే  విధము జపియించి నిత్యంబు వేద ధర్మ
మార్గమున బ్రతికిన వాడె మాన్యజనుడు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 20

సీ  సకల జీవభవంబు సంహరించెడినీవు
కౌసల్య గర్భాన గలిగి తెట్లు
ఓంకారమనునింట ఒనరనుండెడి నీవు
చిగురాకుటింటిలో జేరితెట్లో
వెలలేని శ్రుతులను వలువలొందెడి నీవు
నారచీరలగట్టగోరి తెట్లో
సతతయోగామృత సారమానెడు నీవు
కసరుగాయలనోట మెసగితెట్లో

తే  ఇనుము కొఱకగ్గి కొక దెబ్బ యనినయట్లు
సాధుజనులకై నీకిన్ని శ్రమలు గలిగె
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 21

సీ. పరమాత్మ నినుబాసి ప్రకృతి బడిననుండి
భువినెన్ని యోనుల బుట్టినానొ
పుట్టి చచ్చుచునిట్లు బుద్ధిహీనత చేత
ఎన్ని సంసారముల్ పన్నినానొ
అట్టి సంసారంబులందు నజ్ఞత చేత
కర్మ ఘట్టములెన్ని కట్టినానొ
తత్కర్మములయందు తర్కించిచూడగా
ధర్మవర్తనలెన్ని దప్పినానొ

తే. కటకటాయేమిసేతు నాకలుష రాశి
బాయుటెప్పుడో నినుజేరుభాగ్యమెపుడొ
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 22

సీ. అబ్జాక్షనిను గూర్చి యభ్యసింపగలేని
అష్టాంగ యోగంబులన్ని రిత్త
నిగమాంతనిను గూర్చి నేర్చియుండగలేని
అఖిల విద్యాశాస్త్ర మరయపొల్లు
శ్రీనాథ నినుగోరి సిద్ధిపొందగలేని
అణిమాదిసిద్ధులు నన్ని బీఱు
జగదీశ నిన్నెంచి సల్పుచుండగలేని
అవని సత్కర్మంబులన్ని సున్న

తే. సార్థకములయ్యు నినువినా సాధకంబు
లన్నియడవిగాసిన వెన్నెలట్లుగావె
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 23

సీ డబ్బు జొబ్బిలునాడె దగ్గఱి చుట్టాలు
కఱవుకాలంబున కానరారు
ద్రవ్యంబుకలనాడె ప్రభుల మర్యాదలు
దారిద్ర్యమున దరిజేరనీరు
ధనములుండిన నాడు జనమెల్ల మిత్రులు
సంపదల్లేకున్న శత్రులెల్ల
కాసులు కలనాడె దాసులు భృత్యులు
కొఱతలుండిన చీడ పురుగు లంత

తే కలిమి కలనాడె జగము నఘనత చూడ
స్వార్థ బద్ధమ్ము వ్యర్థమీ చతుకు జగము
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 24

సీ ఎందాక రాజ్యంబు లెందాక భోజ్యంబు
లీలోక పూజ్యంబు లెంతవఱకు
ఎందాక చదువులు యెందాక పదవులు
ఈ ఖ్యాతి గౌరవమెంతసేపు
ఎందాక సౌందర్యమెందాక సంపదల్
ఎందాక నాలుక సొందురుచులు
ఎందాక బంధువులెందాక బలములు
లీదేహభోగంబు లెంతవఱకు

తే ఎందుకీ మోహదాహంబు లిహమునందు
మూడునాళ్ల వేడుక కింత మోసపడుదు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 25

సీ శైశవంబున తల్లి చనుబాల కొఱకు చింత
అర్భక ప్రాయంబు నాట చింత
యౌవనంబున పెండ్లి యాడుటకై చింత
దార లభింప సంతాన చింత
సంతతి గలిగిన సంపత్తునకు చింత
సంపదబ్బిన పేరు పెంపు చింత
దొడ్డ పేరుంగల్గ దొరతనం పుంజింత
దొరతనంబున చచ్చువఱకు చింత

తే చింతలేకుండు టెపుడయ్య జీవితమున
నుదురు మోపక నీ పూజ్యపదములందు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 26

సీ రాముడే నాతల్లి రాముడే నాతండ్రి
రాముడే నాగురు రత్నమరయ
రాముడే నాభ్రాత రాముడే బంధువు
రాముడే నాపాలి రక్షకుండు
రాముడే నాయాత్మ రాముడే పరమాత్మ
రాముడే నాలోని ప్రాణ వరము
రాముడే నా మేలు రాముడే మిత్రుండు
రాముడే నాభాగ్యరాశియనుచు

తే నమ్ముకొనియున్న నను నీవు నెమ్మనమున
కనులగానవు నీకింత కఠినమేల
భద్రగిరి పాల | శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 27

సీ. భవ్య గోదావరి పాల సముద్రంబు
శేషుండు భద్రాద్రి శిఖరభూమి
గర్భాలయము నీదు కైవల్యసదనంబు
ఘన రథమే నీకు గరుడపక్షి
రహా పర్ణశాల విశ్రాంతి భవనముగా
దండకాటవియె మందార వనము
వేడి గుండంబె యా విరజానదియుగాగ
మండపంబే కొల్వు మందిరంబు
అమర వైష్ణవ గణా లర్చకుల్ భక్తాదు
లావికుంఠంబు భద్రాచలంబు

తే. కాగ సీతామహాలక్ష్మి గలసి జేరి
యఖిలమేలెడు రామనారాయణుడవు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వము ల! 28

సీ. భక్తరక్షణ దీక్ష బట్టియే కదనీకు
దండకారణ్యంబు దాపరించె
భక్తరక్షణదీక్ష బట్టియేకదనీవు
ప్రాణనాయకినెడ బాయవలసె
భక్త రక్షణదీక్ష బట్టియేకదనీవు
పడరాని నిందలు బడగవలసె
భక్తరక్షణదీక్ష బట్టియేకదనీవు
విపరీత వేషముల్ వేయవలసె

తే. భక్త రక్షణార్థమె నీదు పాటులన్ని
తీరదెపుడు నీ ఋణమెల్ల దేవమాకు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 29

సీ సుందరాంగులజూడ శోధించు కందోయి
శుద్ధమౌ నీ రూపు జూచునెట్లు
పరులను వాంసింప పాటించు చేదంట
నీపాదముల పూజనేర్చు నెట్లు
మోటుకూతలగూసి మోదమొందెడు లోల
నీకీర్తనము సేయనేర్చునెట్లు
కొంటెగాథలవినన్ గోరి నిక్కెడు చెవుల్
నీకథామృతమన్న నిలుచునెట్లు

తే చెడినవారిత్రోవల యందు నడుచుకాళ్ళు
పాఱగలవెట్లు నీగుడిబాటబట్టి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ చీమగములవంటి ప్రేమచుట్టలనమ్మి
సాధుసజ్జన సేవనలుపకుండు
మధుకంటకములైన మహారాజ భోగాల
మరగి ముందటి గతి మఱచియుండు
పసిడి సంకెళ్లన బరగు సంతతిజేసి
తాపత్రయములోన దగిలియుండు
నీటిబుగ్గను బోలు నెమ్మేని భ్రమించి
దివ్యాత్మతత్వంబు తెలియకుండు

తే హరి హరీ యిట్టి మోహంపుటల్పమతికి
తెలియగలదెట్లు నీ జాడకలలనైన
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ. ఎన్నడు కననౌనొ ఈ మత్తు కనులకు
అంజనేయుడు బట్టి నడుగుజంట
ఎన్నడంటగ నౌనొ యీవెఱ్ఱినొసటికి
బ్రహ్మశిలకు నంటు పాద ధూళి
ఎపుడు కడుగనౌనొ యీ మోటు చేతికి
గుహరాజు గడిగిన కోమలాంఘ్రి
ఏ వేళ్ల చిక్కునో యీ పాపజన్మకు
శబరి సేవించిన చరణసేవ

తే. ఎన్ని నాళ్ళకు కృపజూడ నెంచినావొ
ఏమిసేతువో తుదకు నన్నిహములోన
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 32

సీ. శ్రవణ సౌఖ్యముజేసి సవిషాస్య ఫణిమణి
బుట్టిలోపలజేరి కట్టుబడదె
చర్మభోగము గూర్చి సంభ్రమమద దంతి
బక్క మానిసి చేత పట్టుబడదె
కంటి మేలునకోడి కనులకందనిలేడి
వేటకాని వలన పోటుదినదె
లలనాతి చాపల్యకలన జలధిమీను
గాలాన ప్రాణముల్ కోలుపోదె
నాసికానందంబునన్ గండు తుమ్మెద
ముకిళితామర జిక్కి మోసపోదె

తే. ఇట్టి పంచేంద్రియంబులగట్టి తనువ
ఎవరితరము నీకృపలేక ఈ జగమున
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 33

సీ ఉల్లంబురంజిల్ల నూదరా ఒకసారి
మురిసి గోపకుడవై మురళమీవు
కనుల కఱవుదీర కననీర యొకమాటు
మునులు మోహించిన ముద్దురూపు
అంతరంగంబు బ్రహ్మా నంద బడజూపు
వటపత్రమున పండు బాలలీల
పాలింపనీవు చేపట్టరా ఒకతూరి
కీర్తింప శ్రీవిష్ణుమూర్తివగుచు

తే ఘడియ ఘడియకు భక్తుల కాంక్షతీరు
వేశములు గట్టి మెప్పించు వేత్త వండ్రు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 34

సీ ఎఱుకు పైదలి గంపకెగబడినావేల
కొఱకు దుంపలదినన్ గోరికోరి
పేదపాఱుని కొంగు విప్పి బుక్కితివేల
ముక్కిన బియ్యంబు మురిసి మురిసి
గొల్లవారల జిడ్డు చల్ల ద్రాగితివేల
వెగటు నెన్నకయె నీవెగసియె గసి
మెచ్చి శూద్రుని యింట జొచ్చి సాపడితేల
చప్పని బోనంబు సంతసించి

తే కులము జూడవు రుచి శుచి గుణములనవు
భక్తనైవేద్యమేనీకు భాగ్యమేమొ
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 35

సీ తలంచితివా నీవు తత్క్షణ మాత్రాన
పైడిచేజగమంత పంటబండు
కినిసితివా నీవు కన నిమేషమ్మున
మంటచేలోకాలు మాడి పోవు
మెచ్చితివా నీవు మేలొంది త్రుటిలోన
బండ పామరుడైన ప్రాజ్ఞుడగును
రోసితివా నీవు రూఢిగా మతిపోయి
దండి పండితుడైన మొండియగును

తే చెప్పరావప్ప నీమాయ చేష్టలెల్ల
ఇంద్రఋషి జాలనుత జగదింద్రజాల
భద్రగిరి పాల । శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 36

సీ వేదశాస్త్ర పురాణ విశ్వాస దూరుండు
మూర్ఖవాదముతోడ మొఱుగువాడు
ధర్మమార్గంబును తప్ప ద్రొక్కినవాడు
పరులను హింసించి బ్రతుకువాడు
ఒకరి మేలును జూచి ఓర్వజాలనివాడు
సాధులనొప్పించుశఠజనుండు
ఆత్మవిచారంబు నరయ కుండెడువాడు
ఇతర నారింబొంద నెంచువాడు

తే క్రూర యోని రౌరవ మందు కూలి తుదకు
ఎన్ని మన్వంతరముల నిన్నెఱుగ లేడు
భద్రగిరి పాల । శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ. వినయ ముండని చోట విద్యకల్గని చోట
త్రాగు బోతులుమూగి యూగుచోట
సంశయంబగు చోట జారులుండినచోట
జ్ఞాను లుండని సభజరుగుచోట
కపటలుండినచోట కఠినులుండినచోట
ఏకాంతమున లేమలెసగు చోట
చపలు లుండిన చోట అపధర్మమగుచోట
మూర్ఖులే రాజులై మురియుచోట

తే. లేశమేని నీపదభక్తి లేనిచోట
నిమిషమైనను పూజ్యులు నిలువదగదు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ. బ్రహ్మ వేత్తలగాంచి ప్రణతి సేయనివారె
దుండగీంద్రకు వంగి దండమనిరి
సాధులకాసన స్థలము నీయనివారె
శఠవిటాదులకింట శయ్యలిడిరి
హరిదాసు కంఠానహారమే యనివారె
భ్రష్టులకే సిరి బంతిగట్టి
గురుని ప్రసాదంబు గుడువ రోసినవారె
మ్లేచ్ఛుల యెంగిలి మెచ్చి తినిరి

తే. ఏమి హేతువో కలిలోక మింతయింత
యింతహీనమైపోయె నింకేమి తడవు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ పంటలు వేళ్తైన పండునేల యొకటి
వంటలు వేర్వేఱు మంటయొకటి
గ్రహతారకలు వేఱుగగనంబదొక్కటి
గంగలు వేళ్తైన కడలి యొకటి
భూషణంబులు వేఱు పుత్తడి ఒక్కటి
భాషణంబులు వేఱు భావమొకటి
గోవులు వేళ్తైన గోక్షీర మొక్కటి
జీవులు వేళ్తైన దేవుడొకడె

తే ఇటుల నీ యేకతత్వంబునెఱుగలేక
గ్రుద్దులాడు దు రల్పులు ప్రొద్దుబోక
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 40

సీ విశ్వ సమ్మోదంబు వేదవేదాంతార్థ
మయ్యనీ శ్రావ్యరామాయణంబు
ధర్మాది పురుషార్థ దర్శనాం జనరాజ
మన్ననీ భవ్య రామాయణంబు
వాల్మీకి గిరి నుండి వచ్చు పావన గంగ
మహికి నీ దివ్య రామాయణంబు
భవసాగరముదాట పరమ తరండంబు
ఆది సత్కావ్య రామాయణంబు

తే వేయునేటికి భక్తుల వేల్పుటావు
వశమెరామాయణామరవాగ్వనార్థ
మహిమ బలుక వేతలల పెంచాముకైన
వాసవాచార్యునకునైన వర్ణనమున 41

సీ. సాక్షి మాత్రుండ నీ సంకల్పమున జేసి
మూల మాయయొకటి ముందు బుట్టె
దానివలన బుట్టె దగమహాత్తత్వంబు
నద్దానసోంకార మావహాల్లె
ఓంకారమున బుట్టె నౌనర శబ్దము శబ్ద
తన్మాత్రతో బుట్టె తగనభంబు
గగనంబుచేగాలి గాలిచేతను నిప్పు
నిప్పులో పల నీరు నీటనవని

తే. అవని నోషధు లోషధులందునన్న
మన్నమున జీవదేహమై అలరె కలిగి
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 42

సీ. శ్రీవత్సశుభదివ్య చిహ్న భాసితవక్ష
సకల సన్మఖఫలసారభక్ష
పాలాక్షసఖ। లోకబాంధవ చంద్రాక్ష
ధరణీ భార నివారధర్మ దీక్ష
అఖిలాండకోటిధాత్రండ పాలన దక్ష
సనకాది ముని ఋషి సన్నరీక్ష
ప్రక్షరాక్షస మదమాతంగహర్యక్ష
మండితతూణ కోదండకక్ష

తే. స్వామి దయసేయు నీదు కటాక్ష భిక్ష
అన్ని విధముల నీవె నాకందు రక్ష
భద్రగిరిదక్ష శ్రీరామ భక్త రక్ష
కలుషజన శిక్ష తాపస కల్పవృక్ష 43

సీ ఎన్నికష్టములైన ఇష్టంబుతో నోర్తు
విశ్వేశ నిను గాంచు విధము నందు
అవమానముల నెన్నియైన భరించెద
పరమాత్మ నిను జేరు పథమునందు
నిందలెన్నో చెవి విందుగా భావింతు
దైవమానిను జేరు తలపు నందు
ప్రాణ హానికినైన భయమునొందగబోను
కమలాక్ష నిను బొందు కారణమున

తే స్వామియే త్యాగమునకైన సాహసింతు
నిన్నుగొల్చు సౌభాగ్యంబు నన్నుజేర
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 44

సీ చెప్పుట సులభంబు చేయుట కష్టంబు
నీతులు ధర్మముల్ నిక్కముగను
కోరుట సులభంబు చేరుట కష్టంబు
బ్రహ్మాండమున నిష్టభాగ్య ఫలము
వినుటెల్ల సులభంబు మననంబు కష్టంబు
వేదాంత విజ్ఞాన విద్యలెల్ల
ఆర్జింపకష్టంబు వ్యయపెట్ట సులభంబు
సద్గుణంబుల ధర్మ సంపదలను

తే చూడ దుష్టై నరక మేగసులభతమము
శిష్టుడై నిన్ను జేరుటకష్ట తరము
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 45

సీ నినుజేరుటకు తోడు నిలువని నిజదార
దా రగాదది పాలి దయ్యమయ్య
నినుజేరుటకు తోడుగను లేని పుత్రులు
పుత్రరూపమునున్న శత్రులయ్య
నిను గొల్చుటకు తోడుగను లేని అంగంబు
అంగంబుగాదది యముని సీమ
నిను బొందుటకు తోడుగను లేని చిత్తంబు
చిత్తంబుగాదది చిత్ర హింస
నిను జేరుటకు తోడు నొనర నివృత్తియు
వృత్తిగాదది మెడమిత్తి గాని

తే పూని నిను జేరుటకు తోడుగాని భుక్తి
భుక్తి కాదది కటువిష యుక్తి గాని
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 46

సీ అల్పుండు పలు పాట్ల కల్పవృక్షము జేరి
జీడిపండ్ల నొసగవేడు భంగి
పామరుండార్తితో కామధేనువు గాంచి
నోరూరి కుడుములు కోరుభంగి
ఎడ్డెవాడు తపించి దొడ్డ వేల్పును జూచి
కుంచెడు తవుడు వరించు భాతి
చింతామణిన్ మందచిత్తుండు చేపట్టి
చింతగింజఁను వాంఛించుకరణి

తే శశ్వదానంద మొసగు నీ చరణమంటి
నశ్వరైశ్వర్యముల గోరు నరుడు మఱచి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 47

సీ ధర్మాత్ముడెవ్వడో దుర్మార్గుడెవ్వడో
తెలియరాదయ్యా ఈకలియుగాన
సాధ్వియెవ్వతొ మఱి స్వైరిణి ఎవ్వతో
తెలియరాదన్న ఈ కలియుగాన
దొంగలెవ్వరొ మఱి దొరలెవ్వరో చూడ
తెలియరాదన్న ఈ కలియుగాన
శత్రులెవ్వరొ మఱి మిత్రము లెవ్వరో
తెలియరాదన్న ఈ కలియుగాన

తే భక్తులెవ్వరో నాస్తిక రక్తులెవరొ
తెలియ లేకుండ చేసె నీ కలివరుండు
ధర్మ సంత్రాతరామసీతాసమేత
భద్రగిరి నాథ సద్భక్త పారిజాత 48

సీ ధనము నిమ్మని నిన్ను దగిలి కొల్తురు గాని
గుణము నిమ్మని కోరి కొలుచుటరుదు
పదవుల కాంంచి ప్రార్థింతురే కాని
చదువులిమ్మని కొల్చుజాణలరుదు
శర్మంబులిమ్మంచు సాగి పూజింతురు
ధర్మంబు లిమ్మని దలచలేరు
కోరికల్ దీర్పనిన్ గోరిసేవింతురు
నిష్కామ మనమీయ నిన్ను గనరు

తే భోగముల గోరి భజియింత్రు పూని నిన్ను
త్యాగమొసగ భజించెడి యోగులరుదు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 49

సీ పతితలందున పతివ్రతలెందఱున్నారొ
కలుష మిళితమైన కలియుగాన
భర్తలు గలిగిన బంధకు లెందఱో
ఖలయుక్తమైన ఈ కలియుగాన
దొరలందుచూడగా దొంగలెందఱో మఱి
క్రమము లేనట్టి ఈ కలియుగాన
దొంగలందున మఱి దొరలెందఱున్నారొ
కడుధర్మ హీనమౌ కలియుగాన

తే సాధు సన్యాసులందు సంసారులెవరొ
అరయ సంసారులందు సన్యాసులెవరొ
కపట పూరితమైన ఈ కలియుగాన
తెలిసికొని నీవె నవరించు దేవ దేవ భద్ర 50

సీ దంగౌచౌ దొరయౌచౌ భృంగార మార్జించి
ఇలుగట్టువానిదే తెలివియంద్రు
జారిణీత్వమునైన సాధ్వీత్వమునవైన
సంతతిగనుదాని సాధ్వియంద్రు
శీలపౌరుషముల జెడియైన ఇల్లాలి
సాకు వానినె పురుషార్థి యంద్రు
వేసాలమోసాల దోసాల గద్దెక్కి
పేరు కెక్కిన వాని పెద్దయంద్రు

తే భళిభళీ యెంత వింత ఈ కలియుగంబు
మానవుల బుద్ధులీ విధి మారి పోయె
భద్రగిరి పాల ! శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 51

సీ ఎదుటి వారల యేడ్పునెదిరి చూచుటలోన
కాలయాపనచేయు పాలసుండు
ఇతరుల మురిపించి అతడుసంతసపడున్
సతతంబు ఎచటైన సద్గుణుండు
తనకీడు నోర్చియు ధర్మాత్ములం జూచి
నొప్పించి యుప్పొంగు ముప్పెనరుడు
తను నష్టపోయిన నొనగూర్చి పెరమేలు
ఆత్మ తృప్తని బొందు అమలబుద్ధి

తే భక్తి గనడునిన్ కననీడు బద్ధుడొరుల
ముక్తినొందుతా నొందించు బుద్ధుడెలమి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 52

సీ కష్టంబులెన్నైన కనగ నోర్చెద కాని
దుష్టుల గనునట్టి కష్టమోర్వ
వసటల నెన్నైన కనిసహింతునుగాని
గుణహీనులధ్వని వినగనోర్వ
బాధలనెన్నైన పడుచు తాళెదగాని
భ్రష్టుల ఛాయలు పారనోర్వ
దెప్పరాలెన్నైన నొప్పకుందునుగాని
ముప్పెల వాసన గుప్పనోర్వ

తే ఉర్విపనిక యెన్నివంతలో ఓర్తుగాని
కపట భక్తుల జోలిరాకెపుడు నోర్వ
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 53

సీ కాలాభ్రములైవచ్చు గండముల్ నిను గొల్వ
పూలవిధంబున వ్రాలిపోవు
పిడుగులవలె బడు ఇడుములునినునమ్మ
పుడకలవలె తేలిపోవగలవు
నాగులవలె వచ్చు రోగముల్ నీ దయన్
రాగాలు తీగలై సాగి వీగు
బెబ్బులులై వచ్చు భీతులు నీ కృపన్
గొబ్బున జింకలై గూడిపోవు

తే పాపు లొనరించు అపకార భారమంత
స్వామి నిను నమ్మ ఉపకార సారమగును
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ కుడువ ననుభవంబు కూడిక లేకున్న
నోటబడిన జారు కూటి పిడుచ
సత్యవంతునకైన సంచిత కృతముచే
సంకెళ్లు పడి చెఱసాల గలుగు
ఋణబంధ మునగల్గు పృథ్విలోపల జీవ
జాలసంబంధాలు సక్రమమున
వ్యాధిచే దేహంబు బాధింప బడనున్న
గాటు మందులకైన కాదు బాగు

తే అవని ప్రారబ్ధమెంత మహాత్మునకును
చింత చేసిన సోకక చెదరిపోదు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!

సీ ఏవన సీమలో ఏ మూలికున్నదో
ఏమందు లోపల ఏమి గుణమొ
ఏ మందిరంబున ఏ సాధ్వియున్నదో
ఏ జాల నే రత్నమెలమి గలదొ
ఏ క్షితిజంబున ఏతీరు ఫలమౌనొ
ఏ ఫలంబందున నేమిరసమొ
ఏ యూరిలోపల ఏపుణ్యుడున్నాడొ
ఏ మహాత్మునిలోన యేమహత్తొ

తే ఏనరునిలోన ఏజ్ఞాన మెసగినాదొ
తెలియకుండ నిర్లక్ష్యంబు సలుపరాదు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 56

సీ శ్రీరామ మూర్తినిన్ సేవించినంజాలు
ఎల్ల దేవతల సేవించినట్లె
ఓంకార ధామనిన్ ఒప్పించినన్ జాలు
ఎల్లవేలుపుల నొప్పించినట్లె
ఆత్మాభిరామ నిన్నర్చించినను జాలు
ఎల్ల దైవముల నర్చించినట్లె
చిత్కళారామనిన్ చింతించినను జాలు
ఎల్ల మంత్రములు జపించినట్లె

తే అత్మపరమాత్మ రామ నిన్ అంద చాలు
పొందదగిన విందందెల్ల పొంది నట్లె
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 57

సీ. వినియు విననివాడె తినియు తిననివాడె
కనియు కననివాడె కర్మయోగి
పలికి పల్కనివాడు చలిపి సల్పనివాడు
నిలక నిల్చినవాడె నిజము మౌని
తెలిసి తెలియకుండు తలచితలపకుండు
మురిసి మురియకుండు పరమ హంస
పొంది పొందనివాడె క్రంది క్రందని వాడె
అంది యందక నుండు నతడె జ్ఞాని
రాజయోగులు సిద్ధు రాజ్య పూజ్య లరయ
పంకంబునంటని పద్మములను

తే. ఎనసి మహనీయులటనట ఇలను గలరు
మూర్ఖులోపక నిందలు మోపు చుండి
పాపముల మూట తలపైన భద్రపరచి
అనుభవింతురు చివరకు యముల చెంత 58

సీ. పుట్టుసావులు లేని గట్టి దేవర మమ్ము
పుట్టించుటకె నీవు పుట్టినావు
సుఖ దుఃఖములు లేని శుభసదానందమ
మ్మేర్పింప దబ్బరేద్పేడ్చినావు
కర్మగంధములేని నిర్మలుండవు మమ్ము
ఆడింప నాటకాలాడినావు
జంటతంటలు లేని యొంటిదేవుడమమ్ము
జంటచేయుటకె నీ జంటకొనుట

తే. ఎఱుగరాదబ్బ నీ మాయ యెవరికైన
ఆది మధ్యాంతరహిత వేదాంతసహిత
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 59

సీ. కాకాసురుని తప్పు క్షమియించు దైవమ్ము
క్షమియింపకున్నె నా కలుషములను
మంకుపౌరుల తప్పు మన్నించు మన్నీడు
మన్నింపకున్నె నామంకు గుణము
శత్రువనుజునకే శరణమిచ్చిన స్వామి
ఈ దీనునకు దాపునీయలేడె
పరమ పాపికి రాయబారమంపిన తండ్రి
సవరింపకున్నె నా సంగతులను

తే. అనెడు పేరాసతో నిన్నె ఆశ్రయించి
నాడ ఏమిసేతు వౌనన్నునాథనాథ
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 60

సీ. చూడ చూడ్కులులేక చూచుచున్నావంత
వినగ వీనులు లేక విందువంత
నడువ నడ్గులు లేక నడుచుచున్నావెల్ల
చేయ చేతులు లేక చేతువన్ని
ఆకలి లేకయే ఆరగించెద వెల్ల
లలన లేకుండయే పలుక గలవు
రూపు లేకయె విశ్వ రూపంబు దాల్తువు
ఎఱుకలేకయె సర్వమెఱుగ గలవు

తే. దేవ దేవ మాతరమౌనె తెలియనిన్ను
నీయనుగ్రహమునగాక నిర్మలాత్మ
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 61

సీ. సకల లోకములకు సంస్రమాట్టు వీవయ్యు
పక్షికి పిండ తర్పణము నిడుట
ముజ్జగంబుల చేత మ్రొక్కులుగొను నీవు
మునిపత్ని పదముల మోకరిలుట
అఖిలామరుల చేత అర్చింపబడు నీవు
ముని భృగుపాద తాడనము బడుట
ముమ్మూర్తులే నీకు ముందు సారథులైన
రక్తి కవ్వడికి సారథివి యగుట

తే. ఎంత ఆశ్చర్యమయ్యా నీవింత చరిత
భక్తులను పెంపు జేసెడి యుక్తిగాక
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 62

సీ. క్రోతికైనను రీతి కుదుర నేర్పగవచ్చు
నీతి నేర్వగలేడు నీచ నరుడు
మొండి కుక్కకు బుద్ధి మొనయజెప్పగవచ్చు
నిండు తిక్కకు చెప్పనేర డెవడు
ఉక్కుగుండులనైన నుడికింపగా వచ్చు
కరగింప తరమౌనె కఠిను గుండె
బండలపై పంట పండింపగా వచ్చు
పరమలోభినడుగ ఫలము లేదు

తే. మట్టినైన పసిండిగా మార్చవచ్చు
నాస్తికుల ఆస్తికుల సల్పనలువవశమె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 63

సీ పిల్లపిల్లకు నొక్క తల్లివై తండ్రివై
కని పెంచుచున్న నీ ఘనత ఘనత
ఒక్కొక్క వత్సకు ఒక్కొక్క గురుడవై
బ్రతుకు తెరువు చూపు ప్రౌఢి ప్రౌఢి
లోకంబునకు నొక్క లోకేశ్వరుండవై
చతురత నేలు నీ శక్తి శక్తి
తలతల కొక్కొక్క తలపిచ్చి వలపిచ్చి
కర్మాబ్ధి తేల్చునీ క్రమము క్రమము

తే మత మతంబున కొక్కొక్క మార్గమగుచు
భక్తులకు ముక్తి నిచ్చు నీ యుక్తియుక్తి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 64

సీ ఇంటికింగల మంటి మంటలు చెలరేగ
ధారకై నూతిని ద్రవ్వు సరణి
కుండలి దష్టుడై డిండీరములు గ్రక్క
చిలువ మంత్రం బభ్యసించుకరణి
జంఘాలముగ పొంగి ఒలరాశిపై బడన్
వారధికై యత్న పడిన భంగి
నెట్టన శాత్రవుల్ ముట్టడింపుచునుండ
కదన శక్షకు గురున్ వెదకుకరణి

తే మరణ దశనుండి నినుగోరి మందబుద్ధి
శరణుజొచ్చిన ఫలమేమి మొఱలు పెట్టి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 65

సీ. ముఖ ధావనాదికంబులకు ముందొక గంట
స్నానాంగరాగాల జరుగు గంట
చిరుదిండి తేనీళ్ల కొఱకర గంటయౌ
కనగ వృత్తిని మూడు గంటలేగు
అగును భుక్తికి గంట పగటి నిద్రకు గంట
వ్యవహారమున గంటలరగు మూడు
బాలవినోదాన పాదు జాముక్కటి
మగుడ భోజనమందు దిగును గంట
సంసార జపమున జరుగు జాముక్కటి
మిగతవేళను నిద్ర మ్రింగివేయు

తే. తీరికేదయ్య నిను గొల్వ దేవదేవ
మందగొఱ్ఱెలు బ్రదికెడు మాద్రి బ్రతికి
జనన మరణ చక్రంబుల జరుగుమాకు
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 66

సీ. పతిని బాసిన యట్టి సతి బ్రతుకెంతదో
భక్తి నీపై లేని బ్రతుకులంత
తల్లినివిడు పసిపిల్ల జీవితమెంతో
భక్తి నీపై లేని బ్రతుకులంత
జలము వీడిన జలచరముల బ్రతుకెంతో
భక్తి నీపై లేని బ్రతుకులంతె
తీవియనెడ బాయు పూవుల గతియెంతొ
దేవ నిన్నెడబాయు జీవులంతె

తే. ఎంత ఘనులైన నీ భక్తి నెఱుగకున్న
వారి బ్రతుకు వ్యర్థముగాక సారమగునె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 67

సీ నా భూమి యని జీవుడీ భూమిలోపల
ఎన్ని యోనుల నుండి ఈగినాడొ
నా వారలని జీవు డేవారికెచ్చట
ఏ వానితో బుట్టి ఏడ్చినాడొ
నా రాజ్యమని జీవుడీ రాజ్యములలోన
ఎట్టెట్టి జన్మంబు లెత్తినాడొ
నా దేహమని జీవుడీ దేహ మోహాన
తోలు తిత్తుల నెన్ని తొడిగినాడొ

తే జీవుడీ మమకారముల్ జేసి ఇందు
ఎన్నియుగములు గడచెనో నిన్ను విడచి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 68

సీ కాంక్షించు వానికి కాక నీదర్శన
మిక యెవ్వరి కినిత్తువెఱుగనయ్య
తపయించువారికి తక్కనీ తత్త్వంబు
మఱియెవ్వరికి తెల్పుమర్మమేమొ
వేడినవారికి విడిచినీ పదసేవ
చిక్కున దెవరికో చెప్పవయ్య
ఆశ్రయించిన వాని కవకనీ య భయంబు
ఇక ఎవ్వనికినిత్తొ ఏమొ స్వామి

తే కోరి చేరిన భక్తుల కోర్కె దీర్చి
పేరులేని వాడవు పెద్ద పేరుగనుము
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! 69

సీ. పాపులలో మహా పాపుడనై నేను
చేయరాని పనులు చేయవచ్చు
తులువల కంటెను తులువనై నోటితో
పలుక గూడని వెన్నొ పలుకవచ్చు
చపల చిత్తులకంటె చపల చిత్తుడనౌచు
పొందదగనివెన్నొ పొందవచ్చు
అలుపులలో మేటి అలుపుడనైయెదన్
తలపకూడని వెన్నొ తలపవచ్చు

తే. కాని నీ శరణాగత త్రాణబిరుద
గుణమదెటువోయె లేశంబు కనగరాదు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 70

సీ. శిక్షించినను నీవె రక్షించినను నీవె
పక్షపాతము లేని ప్రభువరేణ్య
మోదమిచ్చిన నీవె ఖేదమిచ్చిన నీవె
సాదమిచ్చియు కూర్మి సాక నీవె
కీర్తినీదే అపకీర్తినీదే నాదు
కర్తవ్యమున మహాకారణుడవు
ఫలము నిచ్చిన నీవె దళము నిచ్చిన నీవె
బలము నీవే నాకు భాగ్యమీవె

తే. అస్మదనుభవ సంబంధమంతనీదె
నాది అను మాట లేశంబు లేదులేదు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 71

సీ తెరపైని నటియింప విరిబోణి గనికోరి
కౌగిలింపగకామియేగు కరణి
శ్రీగంధ రసమును జిహ్వ ఉవ్విళ్ళూరి
వెజ్జిచేకొని నోట జుఱ్ఱుకరణి
చినుకు పూసలగాంచి ఘనతండుల భ్రాంతి
వెంగలివంట గావించు కరణి
బాలుడాకటనోట బట్టి పాలనొకట
గ్రోల పాలింటిని జీలు కరణి

తే సృష్టి వినియోగపడియెడు రీతి గనక
వికటతత్వాన జీవుండు విఫలుడగును
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 72

సీ కోసలరాముండు బాసట నాకుండ
కొదవ ఏమనుచు నెమ్మదిగనుంటి
ఓంకార రాముని కింకరుండను నేను
సంకట మేమంచు సాగుచుంటి
వేదాంతరాముని పాదాంతికము నుంటి
ఇతరంబుతో పనియేలనంటి
ఆత్మాభిరాముడే అండయై యుండంగ
నాయత్నమేమంచు నమ్మియుంటి
యోగిరాముండు నాయుల్లంబులోనుండ
రాగరోగపు జన్మ రాదటంచు

తే అన్నివిధముల దైవమే యనుచు నమ్మి
యుంటి నన్నేమి సేతువో యుర్వీతుదకు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 73

సీ అలికన బీజంబులన్ని మొలవలేవు
మొలచిన పైరెల్ల నిలువబోదు
నిలచినపైరంత వెలను ఫలింపదు
ఫలియించు పంటంత ప్రాప్తికాదు
చేసిన కృతులెల్ల సిద్ధింపవెప్పుడు
కోరినవన్ని చేకూరవెపుడు
పుట్టుమొగ్గలు నన్ని పూవులుకాబోవు
కాయు పిందియ లెల్ల కావు పండ్లు
పఠియించువారెల్ల పండితుల్ కాబోరు
అందిన దంతయు పొందలేరు

తే కావునను మోదఖేదాల కట్టు వడక
భావమున నిన్ను బొందుటే పరమశాంతి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 74

సీ పరమామృతము తీపి పాలమీగడ తీపి
పంచదారల తీపి పనసతీపి
నారంగ ఖర్జూర నారికేళపు తీపి
ద్రాక్షాది సకల ఫలాల తీపు
జున్నుగడ్డల తీపి జుంటి తేనియ తీపి
కన్నకడుపు తీపి కలిమి తీపి
చదువు పదవి తీపి సద్రూపపుందీపి
సుదతికెం జిగురాకు పెదవి తీపి
షడ్రసాన్నపుతీపి సౌఖ్యనిద్రలతీపి
సత్కీర్తి గౌరవ జయము తీపి

తే అఖిల సృష్టిలో గల తీపులన్ని గలసి
రామనామంబు తీపితో రావొకింత
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 75

సీ॥ నిన్ను నమ్ముట కంటె నీ నామమును నమ్మి
ధ్యానించు చుండుటెధన్యతమము
నీపల్కు వినుటకై తాపమొందుటకంటె
నీ కథల్ విని మన నేర్వ సుఖము
నీకు వేచుట కంటె నిజనిర్మలాత్ములౌ
నీ భక్తులకు వేచ నేర్పుతనము
నీ రూపమును జూడ నిలిచి యుండుటకంటె
నీ కృపన్ గన గోర నిందు మేలు

తే॥ సాకృతిగ నిన్ను నొకచోట నరయుకంటె
అంతటను నీని రాకృతి నరయ శుభము
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 76

సీ॥ చెడ్డవారల స్థితి చెవులార విన్నను
చెడుగులు చెడు బుద్ధి విడువ బోరు
ద్రోహులొందుచునున్న దుర్గతి జూచుచు
దుష్టులు దుశ్చేష్ట తొలగలేరు
అనుభవించెడు పాపమను భవించుచు నుండి
చెనటులు పాయరు చేదు గుణము
ఉపకార మొనరింప ఉరగ వృశ్చికములై
అపకార మొనరింత్రు కపట నరులు

తే॥ కానసప జ పాపుల బట్టి జ్ఞానబోధ
చేయుటే తప్పు కాలంబు చెడు మతి చెడు
అట్టివారికి కడు దూరమందునుండి
జీవనంబును చేయుటే శ్రేయమగును ॥భద్ర॥ 77

సీ. రామనీ సద్గుణ లక్షణంబులు చెప్ప
ఈ అలంకారంబులేమి లెక్క
రామనీ సద్గుణ రాజిని కీర్తింప
ఈ శాస్త్ర సంగీతమేమి లెక్క
రామనీ సచ్చరిత్రంబుల వర్ణింప
ఈ వేద సాహిత్య మేమి లెక్క
రామనీ నామ మంత్రార్థంబు నెన్నగా
ఈ యొక్క నరజన్మ మేమి లెక్క

తే. చంద్రునకు నూలు పోగను సామెతట్లు
పొల్చుటయె కాక నీకిలపోలు నెవ్వి
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 78

సీ. కలిమి లేముల దాటి వెలుగు నీడల దాటి
కులమత గుణరూపములను దాటి
సుఖదు ఖముల దాటి సఖశత్రువులదాటి
శీతోష్ణముల యొక్క స్థితిని దాటి
మానావమానాల మంచి చెడ్డల దాటి
కర్మ ధర్మంబుల గతుల దాటి
హర్షేర్ష్యలను దాటి అఖిల ప్రకృతి దాటి
పుట్టు సావుల యొక్క గెట్టుదాటి

తే. ఎఱుక మఱపుల పొలిమేర లెలమి దాటి
నిన్ను విడక కొల్చిన జ్ఞాని నిన్ను ముట్టు
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 79

సీ దుర్మార్గుడొనరించు ధర్మకార్యములందు
పాపంబు లెవ్వియో ప్రబలియుండు
పుణ్యాత్ముడొగి చేయు పొరపాటులందైన
పుణ్యంబు లెవ్వియో పొదిగియుండు
గుణహీను డొనరించు ఘన గౌరవములందు
అవమాన మేదియో అమరియుండు
గుణవంతుడొనరించు గొప్పవంచనమందు
గౌరవం బెద్దియో కలిగియుండు

తే సజ్జనుల తిట్లు కమ్రపుష్పాల కొట్లు
దురితజనముల పన్నీరు బురదజాలు
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 80

సీ బండలలోనున్న మండూకములకును
కొండలపై జీవ కోటులకును
ఉప్పరంబున గల్గువ్యో మాండజములకు
కుంభిని లోని చకోరములకు
సలిలంబులో నున్న జలచరంబులకును
తల్లి గర్భమునున్న పిల్లలకును
పాతాళమున గల్గు భూత జాలములకు
తపము చేసెడు మౌని తాపసులకు

తే అరయ నఖిలాండ కోటి ధాత్రండములకు
ఆధరంబైన నీవె నాకాధరంబు
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 81

సీ తన గోటి వంకను తాదీర్చుకొనలేని
మనుజుండు మొనగాడ ననుచు మొఱుగు
తన స్థితిగతులను తానెఱుంగగ లేని
దబ్బడే పెబ్బనంచుబ్బు చుండు
తన జన్మ మరణముల్ తాగాన కుండియు
తనయులనే గంటి ననుచు పొంగు
మనువు మూడిన నాడు తన శరీరమునైన
తోడగొంపోవని తోలు బొమ్మ

తే నాది నావారు నేనని వాదపడగ
ఎంతనగు బాటొ ఎఱుగడీ ఎడ్డెనరుడు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 62

సీ రామనామము నోట ప్రేమతో నెప్పుట
పరియించినను బోవు భయము గోట
భవ సముద్రము దాట ప్లవ రాజ మీపాట
శరణార్థ తతికి వజ్రాల కోట
పాపబీజములెల్ల పాఱ చెఱగు చేట
స్థిరత కొలుచువారి ఎరుల మూట
వేదాంతి భసలముల్ విహరించు పూదోట
మోక్ష సౌధమున కుంబూల బాట

తే శాశ్వతముగ స్రవించు సుశాంతి కూట
సత్యమిద్ది వాల్మీకి శాసనపుమాట
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 63

సీ మరగుమందులనెన్ని మర్దించిపోసిరో
అ ఋషుల్ రామ నామౌషధమున
ఎన్ని మంత్రార్థంబు లేరి నిర్మించిరో
అ మునుల్ రామనామాక్షరముల
వేదదుగ్ధధి నెంత విరద్రచ్చి యెత్తిరో
అమరులు రామమంత్రామృతంబు
పరమరుచులనెన్ని పాకంబు బట్టిరో
ప్రాజ్ఞులు రామాఖ్య పాయసమున
ఏశక్తి యంత్రంబు లిమిడించి నారొకో
ఏయుక్తి జేసిరో ఎమో ఋషులు

తే ఏమి తంత్రమోనీ రామ నామ మనగ
మఱతు నన్నను క్షణమైన మఱపురాదు
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 84

సీ క్షీరాబ్ధివీవైతె చిన్ని బిందువు నేను
నీవు నీవే మఱి నేను నీవె
అగ్నికుప్పవు నీవు బొగ్గుప్రక్కను నేను
నీవు నీవే మఱి నేను నీవె
సూర్య బింబము నీవు సూర్య కిరణమేను
నీ యంశమే కాక నేను లేను
మేరు పర్వతమీవు జారు రేణువు నేను
నీవు నీవే మఱి నేను నీవె

తే నన్ను నీవు చేపట్టక ఎన్నటికిని
నాకు దరిలేదు నీకిక దారిలేదు
భద్రగిరి పాల । శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల।

సీ క్షత్రియాన్వయమున జన్మించితివి గాని
పావనమౌ పరబ్రహ్మ మీవు
రాజపీఠాసన రాజువైతివి గాని
తర్కింపననమాన తపసివీవు
కార్ముకాస్త్రంబులు కనగ దాల్చితి గాని
ఎంచిచూడగ నీవహింసకుడవు
భువినర రూపాన అవతరించితి గాని
దైవతమ్ముల కెల్లదైవ మీవు
సంసార కర్మముల్ సాగించితివి గాని
సరియైన తొలి బ్రహ్మచారి వీవు

తే సగుణ సాకారమున నీవు తగితిగాని
కనగ నిర్గుణ శుభ నిరాకార మీవు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 86

సీ మోసపుచ్చుట తాను మోసానబడుటకె
సహకరించుట తన సాయమునకె
నిందించుటెల్ల తానిందపాలగుటకే
కీర్తించుట యుతనకీర్తి కొఱకె
వంచించు టెల్ల తావంచింపబడుటకే
గౌరవించుట తన ఘనత కొఱకె
చంపగోరుటతాను చంపగాబడుటకే
పెంపుసేయుట తన పెంపుకొఱకె

తే ఇతరులకు నేది చేయునో అతని కదియె
ప్రతిఫలింపక తప్పదు ప్రకృతి జగతి
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 87

సీ చదువులెన్నియో శ్రద్ధ చదువనేర్తును గాని
చదువుల సారంబు నొదవలేను
ఉద్యోగములనెన్నొ ఒప్పిచేయుదుగాని
సద్యోగమును జేయ సాగిపోను
అర్థంబులెన్నియో నార్జింతిని గాని
అర్జింపదగు నర్థమమర లేను
భోగంబులెన్నియో భోగించితిని గాని
పొందనౌ యోగంబు పొందలేదు

తే ఎన్ని అనుభవించిన బ్రతుకెంతకన్న
నిన్ను బొందని నరజన్మ నిష్ఫలంబు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 88

సీ ఆత్మేశ నీచింత నాత్మలో సంధించి
మానవుండు నిమిత్త మాత్రుడగుచు
నిష్కామ మనముతో నిత్యంబు స్థైర్యతన్
చేయతగిన కర్మ చేయవలయు
అటుగాక కర్మ ప్రయత్నంబులను మాని
నట్టింట కూర్చుండి పెట్టుమనుచు
పాపహేతువగును పతన మౌరెండింట
తథ్యమేరికి కర్మ దాట రాదు

తే భౌతికాంగంబు నున్నంతవఱకు నరుడు
సాధు ధర్మ జీవనయాత్ర సలుపవలయు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 89

సీ ఒకడు మంచి మరి యింకొకడు చెడ్డయటంచు
ఏరేరి కోరి నోరూరకుండ
పలుకుటింతియె కాని పరికింప సృష్టిలో
చెడ్డవానిని సృష్టి చేసెనెవడు
కలహంసలను జేసి కాకుల సృష్టించి
కలహాలు పుట్టించు ఘనుడవీవె
నరుల సృష్టించి యసురులను గల్పించి
వైరముల్ పెట్టిన వలతి వీవె

తే హరియనుమతి లేకయె గడ్డిపరకయైన
కదలబోదన్న లోకోక్తి వదలబోకు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల! ౧౮

సీ ఉండగా ఉండగా గండు సింగమునకు
బోను మేలునికియై బోయినటుల
ప్రవసింప ప్రవసింప పంజరవాసంబు
చిలుకమ్మ హాయిగా దలచుభాతి
తినుచుండ తినుచుండ తినలేని తిక్తంబు
జిహ్వకు మధురమై చెలగుభాతి
కాంచ కాంచగ ఘోటక బ్రహ్మచారికి
తొత్తె ఆనందమై తోచు భాతి

తే పురుషుడీ మాంసదేహాన బొదిగి యుండి
పాపనరకమున్ దివియంచు భ్రమసియుండు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్త్వమూల!

సీ. దివినుండి దిగివచ్చు త్రిపథగన్ రోధింప
పంతరాగ లెదురు పడిన పోల్కి
వెలుగుల వెదజల్లి పొలుపుగా నుదయించు
అర్కుని మిడుత పిండడ్డు పోల్కి
లలిత ప్రచారమౌ మలయానిలము నోర్వ
జాలకడ్డెడు మక్షిజాలమట్లు
సాహసంబున ఘోర సంగ్రామమున మీఱు
ధీరునల్పులు విరోధించు పోల్కి

తే. సద్గుణములతో వర్థిల్లు జ్ఞాని పట్ల
విఘ్నముల్ సల్పిచెడు చుంద్రు ద్వేషగుణులు
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 92

సీ. జగముల రచియించి సాకి చింపెడుదంట
జానకి యేనీకు జానుజంట
నిగమంబు లన్నియు నిన్ను దెలియ వంట
పరమ యోగుల పాలి పాడి వంట
జనునకీ అస్థిపంజర దేహమే తుంట
తలపులో నిను పీడతగులు తంట
సాధ్వియౌకౌసల్య సంచితంబుల పంట
ఖలరాక్షసుల గొల్చు గండు మంట
నిన్ను గొల్చిన వాడు నెగ్గును రెండింట
సత్యంబు పడదంట చావు కంట

తే. కంటకము చెలరేగెనౌ నింట నింట
వెంటబడి ధర్మమును బ్రోవు వెంట వెంట
భద్రగిరి పాల ! శ్రీరామ! భక్తలోల
ధర్మగుణశీల! వేదాది తత్వమూల 93

సీ. చల్లని రామయ్య! శరణంటి రావయ్య
ఉల్లంబులో జేరియుండుమయ్య
నల్లని రామయ్య! నమ్మితి రావయ్య
ఎల్లడ నన్నేల పిలువయ్య
వైకుంఠ పురధామ! వందన మోయయ్య!
భవ శృంఖలమ్ముల బాపుమయ్య
జానకి ప్రియనాథ! సర్వవిశ్వాధామ
జాగుసేయక చేరి సాకుమయ్య

తే. అయ్య అయ్యలందఱ కీవె అయ్యవయ్య
ఒయ్యనందిమేమిడు పూజలొందుమయ్య
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల
ధర్మగుణశీల! వేదాది తత్వమూల 94

సీ. కనరాదు కనరాదు కలియుగ చిత్రంబు
కనులతో కలనైన కమలనయన
వినరాదు వినరాదు వీనుల నెపుడైన
కలియుగ వార్తలు కంబుకంఠ
అనరాదు అనరాదు హరి హరి ఏవేళ
కలియుగ ధర్మంబు నలిననాభ
తలపులో స్వప్నాన తలచగా తగదయ్య
కలియుగ చేష్టలు ఖండితముగ

తే. ఏమి చెప్పదీకలి గూర్చి రామ రామ
మొత్తమెఱిగియు మమ్మిట్లుముంపదగునె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల
ధర్మగుణశీల! వేదాది తత్వమూల 95

సీ ఆదికవీశ్వరునాత్మాభిరాముండు
నిత్యంబు నామదినిలుచుగాత
వ్యాసమహాఋషిశ్వానతో జపయించు
మంత్రంబునాశ్వాస మసలుగాక
శుకమౌని దర్శించు సుందరతత్వంబు
ఏ వేళనేను దర్శింతు గాత
సూతర్షి బోధించు శుద్ధప్రకాశమ్ము
నిలిచి నాలోసదా వెలుగుగాక
తే ఎందఱో మహర్షులు సదానంద మందు
చుండునీ సేవ నాకందుచుండు గాత
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 96

సీ ఏ వెల్గు పొడసోకి ఈలోకములలోన
సూర్యచంద్రులు వెల్గుచున్న వారొ
ఏ శక్తి కిరణాల ఈపంచ భూతాలు
అంచితంబుగ సంచరించుచుండె
ఏ జ్ఞానబలముచే ఎల్ల సృష్టి జ్ఞాన
వేదశాస్త్రంబులు వెలసె నొక్కొ
ఏ సత్య తత్వాన ఎల్లబ్రహ్మాండాలు
ధర్మమ్ముతో వృద్ధి తనరు నొక్కొ
తే అట్టి బ్రహ్మ పరంజ్యోతివైన నీవు
భద్ర సన్మంగళాకార భద్రమిడుము
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 97

సీ శారదాంబయె నన్ను చదివించు గురుమూర్తి
ప్రకృతి లోకమె గ్రంధ పారశాల
సద్గ్రంథ పఠనమే సాధుసాంగత్యంబు
స్వాధ్యాయమేనాదు సహజతపము
సత్కవిత్వరచన సంతతవ్యసనంబు
సత్ప్రవర్తనకామ్యసాధకుడను
బుధులు చూపినదారి పోయెడి పాంధుండ
సత్యంబు శోధించు స్వాంతయుతుడ

తే నీదు పద సేవకై సదా నెమకువాడ
నాదు భారంబు సర్వంబునీదె తండ్రి!
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల !
ధర్మగుణశీల ! వేదాది తత్వమూల ! 98

సీ నిత్యంబు నేత్రోలు నీరపూరంబెల్ల
నీపాద తీర్థమై నెగడు గాదె
ఆ కటికై నేను ఆరగించిన దెల్ల
తావక శ్రీప్రసాదంబుగాదె
కన్నులతో నేను గాంచు దృశ్యంబెల్ల
నీ విశ్వరూపమై నివ్వటిలదె
కరములతో జేయు కర్మసంచయమెల్ల
నీయర్చనంబుగా నిబుడలేదె

తే సతతంబు నేపల్కు సంభాషణంబులు
నీ భూషణంబులై నిలువలేవె
నేను రేయిలో పొందెడి నిద్రయెల్ల
మోక్షదాయక నీధ్యానముద్ర కాదె
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల ! ధర్మ॥ 99

సీ అచ్చు వర్ణము నీవు హల్వర్ణమగుదేను
గురువు నీవైతె లఘువును నేను
గణము నీవౌదు పగణము నేనైయుందు
యతివి నీవౌ ప్రాసమగుదు నేను
పద్యలక్షణమీవు పాదాకృతిని నేను
సారమ్ము నీవైతె శబ్దమేను
పాట పల్లవి నీవు పరగచరణమేను
ఎనస్వరమీవు సాహిత్యమేను

తే కాన ఇన్ని భంగుల నీవె గతివి నాకు
ఇట్టి నిన్ను నే నెడబాసి యెట్టు లోర్తు
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల !
ధర్మగుణశీల ! వేదాది తత్వమూల ! 100

సీ గాఢ నిశీధిలో గగన జగత్తుపై
పున్నమ జాబిల్లి పొడిచినట్లు
వాడి పోయిన మొండి మ్రోడున చిగురొత్తి
పోలుపొంద పుష్పముల్ పూచినట్లు
శుష్క తటాకాన పుష్కలంబుగ పొంగి
వారి పూరము నింద జేరినట్లు
పామర జనునికి పరమ దుర్లభమైన
అంచిత విద్య ప్రాప్తించినట్లు

తే ఎన్ని జన్మాల సంచిత మేమొ కాని
నీదు దర్శన మబ్బెనా నేత్రములకు
ఇంతకంటె కావలసినదేమి స్వామి
చాలు నీదయా నాకింతె చాలు దేవ భద్ర 101

సీ తల్లి జానకియైన త్వరపెట్టదో నిన్ను
పిల్లల బాధింప చెల్లదనుచు
లక్ష్మణమూర్తియు లక్షించి తెలుపడో
తత్క్షణంబున నీవు తరలునట్లు
హనుమన్నయైనను వినజేయడో నీకు
కనుగొని నావార్త కరుణతోడ
ధర్మకంకణమైన తగిలి బోధింపదా
జాలిచే నామొఱలాలకించి

తే ఇంతవఱకు నీ చిత్తంబు సుంతయైన
కరగకున్నది నా పూర్వ కర్మమేమొ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత 102

సీ శృంగారముగ పలురంగుల చిత్రించి
అడవి నెమలికెవండాట నేర్పె
కాకింట కలిగించి కోకిలమ్మ కెవడు
పంచమ స్వరమున పాటనేర్పె
సింగారమగు రామచిలుకకు తియ్యని
పలుకులునేర్పిన పంతులెవడు
కలహంస కెవ్వండు కలిగించె శీలమ్ము
నీరమందలిపాల నేరిక్రోల

తే లలినెను బదియు నాలుగు లక్షలోలి
చిత్రగతుల జీవులచేసి సృష్టిలోన
ఆటలాడించు స్రష్టవీవభినుతింతు
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల ! 103

సీ అందని ద్రాక్షపండ్లన్ని పుల్లనయన్న
నక్కవైరాగ్యమునాకు నిడకు
కోరికలను దాచి కూర్చుండి జపియించు
కొంగవ్రతమునాకు కూర్పబోకు
నెపములెన్నో కల్గి నెట్టబడిన నృప
కపట నేమము నీతి కలుగవలదు
ఆశవదలలేని వేశగురుని లోని
మిట్ట వేదాంతమ్ము మెదలనీకు
తే స్వచ్ఛముగ నాకు నీ దివ్య చరణభక్తి
కలుగజేసినన్ వెలిగింపు కమలనాభ !
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల !
ధర్మగుణశీల ! వేదాది తత్వమూల ! 104

సీ గోలోకమునునుండి భూలోకమునదిగి
గొల్లవారలతోడ కూడియాడి
బృందావనము నాలమందల కాచియు
లాలితమ్ముగ రాసలీలలాడి
వేణువుపూరించి రేణువు రేణువు
పులకింపగాజేసి పూజలొంది
దుష్టకంసాదుల దునుమాడి జగమున
శాంతిని నెలకొల్పి చల్లగాను
తే పార్థ సారథివయి గీత పరగతెల్పి
విశ్వమేలిన శ్రీకృష్ణ వేడుకొందు
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల !
ధర్మగుణశీల ! వేదాది తత్వమూల ! 105

సీ భూమండలంబెంత పుణ్యంబు చేసెనో
స్వామి నీ పదము శీర్షమున మోయ
త్రేతాయుగంబే సుకృతములు చేసెనో
ఈశ నీచరిత మీక్షించు కొఱకు
ఏతపో బలమౌనో ఏడవ వైవస్వ
తమనువు భవదప తార మరయ
శ్వేతవరాహ కల్పేంద్రమెన్ని మఖంబు
లొనరించి నీకీర్తి వినగ దగెనో

తే వీని పుణ్యముల్ లెక్కింప విధి గురుఫణి
పతులు చాలరు కైవల్య భద్రరూప !
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల !
ధర్మగుణశీల ! వేదాది తత్వమూల ! 106

సీ మర్కట శిశు రీతి మాధవా నినునేను
అమరంగ జ్ఞాన యోగ్యతయులేదు
మార్జాల శిశునీతి మమ్ము రక్షించంగ
భారంబు నీదంటి భక్తిబూని
భావఘోరారణ్య జీవన యాత్రలో
రథ సారథివి నీవె రామచంద్ర!
ఏ త్రోవ నడిపిన ఏ రేవు చేర్చిన
అంత నీదె స్వతంత్రమౌ గదయ్య!

తే నాప్రయత్నమింతయు లేదు నమ్మి నిన్ను
నెమ్మదిగనుంటి తంత్రాలు నేర్వకుంటి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 107

సీ మందారములు జాజిమల్లెలు మొల్లలు
సంపెంగ పొగడలు సారసములు
అగరు గంధము మంచి అంగరాగంబులు
తులసీ దళంబులు తోయములును
నారింజ ద్రాక్షలు నారికేళంబులు
పనసలు ఖర్జూర ఫలములోలి
పాలు తేనెయు నేయి పంచదారలతోడ
మంగళ గీతాల మనముతోడ

తే పావనంబైన నీపాద పంకజముల
సేవనము జేతు నిత్యంబు జేరరావె
ధర్మగుణశీల! వేదాది తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ ! భక్తలోల! 108

ఓం తత్సత్



ఓం

శ్రీ గణేశ్వరాయనమ
శ్రీ సరస్వతీ మాత్రే నమ
శ్రీ లక్ష్మీ నారాయణాభ్యామ్ నమ
శ్రీ సీతారామ చంద్రపరబ్రహ్మణే నమ

# శ్రీరామ పంచశతి

## (ద్వితీయ కాండము)

శ్రీ సీతా రుచిరాంగ కాంతికలిత శ్రీరామచంద్ర ప్రభుం
శ్రీ భూజా సుఖదానసోరు లలిత శ్రీమంతమానందదమ్
శ్రీ దేవీనివసాతివక్ష సమహం సర్వేశ్వరం శాశ్వతం
శ్రీ నారాయణ దివ్యమూర్తి మజరం సేవే సదాత్మాంబుజే

శ్రీ మైథిలీ భావ శృంగార రసముద్ర!
పావన సాకేత పట్టభద్ర!
సాధు సంకట విష సారభాండచ్ఛిద్ర!
దండిత నిజ ధర్మ ధనదరిద్ర!
ఫాల సహస్రార భాసిత మణిభద్ర!
నాగశయ్యా దివ్య యోగనిద్ర!
సకలమతాపగా సంధారణ సముద్ర!
సంతత సఫలప్రసన్నరౌద్ర!

తే. క్రూర రాక్షసారణ్య కుఠార రుద్ర!
జగము లెల్ల పాలించు నీచరణముద్ర!
భద్రగిరి రామభద్ర ! కృపాసముద్ర !
బ్రహ్మఋషి భాగవతదివ్య భావముద్ర !

సీ శ్రీ మనోవల్లభ! క్షీరజ వరనాభ!
మత్సురాకృత భాగ్య మౌనిభోగ్య!
నాకేంద్ర సేవిత! లోకేంద్రభావిత!
రాకేందు శతకోటి రమ్య సదన!
యమదండఖండన యతి భాగవతతార
ణనిజకారణనామ! జననదూర!
చలనాచలనలోక సర్వాధినాయక!
రమణీయ వేదాంతరంగసార!
నారాయణానంత! నగధర! మురహారే!
శరణాగతత్రాణ! బిరుద! వరద!

తే రఘుకులాన్వయ వైష్ణవ రామచంద్ర!
నందనందన గోవింద! సుందరాంగ!
ప్రకటసద్ధర్మ విగ్రహ! బ్రహ్మతత్వ!
పరమ పురుష! నారాయణ! భక్తమోక్ష!
దేహి శరణం మమ సదాది దేవ! దేవ! 2

సీ శ్రీసుసౌదామిన భాసిత సువిశాల
పీన వక్షోభ్రాయ తేనమోస్తు
మంగళసంగీత రంగతరంగాంగ
శృంగార మూర్తయే తేనమోస్తు
తేజ స్మయాత్మనే దేవాది దేవాయ
జ్ఞాన స్వరూపాయ తేనమోస్తు
నారాయణాయతే నాగేంద్ర శయనాయ
ధీరాతి ధీరాయతే నమోస్తు
రామావతారాయ రాజీవ నేత్రాయ
దివ్య శాంతియుతాయతే నమోస్తు

తే యతివరాశ్రయ కల్పాయ! శ్రుతివరాయ
ణాయ! వైకుంఠ వాసాయ! నయగుణాయ!
యక్షగంధర్వ గేయాయ! మోక్షకాయ!
నలినదళనేత్ర! వాంఛిత ఫలద! తేన
మస్కరోమి సదాచమామ్ పాహిదేవ! 3

సీ వేదరాశులు నిన్ను వెదకి వర్ణింపంగ
తరముగాక అలసి తలలువంచ
జ్ఞాన హీనుండను మానవమాత్రుండ
నేనెంత వాడను నిన్ను పొగడ
చేతనైనంతనే జీవించునందాక
కవనంబుతో నీదు స్తవము జేతు
శ్రీరామ శతకంబు చెప్పియు పిమ్మట
రామసుధాకర రమ్యకృతిని

తే కోకిలమ్ములతో కూర్చి పాకభక్తి
నమ్మి కోకిల రామాయణమ్ము వ్రాస
ఖండకృతులెన్నొ రచియించి ఘనులు మెచ్చ
మఖిల స్తుతియించుచుంటి నీ మహిమ దలచి 4

సీ అసురధటికి తాళకనిమిషుల్ మొఱవెట్ట
దశరథరామావతారమెత్తి
తాటకన్ మర్దించి తపసియాగము గాచి
గె తమసతి యార్తి కాలదన్ని
శివశరాసనమెత్తి సీతను పెండ్లాడి
జనకుని మాటకై వనముజేరి
చుప్పనాతిని నెట్టి గొప్పవారధి గట్టి
రావణాసురు తలల్ వ్రాలగొట్టి

తే అవిభీషణునకు పట్టమమరగట్టి
శ్రీయయోధ్య నేలినలోక శివచరిత్ర
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 5

సీ ఒక్కొక్క గళములో నొక్కొక్కనాదంబు
గుర్తింపవేర్వేఱు గూర్చినావు
ఒక్కొక్కఫలములో నొక్కొక్కమధురంపు
సారంబు వోసిన జాణవీవు
ఒక్కొక్క కుసుమమందొక్కొక్క గంధంబు
గ్రహాయింప వేర్వేఱు కలిపినావు
ఒక్కొక్కమేని పై ఒక్కొక్క రూపంబు
చక్కగా వివిధాల చెక్కి నావు
తే ఒక్కటేయైన జగములో నొకటి కొకటి
నంటనీయవు నీమాయనరయ తరమె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 6

సీ విశ్వాత్మనీదివ్య విశదాస్య మే యగ్ని
సూర్యచంద్రులె నీకు చూడ కనులు
బ్రహ్మండ భాండ ప్రపంచమే నీ మేను
కాలగ్రహములె పాదాలు నీకు
శిరము ధాత భుజాలు సురనాధులాకాశ
బిలము నాభి దిశలు వీను జతలు
కొండలస్థులు వృక్షమండలి రోమముల్
రేల్‌బవళ్లే కంటి రెప్పపాట్లు
తే వర్షమేనీదు రేతస్సు శ్వాస గాలి
కనగ జీవులే నీలోని కణములంద్రు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 7

సీ శ్యామసుందర నీదు సందర్శనము గూర్చి
కనులు కాయలుగాచె కాంచి కాంచి
పద్మాస్య నీమంజు భాషణ వినగోరి
వెతలొందె వీనులు వేచి వేచి
దానవాంతక నీదు దాపుజేరగ నెంచి
అడుగులు తడబడె నడచినడచి
శ్రీకాంత నీపాద సేవార్చనము గోరి
సొక్కిల్లె కరములు మ్రొక్కి మ్రొక్కి

తే ఎక్కడుంటివో నీరూప మింతవఱకు
జూపవైతివి నామీద కోపమేమొ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 8

సీ రమ్మసత్సంకల్పరమ్మ కుండలి తల్ప
రావయ్య జానకీ రమణి కల్ప
రాపద్మపత్రాక్ష రావిభీషణపక్ష
రావయ్య రావణబ్రహ్మ శిక్ష
రా ఓశుభాకార రాభక్త మందార
రావయ్య నిగమాంతరంగ సార
రా లోక కల్యాణ రాపుణ్యగీర్వాణ
రావన్న కైవల్య లక్ష్మీరమణ

తే రమ్మ శరణంటి వేగమే రాగదయ్య
వచ్చినన్నేలుకొనుమయ్య వరములిచ్చి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 9

సీ కనరాదు నీవంటి కరుణార్ద్ర హృదయంబు
వినరాదు నీసాటి విమలకీర్తి
చూడము నీ దీటు సుందరాకారంబు
ఆలింపమెందు నీయంత మహిమ
కలుగరు నినుబోలు ఘన సత్వదేవతల్
లక్షింపమెచట నీలక్షణంబు
చదువము నీ బోటి సచ్చరిత్రమునెందు
లేరెందు నీ తీరు స రమతులు

తే చెప్పనేటికి నీ వంటి గొప్ప వేల్పు
పుట్టలే దెందు పుట్టడు పుట్టబోడు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 10

సీ ఘోరాట వినిమంకు కోరీతి తౌక చోట
కూర్చుండదన్న యీ కొంటె మనసు
చెఱువు నీటగదలు చేపచాడ్పొకదరి
దక్కబో దబ్బ యీతిక్క మనము
చిచ్చునెచ్చెలి సోకు చిగురుటాకుల భంగి
చంచలించుచునుండు శ్రాంతిగొనదు
పక్వంబుగానట్టి పాదంసము మాడ్కి
చేచిక్కదెట్టైన చిత్రమేమొ

తే మానసేశ్వర యబ్బబ్బదీని గెలువ
ఎవరి తరమునీ బాలుని నేలుకొనుము
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజ త! 11

సీ పొలంబుపై ధాత వ్రాలుండె నందు వో
దాని మార్చింప నీ తరముగాదె
గతజన్మకర్మ సంచితమున్న దందువో
తొలగింప దాని నీ వలన గాదె
ప్రాప్తించు నిడుములు ప్రారబ్దమందువా
ఫలవంతముగ వాని మలచ రాదె
గ్రహకలివలయాన కలిగె పీడందువా
సహకరింపగ నీకు శక్తిలేదా

తే దైవములకెల్ల దైవమై తనరుచున్న
కర్త భర్తవు నీచేత కానిదేది
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 12

సీ శాంతచిత్తునిజూచి శక్తిహీనుండంద్రు
శౌర్యంబుగలవాని శఠుడటంద్రు
శీలవంతునిజూచి చాలకుత్సితుడంద్రు
మౌనంబు గలవానిమందుడంద్రు
వ్రతదాన రతుజాచి వట్టి డాంబికుడంద్రు
వినయంబుగలవానిపిరికి యంద్రు
ధీరబుద్ధిని జూచి తీవ్రగర్వుండంద్రు
వదరు బోతంద్రు సద్వక్తనుగని

తే సుగుణ శాలురయందిట్లు శుష్కమతులు
మంచితనమెల్ల చెడ్డగా నెంచుచుంద్రు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాద! సద్భక్తపారిజాత! 13

సీ దేహమారోగ్యమై దృఢతగల్గిననాడు
నీవు జ్ఞప్తికిరావు నిజము నిజము
తెల్లనై వెంట్రుకల్ దిగజారి యొడలంత
వడకుచు కఱ్ఱని నడచునాడు
కండ్లు మబ్బులుతోచి పండ్లునూడుచు చెవుల్
వినరాక అవమతిన్ గనిననాడు
రోగాలకుప్పయై రోయంగ తనవారు
మూలమంచములోన మూల్గునాడు

తే రామరామ నాదిక్కీవె రాగదయ్య
అనుచుమొఱబెట్టు మనుజుండు ఆర్తిమిగుల
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 14

సీ శ్రీరామనీనామ చింతన సేయక
కొఱగాని కోరికల్ కోరుచుండు
పరమాత్మ నీభక్త వరులసేవింపక
జడుల సావాసాన సాగుచుండు
నారాయణా నిన్నుజేరి భజింపక
కాలమంతయు వృథాకడపుచుండు
సర్వజ్ఞ నీ దివ్య చరితముల్ వినబోక
తిఱ్ఱి చిత్రాలకు తిరుగుచుండు

తే కానయీ వెఱ్ఱి జనునిపై కరుణ చిలికి
చిత్తమును శుద్ధి చేయవే శిక్షనిచ్చి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 15

సీ  పాదమైననుమాని జూదమాడుచునుండు
            చేయలే దేకాదశీవ్రతంబు
జారచోరత్వాన జాగరంబులు చేయు
            శివరాత్రిజాగరాల్ చేయవెఱచు
పరుల దోచిననాడు పండుగుల్ జరుపును
            శాస్త్రంపు పబ్బముల్ సరకుగొనదు
వెఱ్ఱిగాతిఱ్ఱిగా విహరించు పట్టణాల్
            పుణ్యస్థలములందు పోవబోదు
తే  మాధవా అంత దుర్గుణమానసమును
కాంచియెటుల మన్నింతురాకాలభటులు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 16

సీ  నడచిన నిలచిన తడిచిన జడిసిన
            కుడిచిన కూర్చున్న మిడుకుచున్న
పాడిననాడిన పడుకొన్న మేల్కొన్న
            పలికిన బడలిన పనులనున్న
వేడుకతోనున్న వెతలలో పలనున్న
            పత్నితో ప్రియములు పలుకుచున్న
భయము భక్తులనైన నయవాంఛతోనైన
            ఈ సృష్టినరులలో ఎప్పుడైన
తే  ఎట్టి విధినున్న నేవేళనెచ్చటైన
నిన్ను చింతంచు వానికి నిత్యజయము
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 17

సీ అష్టసంపదలన్ని ఆర్జించి యిష్టమై
అవనిసౌఖ్యములెల్ల ననుభవించి
ఆశలుడుగునాడె ఆత్మలోనీ భక్తి
నమరుదుననుమాట అదియవెల్గి
వందగోరునుముందు వందలందిన మీద
వేలుచేరగగోరు వేలుగల్గ
లక్షలకాశించు లక్షలబ్బినమీద
కోట్లకు పడగెత్త గోరుమనము

తే పెక్కులేల త్రిలోకముల్ చిక్కియున్న
శాంతికనరాదు నరునకు స్వాంతమందు
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 18

సీ ఆత్మసంబోధచే నమరును సౌఖ్యంబు
గురుబోధతో నబ్బు గొప్పమేలు
పరుల బోధవలన బ్రతుకు నాశనమగు
స్త్రీల బుద్ధివిలయ కాలభయము
తాను సంపాదించు ద్రవ్యముత్తమ మెన్న
తనరమధ్యమ మంద్రు తండ్రి ధనము
కులవృత్తి సేయుట గొప్పయౌనది గాక
కొలువు చేతమనుట కొంచెమగును

తే వెలది ధనముతో మఱి చోరవృత్తి చేత
బ్రతుకు వానికంటెను నీచు క్షితిని లేదు
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 19

సీ ఏ ప్రొద్దుకయ్యాని కె గురజాచెదుదాని
సొంచి సొమ్ములు దొంగిలించు దాని
పరిహసించెడి దాని పలుచ చేసెడు దాని
పరులకు మంచిదై తిరుగుదాని
మగనికన్నను ముందు తెగబడి తినుదాని
పొరుగిండ్లలో ప్రొద్దు జరుపుదాని
నాథునిష్టము మీద నడువకుండెడి దాని
పతితోడ కల్లలు పలుకు దాని
తే లేశమేని నీ పద భక్తిలేని దాని
పొత్తునున్నట్టి బ్రతుకెల్ల మొత్తుకోలె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 20

సీ నేతలు నీచుల దూతలై పోయిరి
దొడ్డ దొంగలు పెద్ద దొరలమనిరి
జన సంఖ్య ఘనమయ్యె మనుజ ధర్మమడంగె
రాక్షసకృత్యముల్ ప్రబలమయ్యె
సంస్కారములు తగ్గె శాంతియే కఱవాయె
పాపమోపగలేక ధరణి యేడ్చె
వ్యభిచారములు మీఱె వావి వరుస జారె
వ్యాధులధికమయ్యె ప్రజల లోన
తే భక్తిలేదాయె నీ మీది భయము పోయె
ముక్తి గొనరైరి కలినుండి మూర్ఖ జనులు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 21

సీ ఏనాడు శోభతో నీ నోము జరుగునో
అనాడే పండుగౌ నమరపాల
ఏప్పుట నీ గోష్ఠి యొప్పుగా విననౌనొ
అప్పుటె సరిలేని గొప్పవిందు
ఎచ్చోట నీ సేవ లింపుగా సాగునో
గణ్యంబుగానదేపుణ్యభూమి
ఏవేళ నీవర్ణ నేచ్ఛలు పొడమునో
ఆవేళ సుముహూర్త మార్తవరద

తే ఎతడు నీభక్తుడై నిన్ను నెఱుగ గలడొ
అతడె ధన్యుండు ఒగతిలో ఆర్యచరిత
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 22

సీ శరణంబు గోరినీ చాటు చేరిన నన్ను
కరుణనేలక యుంట బిరుదమగునె
దాసోహమని నీదు దాపుజేరిన నన్ను
రోసి దూరముత్రోయ వాసియగునె
పాహి పాహి యటంచు పాదముల్ పట్టిన
పాపంబు లెన్నుట పాడియౌనె
దేహిరక్షణమంచు దీనతన్ దరిజేర
దయగాంచకుండుట ధర్మమగునె

తే ఎందుకయ్య నాపై నీకు యీర్ష్య యింత
పక్షపాతంబు లేనట్టి ప్రభుడ వీవు
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 23

సీ	కలిమి బల్మిలజూచి పులకరింపగ బోరు
బహుదరిద్రతయందు బాధపడరు
భోగ భాగ్యములందు పొంగరు మదిలోన
రోగకష్టములందు రోయబోరు
ఖ్యాతిగౌరవమందు గర్వమొందగ లేరు
వంచనంబుల నాడు వగవుగొనరు
నీటిలోపలనున్న నీరజంబుల భాతి
రజములోబడ్డ పారదమురీతి

తే	ప్రకృతి కాలచక్రంబులో బడియు విధికి
చిక్కియున్జిక్కరెపుడు నీ సేవకులిల
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 24

సీ	ప్రకృతి బద్ధుని జేసి పాయసమ్మిడు కంటె
కడుజ్ఞాన మిడికాయ గడ్డలిమ్ము
శ్రీమంత మిడిపట్టు చీర లిచ్చుట కంటె
కొలువుంచుకొని నారకోకలిమ్ము
పెద్దరిక మిడిమేల్ గద్దెలిచ్చుట కంటె
తవదాసునిగ జేసి దర్భలిమ్ము
మేలిమివజ్రాల మేడలిచ్చుట కంటె
నీధ్యానమిడి చెట్టు నీడనిమ్ము

తే	మెచ్చి దేవేంద్ర భోగంబులిచ్చుకంటె
కొట్టినన్ను నీ సేవకై వెట్టి గొనుము
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 25

సీ. శూన్యాంతరిక్షాన సుడిగాలి సృష్టించి
చుక్కలన్నిలిపిన ఎక్కటీవు
చల్లని గాలిలో జ్వాజ్వల్య మానమౌ
అగ్గిని పండించు ప్రెగ్గడీవు
బగ్గనమండెడు అగ్గిలోపలమంచి
నీటిని పుట్టించు మేటివీవు
ద్రవరూప జలములో దట్టని ఘనరూప
భూగోళమునుజేయు బుధుడనీవు

తే. నీదు సంకల్పమాత్రన నిశ్చయముగ
పూవుఫలమౌను ఫలమేమొ భూజమగును
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 26

సీ. వాతపూరితమైన భూతపుంజములపై
గాడుపుపగబట్ట కదలగలవె
స్థిరనివాసంబైన క్షీరంచరములపై
నీరముల్ గోపింప నిలువగలవె
కంటికింపై పండు పంట పైరులమీద
వసుధ విసుగుచెంద నెసగగలవె
గర్భాశయమునందు గల్గుపిండమునకు
తల్లి దయ్యంబైన దక్కగలదె

తే. అట్లునీయందు కల్గునాయందు నీవు
తీంద్రముంజూప నాకేది దిక్కు తండ్రి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 27

సీ	నేను నేనని పల్కి నేను మాలిన నేను
		నిన్ను గానక మేన నీల్గుచుండు
	నన్ను నిన్నుం జూపి నిన్ను గూర్చెడి దాక
		నీ పగ్గములు వీడ నిమిషమైన
	దేహలక్ష్యంబుచే దేవనీదాసుండ
		జీవలక్ష్యాన నీ చిన్ని సుతుడ
	అత్మలక్ష్యంబుచే నైతినీ వేనేను
		లేదయ్య మనకింత భేదమెపుడు

తే	కానదూర మాలోచించి కావునన్ను
	చేతనోద్ధార సీతాంబ చిత్తచోర
	ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
	భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 28

సీ	కాంక్షలు లేవంచు ఘనత బల్కగనేల
		కాంక్షగల ద ఒకటి కాదనకుము
	మోక్షార్థియై వీడు మొఱసేయుచున్నవా
		డంచునీవెపుడైన నెంచ బోకు
	నాకమందుండిన నరకమందుండినన్
		సురజాతముననున్న నరుడనైన
	అష్టభాగ్యములున్న అష్టకష్టాలున్న
		పశుమృగాంగముగున్న పక్షినైన

తే	ఎన్నికల్పముల్ జన్మంబు లెత్తుచున్న
	వల్లెకాని నీ పదభక్తి వదలనీకు
	ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
	భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 29

సీ కమలేశ నీవిశ్వకల్యాణ రూపంబు
కాంచు యోగ్యతనాకు కలుగునెపుడొ
కాంచి నీ మృదు పాదకంజ ద్వయమ్ముల
ముదమారనుదురాని మ్రొక్కుటెపుడొ
మ్రొక్కిమైమఱచి నీ చక్కని గుణముల
నోరార స్తుతియింప నోచుటెపుడొ
స్తుతియించి భవదంఘ్రిశతపత్రముల గోరి
చేతులారంగ పూజించుటెపుడొ

తే అటుల పుట్టు గిట్టుల దాటియనవరతము
నిన్ను విడక గొల్చెడి భాగ్యమెన్నడగునొ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 30

సీ కుబుసంబు వదలిన కోడె సర్పముతోడ
కలసిసయ్యాటాడు కప్పఫలము
పొదరింట ప్రసవించి వదరు సింగపుచన్ను
గ్రుమ్మికుందెలు పాలు క్రోలుమేలు
మెండుమంటల గుప్పు పండు నిప్పుల కుప్ప
కనిమిత్తముద్దాడు కొనిన సుఖము
పొరిపొరి ఒడివాన పొంగి పారెడు గంగ
త్రొక్కిదాటగనెంచు నక్క ఘనత

తే భీష్మభౌతిక పర్వత బిలమునందు
జారి అనుభవించితినిక చాలు సాకు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 31

సీ. పంచభూతంబుల పరగ సృష్టించి ప్ర
పంచంబుజేసిన బ్రహ్మ యెవడొ
గగనమందున నిల్పి జగమంత వెలిగింప
రవికి వేతనమిచ్చు రాజెవండొ
చుక్కలన్ చంద్రుని లెక్క జూపగ పంప
యంత్రంబు బెట్టు స్వతంత్రుడెవడొ
మేదిని వర్షింప మేఘాల నియమించి
తగువిత్తనాలిచ్చు తాతయెవడొ

తే. ఇంతయైన యోజనలేక పంతమొంది
విభులమను ఒక్కనరులకు వెఱ్ఱిగాదె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 72

సీ. శ్రీకారమున పర్వతాకార శుంఠైన
మెందు వదరు బోతె పండితుండు
గుణవిహీనుండైన వినయదూరుండైన
ధనముకల్గిన వాడె ఘనత గాంచె
గుండెలేనట్టి పెన్మొండి బండండైన
కండబట్టిన వాడె గద్దె నెక్కె
తత్వశూన్యుండైన సత్వహీనుండైన
గుఱుతులుండిన వాడె గురుడు ఒగరి

తే. నేటి బుద్ధిహీనుల జూచి నేలతల్లి
మొత్తుకొనుచుండె అపమతిన్ మోయలేక
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 11

సీ. కనమృగ జాతిలో కస్తూరి మృగమట్లు
నీచ జాతిని గుణనేత లేడె
చెఱకు పైరున జూడ చేదు వెన్నున్నట్లు
సత్కులంబున దుష్టజనుడు లేడె
ఱాలలో వజ్రంపు ఱాలు గల్గినరీతి
అంకు వాడన్ పతివ్రతలు లేరె
సుప్పాణి చిప్పలో కప్పపుట్టిన యట్లు
సద్వంశమున చెడ్డ చాన లేదె

తే. గుణముకలవారె భువి గొప్పకులము వారు
గుణవిహీనులే అంత్యజుల్ గణనసేయ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 34

సీ. తగని బాధల కోర్చి తనయుల పూజింత్రు
తల్లిదండ్రుల గొల్వదలచబోరు
కల్మినందగపాప కష్టాల బడుదురు
మితమైన వెచ్చింపు మెచ్చలేరు
పరభామలన్ భంగ పరుపపాటింతురు
భార్యలమెప్పింప పాలుపడరు
ఒకరి నేరములేరి ప్రకటన సేతురు
తమకథ లెట్టి పోదలచుకొనరు

తే. చావు భోగాలబడి చావసమ్మతింత్రు
దేవనిను పొంద నొల్లరు తిక్కనరులు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 35

సీ పరువుపెరుగ నీదు భజనాలయము చేరి
సాధు సద్భక్తులన్ బాధపెట్టి
కపటులై దంభాన క్రతులువ్రతాల్ జేసి
విబుధుల వంచించి విడిచి మిండసి
తిరుగ బుద్ధి ఒనించి తీర్థయాత్రలు సల్పి
పరుల బుద్ధి జెఱపి మురిసి మెఱసి
లొంగింప లోకమున్ దొంగ భక్తని బూని
మోసంపు పనులెన్నొచేసిడాసి

తే దుష్టులై తుదన్ జెడి పోయి దు ఖ పడుచు
నిందనీపైని మోపగ నీతి యౌనె
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 36

సీ తామసానరుడు తగని పాపముచేయు
తామసంబున బుద్ధి తఱగి పోవు
తామసంబే సర్వతాపంబులకు తావు
తామసంబున చావు దాపరించు
శాంతంబుచే కల్గు సంపదల్ సత్కీర్తి
శాంతమే జనునకు సౌఖ్యమిచ్చు
శాంతంబుచే గల్గు జవములు జయములు
శాంతమే సర్వార్థ సాధకంబు

తే సత్వగుణ దేవ నీపాద సరసిజముల
సౌరభం బాను సౌభాగ్య జాతకంబు
శాంతతత్వనకె కలుగుసత్యమిద్ది
తామసైతెతామసియయి భూమిగలయు 37

సీ ఆరోగ్యమును మించు ఐశ్వర్యమననేది
సాధ్విని మించిన స్వర్గమేది
ఎక్కవిత్వముమించు సామ్రాజ్యమదియేది
సంతృప్తిమించిన సౌఖ్యమెద్ది
సత్యవాక్యము మించు సత్కర్మఫలమేది
ధర్మవర్తనకంటె తపము లెవ్వి
సుగుణ పుత్రునిమించు జగతి గౌరవమేది
స్థైర్య ధైర్యము మించు శౌర్యమేది

తే నెనరుమనసు కంటెను మంచితనమదేది
స్వామినీ భక్తికిని మించు క్షేమమేది
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 38

సీ జీవార్చనములేని దేవార్చనము లేల
దేవార్చనము లేని జీవుడేల
సంతతిఎడయని సంభోగమదియేల
సంతోష మొసగని సంతతేల
ఆరోగ్యముగ లేని అంద చందములేల
లోశుద్ధి లేని యారోగ్యమేల
దానధర్మములేని ద్రవ్య సంపద లేల
ధర్మంబు మాలిన దానమేల

తే ఫలము లీయని పాటులు పడగనేల
పంమ పల నిన్ను జూపని ఫలములేల
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 39

సీ విప్రులైయందరు వేదముల్ వల్లింప
ఓపి భూములు దున్నుకాపు లెవరు
జనులెల్ల పుణ్యులై స్వర్గంబు నొందగా
నంకమలర జేయుదురితులెవరు
రాజులైయందఱు రాజ్యంబు లేలగా
ప్రభువుల సేవించు బంటులెవరు
అందఱు త్యాగులై అకటంబులు తిన్న
రోగసృష్టిని బెంచురాగులెవరు

తే అనుచుకాబోలు లోకాలననవరతము
చిక్కు చేసి ఆడింతువు చిత్రముగను
ధర్మసంత్రాత! రమ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 40

సీ రామ రామ సునామ రామసీతారామ
రామలోక సమస్తకామ రామ
రామ రాఘవరామ రామ జానకి రామ
రామ యోగి మనోభిరామ రామ
రామ రామ సుధామ రామపరంధామ
రామ తారకనామ రామ రామ
రామమేఘశ్యామ రామకోసల ధామ
రావణాంగ విరామ రామ రామ

తే రామ! శ్రీరమా హృద్రమారామ రామ
రామవైకుంఠ జయలక్ష్మిరామరామ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాద! సద్భక్తపారిజాత! 41

సీ ఫణులనాకర్షించు స్వరయుక్త గీతంబు
మొద్దు పెంజర కేమిముద్దు దోచు
నవరస నవనీత కవనపాకము రుచి
తీవ్ర శుంఠలకెట్లు తీయనగును
మధుపమాను ల తాంతమధుర సౌరభ్యముల్
రోచ్చుటీగలకేల రుచులు గలుగు
సాధు సుగుణశీల సంస్కార చరితమ్ము
గాఢమూఢుండెట్లు గౌరవించు

తే నవ్య మధురామృతమగు నీనామ భజన
మలిన చిత్తులకె రీతి మధుర మగును
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 42

సీ తండ్రి యాజ్ఞను నాడు దాటి ప్రహ్లాదుండు
నీ భక్తుడై యెంత నేరమొందె
అన్నకే ద్రోహియై నిన్ను జేరియుమున్ను
ఆవిభీషణుడెంత అఘముచెందె
నినుగూర్చియజమానికిని వంచనము సల్పి
కుబ్జతాముండెంత కొఱత పడియె
సతుల ధర్మము మీరి క్షితి గొల్లజవరాండ్రు
నినుగూడి భువినెంత నింద గొనిరి

తే నిన్ను గూర్చిచేసిన తప్పులన్ని మెప్పె
తప్పు నిన్ను గాదని చేయు మెప్పులన్ని
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 43

సీ జిహ్వకు మధురంబు జీవికి మోక్షంబు
రామనామామృత లక్షణంబు
మూడునాళ్లు జపింప మూర్ఖుజ్ఞానియగుట
రామనామామృత లక్షణంబు
అఖిల రోగాగ్నుల కౌషధ వర్షంబు
రామనామామృత రమ్యరసము
పాతకాధమునైన పూతనేతనుజేయు
రామనామామృత రసగుణంబు

తే నారదవసిష్ఠ వాల్మీకి మారుతేయు
లకెతెలియును నీనామును లక్షణంబు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 44

సీ సంజవేళలయిందు శయనింపగదగదు
గురువు నిందను వినగూడదెపుడు
పెద్దల యెడలజ్జ పెరికి తిరుగ రాదు
ధర్మహీనుల జూడ తగదు తగదు
రోసి ఆత్మను హత్యజేసికొన తగదు
మంచిస్నేహితు శత్రుమయువవలదు
కదనరంగము చేరి కడకు బాఱ తగదు
తగినరాజున కోగు తలపరాదు

తే మితములేక ఆహారంబు మెక్కవలదు
వ్రతముచే నిన్ను మనములో వదలతగదు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 45

సీ శరణుజొచ్చిన వాని సంహరింప గరాదు
నిండు ద్రోహులను మన్నింప రాదు
పరధనంబుల గోరి పరుగు లెత్తవలదు
కూటి దొంగను బట్టి కొట్ట దగదు
అల్పుల మాటపై ఆధారపడవద్దు
మాతాపితల సేవ మఱువ తగదు
దీనలోకుల చూచి ధిక్కరింప వలదు
ముందటి మేలెంచి మురియ వలదు

తే కలలనైన సజ్జన నింద నలుపదగదు
బ్రతుకునందాక నీభక్తి బాయవలదు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 46

సీ విభుడు తాపసుఁడైన వెఱచెనో అనసూయ
కొండ గోఁగులలోన నుండ లేక
బ్రహ్మర్షి పతియని పాసె నాసుర మాత
ధర్మకష్టాలకు తాళలేక
యోగి వసిష్ఠుండు దాగెనా అడవులన్
సంసారపున్గోడు సైపలేక
రాజర్షిజనకుడరణ్యాన జేరెనా
నాయక భారంబు మోయలేక

తే భక్తి నీయందు పూనగా భయము పడుదు
రల్పబుద్ధులు బద్ధులై యీకలందు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 47

సీ తల్లి దండ్రులను ప్రత్యక్షదైవములుగా
కొలువని కొమరుండు కొమరుడగునె
గురుమూర్తి నాత్మలోపరమాత్మయని సేవ
చేయని శిష్యుండు శిష్యుడగునె
అతిది నభ్యాగతు నాదరింపగలేని
సంసారివాడు సంసారియగునె
పతిని దైవంబుగా భావించి సతతంబు
భక్తి గొల్వని సతి పతియగనె
తే రామనామమే నిర్వాణ రాజ్యమనుచు
స్మరణసేయని మనుజుండు మనుజుడగునె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 48

సీ లెక్కబెట్టగరాని రక్కసులను జంపి
ఇలనహింసా పీఠమెక్కినావు
పదునాలుగువేలపై పడుచుల ముద్దాడి
పుట్టువడ్గని పేరు పొందినావు
ఎన్నెన్ని జన్మలో ఎత్తుచు ఒగమేలి
ఒననరహితుడ వౌజ్ఞాని వీవు
నిఖిల కర్మములకు నిలయయుండ వీవయ్యు
నిష్కర్మబిరుదాన నిలచినావు
తే స్వామినీ మాయనెఱుగ గంగ సాధ్యమగునె
తాపసులకైన తాతల తాతకైన
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 49

సీ. గజరాజు గండంబు కడతేర్చ జనునాటి
తొందరెచ్చట పోయె తోయజాక్ష
మాయమ్మ సీతార్తి మాపంగజను నాటి
తీవ్రమెచ్చోదాగె దేవదేవ
బ్రాహ్మణుదు ఖంబు బాప పర్విడునాటి
ఆత్రమెచ్చో జొచ్చె క్షాత్ర వీర
పాంచాలి మానంబు పాలించజను నాటి
వేగిర మెట ట్రుగ్గె వేద వేద్య

తే. గోడుమని నేను మొఱలిడ నేడు నీవు
వినియు విననట్టులుండు టవింతయేమి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! ౬౦

సీ. భక్తితో తమ్ముండు పాదాల బడినను
కరగిమఱలిరాని కఠిన గుణము
క్షమియింపగారాని కాకాసురు దొసగు
క్షమియించు నాటినీక నికరమ్ము
నిప్పుకే నిప్పైన నిందు చూలాలినే
కానకంపిన నాటి కటిక తనము
మన్నింపరాని యామంకు శౌరులమాట
మ్రింగి మన్నించు నీ మెత్తదనము

తే. తలచి తలచి నాడెందంబు ధైర్యపడక
సంశయము నొందుచుండె నోజానకీశ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! ౬౧

సీ సంపత్సరంబైన చైత్ర శుద్ధ నవమి
రెండు మాసాలు ముందుండగానె
సౌమిత్రితో జేరి సంతోషమున నీదు
కళ్యాణ శుభదిన ఘడియలందు
రావలెనని భక్తకోవిదావళి కెల్ల
తెల్పియాహ్వాన మందింతు వంట
ఆ పెండ్లి పిల్పు నాకందింపవదె బీద
చుట్టంబు నీ పెండ్లి చూడవలదె
తే సకల బాంధవుడవు నీవు సర్వమెఱిగి
తప్పులోపల చిక్కకో ధర్మమూర్తి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 52

సీ గంధర్వ సంగీత గానంబులైనను
హేయమే నీస్తుతిన్ జేయవేని
స్వర్గశోభిత చిత్ర వర్గంబులైనను
చులకనౌ నీ రూపు జూపవేని
గణగుణ లక్షణ కలిత కావ్యంబైన
చప్పనౌ నీస్థితిన్ జెప్పదేని
కమనీయమైన శ్రీగంధంబు లైనను
కొఱగావు నీస్మృతిన్ గుప్పవేని
తే అమృతసమమైన మృష్టాన్న మైనగాని
ఇంపుగాదు నీబోలి గల్గింప దేని
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 53

సీ॥ తల్లిదండ్రులకెల్ల తల్లి దండ్రివి నీవ
దైవంబులకు నెల్ల దైవ మీవ
చదువులకెల్లను చదువుసారమునీవ
గురుజనంబులకెల్ల గురువు నీవ
మంత్రంబులకు నెల్ల మంత్రరాజము నీవ
యంత్రంబులకు మహాతంత్ర మీవ
జీవరాశులకెల్ల జీవేశ్వరుడవీవ
రాజులకెల్ల రారాజునీవ

తే॥ సుఖవితానమునకు నెల్ల సుఖము నీవ
శభములకు నెల్ల జూడగా శుభము నీవ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 54

సీ॥ దండంబు దండమో దశరథ శ్రీరామ
పసివాని గండముల్ బాపుమయ్య
కరుణ చల్లగదయ్య కల్యాణరఘురామ
తనయుని వెతపులన్ తరుమవయ్య
సాకేత వరరామ సరగున రావయ్య
ఈ కలినుండి నన్ సాకుమయ్య
కోరిపిల్చితినయ్య కోదండ ధరరామ
దారుణ మీమాయ తొలగనయ్య

తే॥ అయ్యముగురయ్యలకు మొదటయ్య వందు
రయ్యనిను దప్ప అన్యమే నరయ నయ్య
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 56

సీ॥ అండజధ్వజ! దైత్యఖండన కోదండ
భండన పాండిత్య బాహుదండ
మౌనీంద్ర హృదయాబ్జమండల మార్తాండ
రావణ రాక్షస ప్రాణగండ
ఒగిముముక్షుల కండ నొసగుపుత్తడి కొండ
పుచ్చుకో నాకోర్కి పూలదండ
స్వార్ధపరులకెపుడందదు నీయండ
దయనుండు మెపుడు నాతలపు నిండ

తే॥ ఇంట నింట నీభక్తుల పంట పండ
ఎల్లకాలంబునీకీర్తి చల్లనుండ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 56

సీ॥ గుణముల దాటించి గుణవంతు జేయవే
గుణ మింతలేని సద్గుణగణాఢ్య
రూపమున్ దీసి స్వరూపవంతు నొనర్చు
రూపంబులేని ఓరూపవంత
ద్రవ్యంబు విడిపించి ద్రవ్యవంతు నొనర్చు
ద్రవ్యమింతయు లేని ద్రవ్యదాత
జాతమున్ బాపి సజ్జాతకు నొనరించు
జాతమేలేని సుజాతకుండ

తే॥ ఎఱుక కెడబాపినన్ను నిన్నెఱుగ జేయు
ఎఱుక యుండి లేనట్టియో ఎఱుకలయ్య
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 57

సీ కల్పవృక్షము క్రింద కనకాననమునందు
బ్రహ్మాది దేవతల్ స్వస్తిపలుక
ఆనందముగ సువీరాసీనుడవుకాగ
వామాంకమున సీత వన్నెలొలుక
సుమతి వసిష్ఠుండు సురకిరీటము పెట్ట
తాపసోత్తములు స్తోత్రములు సేయ
భరతలక్ష్మణులిరు ప్రక్కల భానల్ల
శత్రుఘ్నుదర్జున ఛత్రమెత్త
గంధర్వకామినుల్ కల్యాణములు పాడ
వసువులు పువ్వుల వాన గురియ

తే వాయుసుతుడు నీ పాదముల్ పట్టి గొలువ
నాకు జూపు నీ పట్టాభిషేక శోభ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 58

సీ రామనామముతోడ రణరంగమున జేర
జయపతాకంబెత్తు స్వల్పుడైన
రామనామముచేత బ్రహ్మగ్రహంబుల
తరిమికొట్టును పెద్ద పిరికియైన
రామనామముబట్టి కామబంధము వీడి
ముక్తికాంతను బొందురక్తుడైన
రామనామము బల్క పామరుండైనను
అలరిబ్రహ్మానంద మందుకొనును

తే క్షేమకరమైన భవదీయ నామమునను
మందుడైనవాడిహపరమందు వెలుగు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 59

సీ చక్షులెవ్వని రూపు వీక్షించు పిమ్మట
ఇతర రూపము జూడ నిష్టపడవొ
వీనులెవ్వని నాద మాని వినిన మీద
అన్యనాదమువిన నాసపడవొ
కరము లెవ్వనిపాద కంజార్చనము చేసి
పరుల నర్చింపగ భ్రాంతిగొనవొ
జిహ్వాఎవ్వని కీర్తి సేయనేర్చిన మీద
ఇతర కీర్తన జేయ నిచ్ఛగొనదొ

తే చిత్తమెవని బొందియు పెరపొంద బోదొ
ఆసదానంద కందనిన్నా శ్రయింతు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 60

సీ ఏమంత్రబలముచే రామాయణము బల్కె
ఆదికవి బ్రహ్మయౌచు మౌని
ఏమంత్ర బలముచే యెలమిజ్ఞానము బొంది
జనన రాహిత్యంబు గనిరి ఋషులు
ఏమంత్రబలముచే సామీరి జవమొంది
శతయోజనాంభోధి సొగిదాటె
ఏమంత్ర బలముచే ధీమతి వ్యాసర్షి
వేదముల్ విభజించి వెలయజేసె

తే అట్టి రామ తారక మంత్రమైన నీదు
నామమును సదానామది నమ్మికొందు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 61

సీ॥ రామాయణమువంటి రమ్యగాధయు లేదు
రామ! నీవంటి రారాజు లేడు
జానకీ సతివంటి సాధ్వి యెందున లేదు
జనకు బోలిన సుహృజ్జనుడు లేడు
కుశలవులట్లు ధీకుశలు లెచ్చట లేరు
వాల్మీకినరి కవీశ్వరుడులేడు
అజపుత్రకౌసల్యలట్టి పితరుల్లేరు
ధరవశిష్ఠుని వంటి గురుడు లేడు
సౌమిత్రి భరతుల సాటి తమ్ములు లేరు
పవన నందనువంటి బంటు లేడు

తే॥ భానుజుని వంటి చెలికాడు కానరాడు
రామనామామృతము సాటిరసము లేదు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 62

సీ॥ ఏనాట పుణ్యమో ఏజన్మలతపమొ
ఏనోము పండెనొ ఇట్టి రోజు
ఎప్పటి ధర్మమో యేసత్య శీలమో
ఏదాన ఫలమొక్కొయిట్టిరోజు
ఏ సాధు దీవనో యేగురు సేవయో
ఏ వేల్పువర మౌనొయిట్టి వేళ
ఏయాగఫల మొక్కొ యే యోగ బలమౌనొ
ఏ ఋషి దర్శన హేతువగునొ

తే॥ చిక్కెనీ పాద సరసిజ సేవనేడు
చాలు నీదయ నాకింతె చాలుదేవ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 63

సీ ఎల్లబ్రహ్మాండాల తల్లివై తండ్రివై
పట్టిగా నొకరింట పుట్టినావు
గురుమూర్తులకు నెల్ల గురుమూర్తి వీవయ్య
గురువుల భావించి కొలిచినావు
అఖిల విద్యావళి కరయ వేద్యుడవయ్య
శ్రద్ధ విద్యలనెల్ల చదివినావు
జగమెల్ల శాసించు జగదీశ్వరుండవై
జనకుని యానతి సల్పినావు
ఏడ్చువారలకెల్ల నేడ్పుల మాన్పనీ
విల్లాలి కొఱకునై యేడ్చినావు

తే విశ్వమున ధర్మమార్గంబు వెల్లడించు
కొఱకె కాదయ్య నీకింత చెఱఘటించె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 64

సీ హరియను నొక్కండు హరుడను నొక్కండు
అజుడె పరబ్రహ్మమనునొకండు
ఆది పరాశక్తి యనునొక్కడతి భక్తి
అచలంబు పరిపూర్ణమను నొకండు
గణపతియను నొండు గ్రహపతి యనునొండు
గురుడె బ్రహ్మంబను నరుడొకండు
ప్రణవ నాదాక్షర బ్రహ్మగానొక్కండు
ఆత్మయే పరమాత్మ యనునొకండు

తే ఎందరెన్ని రీతులనొ నిన్నెంచుచుండ్రు
అందఱికి నీవె ఒక్కండ వరసికొనగ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 65

సీ శ్రీరామనిన్నునే సేవింతు భావింతు
కోదండరామనిన్ గొలుతు పిలుతు
వైకుంఠరామనిన్ వర్ణింతు వలపింతు
వనమాలిరామనిన్ వలతుదలతు
జానకీరామనిన్ జపియింతు తపియింతు
కల్యాణరామనిన్ కందు విందు
ఆనందరామనిన్ ధ్యానింతు రాణింతు
ఆత్మరామా! నిన్నె ఆశ్రయింతు

తే స్వప్న జాగ్రత్సుషుప్తులన్ స్వాంతమందు
నిలచినన్నేలు భారంబు నీదె తండ్రి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 66

సీ విశ్వేశ నీభక్తి వేలాది జనులలో
భావించు నొక్కండె అవటిల్ల
భావించువారిలో వేవేల లోపల
సేవించు నొక్కండె చిత్తమలర
సేవించు వారిలో చెలగవేవుర లోన
చెదరకుండు నొక్కండె సిద్ధినొంద
చెదరనివారిలో చివరి నీ తత్వంబు
వేత్తగా శోధించు వేల కొకడె

తే అట్లు శోధించు తత్వజ్ఞులందు జూడ
వేల కొక్కడే నీ పద మూలమంటు
అనుచుబోధించి తీవెగీతార్థమందు
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 67

సీ స్వామినీ కడకంటి చల్లని చూపున్న
అందరాని జయములంది మిగులు
స్వామినీ తీయని చల్లని చూపున్న
చేరని భాగ్యముల్ చేరి తీరు
స్వామినీ మృదులంపు చల్లని చూపున్న
చిక్కని సుఖశాంతి చిక్కిపొంగు
స్వామినీ దయితోడి చల్లని చూపున్న
పండని క్రచ్చులు పండి పొరలు

తే దేవ దేవ నీ కల్యాణ దృష్టి చేత
చేతి కబ్బని సంగతుల్ సృష్టి గలవె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 68

సీ శ్రీరామ నీ ధర్మశీల స్వరూపంబు
కాంచనో చగలేని కన్నులేల
శ్రీరామ నీ ఒగత్ప్రియమైన చరితంబు
చదువనోచగలేని స్వరమదేల
శ్రీరామ నీ దివ్య సేవ్యమౌ పదసేవ
చేయనోచగలేని చేతులేల
రామనీలోకాభిరామ తత్వంబుపై
భక్తికి నోచని భావమేల

తే స్వామినీ మంగళాకృతి స్వాంతమందు
అరసికరగనోచగలేని ఆత్మయేల
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 69

సీ. సృష్టిలోపలగల జీవ జాలము లెల్ల
జననమొందిన దాది చచ్చు వఱకు
ఆత్మశాంతికొఱకె అరటించునుగాని
క్రమమెఱుంగగ లేక కష్టమొందు
తినుటందొ వినుటందొ తిరిగి చూచుట యందొ
తరుణిబొందుట యందొ త్రాగుటందొ
అందచందములందొ అనుగుబంధువులందొ
నిద్రలందో సుఖముద్రలందొ
ఆటపాటలయందొ అధికారములయందొ
ఖ్యాతి గౌరవమందొ కలుములందొ

తే. శాంతిగన బోయి సంతాపసాగరమున
చేరి చచ్చిపుట్టుచు నిన్ను చేరలేవు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 70

సీ. అరయంగ దేహికి అజ్ఞాన భావమే
బీజంబు సంసార వృక్షమునకు
దేహమే ఆత్మగా తెలియయుండిన బుద్ధి
మొలక రాగము నెన్న నలరు చిగురు
కామ్య కృత్యంబులే క్రమత పెంచెడినీరు
తను వెంచి చూడగా తరువు మొదలు
ప్రాణపంచక మెన్న బలువైన శాఖలు
లేగొమ్మలే సకలేంద్రియములు
విషయ సంతానమే విరుల సంప్రాతంబు
బహుళ కర్మజదు ఖ ఫలము తినుచు

తే. ఇట్టి ప్రకృతి భూజంబున మెట్ట వెట్టి
జీవుడను పక్షివాసంబు చేయుచుండు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 71

సీ॥ మావిలోపలనుండి మసలుచుండిన నాడు
పాలించెనే తల్లి పాలనిచ్చి
చెప్పనేర్వని నాడు చెడు గ్రహ గండముల్
తప్పించె నేయయ్య దాపునుండి
కర్మరోగములందు కష్టకాలములందు
అప్పుండెవ్వడు వచ్చి యాదుకొనెనొ
కాలుండు ప్రాణముల్ కదలించి కొనువేళ
బిడ్డ లెవ్వరు వచ్చి యడ్డుపడిరొ

తే॥ సుంతయైన విచారించి చూడ లేక
మందబుద్ధియై జీవుండు మఱచునిన్ను
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 72

సీ॥ లెమ్ము నిర్గుణమూర్తి రమ్ముస ద్గుణకీర్తి
చక్షులనిండ ప్రత్యక్షమిమ్ము
లెమ్ము దీనదయాళు! రమ్ము భక్త కృపాళు!
ఆసక్తి దీర మాటాడనిమ్ము
లెమ్ము తత్త్వవిచార రమ్ము మృత్యువిదూర
త్వరగ నావెనుదట్టి ధైర్య మిమ్ము
లెమ్ము మంగళరూప రమ్ము కోసలభూప
కపివరునకిడిన కౌగిలిమ్ము

తే॥ లెమ్ము కన్నయ్య దయచేసి లేచిరమ్ము
నమ్మికొనియున్న బిడ్డల సమ్మతింప
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 73

సీ॥ కనికని నేత్రముల్ కళదప్పె వెలదప్పె
విని విని జానుగుల్ వేసరిల్లె
పసిబట్టి పసిబట్టి ముసలి దయ్యెను ముక్కు
తినితిని దౌడల తీటవాసె
భ్రమియించి శ్రమియించి బలిమిదపెప్పను మేను
ఆడియాడి అడుగు లరిగిపోయె
కోరి కోరి మనసు కోతియై చరియించె
పాడి పాడియు నోరు పసదొలంగె

తే॥ ఏది ప్రాకృతసృష్టిలో నింతయైన
కాంతి సౌఖ్యమ్ముకనరాదు శాశ్వతముగ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 74

సీ॥ ఆశ్రయించిన నిన్నె ఆశ్రయించుట కాక
ఇతరాశ్రయమునొంద నేమిఫలము
పూజించి ననునిన్నె పూజింప వలెగాని
లాతుల పూజింప లాభమేమి
పొందిన నీ మెప్పు పొందగావలె గాని
అన్యుల మెప్పొంద ధన్యమేమి
అలిగిన నీమీద అలుగ గావలె గాని
పరులపై నలిగిన ఫలమదేమి

తే॥ వృక్షమూలాన నీరంబు విడువలేక
పైని పత్రాల తడిపిన ఫలములిడునె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాద! సద్భక్తపారిజాత! /

సీ. కన పదునాల్గేండ్లు కాఱడవులు దిర్గి
అడుగు దామర లెంత యలసె నొక్కొ
క్రూరదైతేయుల గొట్టి యుండుట బట్టి
బాహు దండములెంత బడలెనొక్కొ
బండ నేలలపైని పవ్వళించుట చేత
కోమలతను వెంత కొట్టు వడెనొ
సీతమ్మ కొఱకునై చింతించి చింతించి
భావసారస మెంత బాధగొనెనొ

తే. చేరివిశ్రాంతి గొనుమయ్య సేదదీర
నల్లనయ్య నా ఉల్లాన చల్లగాను
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 76

సీ. సొత్తున్న తిని పోను వత్తురీ చుట్టాలు
గొట్టుకఱవునాడు చుట్టమీవు
స్వార్థాధికారాన సాకుదురీప్రభుల్
పరహితార్థము నేలు ప్రభుడ వీవు
సుఖమున్నదరిజేర చూచుదురీ సఖుల్
సంకటంబుల గూడు సఖుడ వీవు
ఆరోగ్యకాలమందక్క రొయీకల్మి
కననెప్పుడక్కరౌ కల్మినీవు

తే. కానప్రాకృత సంబంధ కాంక్షవదలి
నిన్నునమ్మి భజించుటే నిత్యసుఖము
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 77

సీ పుట్టుటెచ్చోటనో పొసగ పెరుగు టెచటొ
కూడియాడు టెచటొ వీడుటెచటొ
విద్యనేర్చు టెచటొ ఉద్యోగ మెచటనో
పెండ్లియెచ్చోటనో ప్రేమలెచటొ
సదన మెచ్చోటనో సంసార మెచటనో
సద్గుర్వనుగ్రహ సమయమెచటొ
కూడ బెట్టు టెచటొ కోలుపోవు టెచటొ
స్థూల శరీరంబు కూలుటెచటొ

తె ఎట్టివేళయో యేతీరొ యెంతబుద్ధి
మంతునకునైన తెలిసిన మాటకాదు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 78

సీ సంధ్యవార్చగలేని జన్మ విప్రులకంటె
ధార్మికశూద్రులుత్తములు సుమ్మి
గుణశీలములు లేని కులవైష్ణవులకంటె
దాసరుల్నినుగొల్వ ధన్యులయ్య
సాధువర్తనలేని జాతి శైవులకంటె
బాలసంతులు మహాభాగ్యులయ్య
అధమగుణములెన్నొ అంతరంగమునుంచి
ఒంధ్వోర్ధ్వపుండ్రభస్మములు పైన

తె దాల్చిమోసాలుగలకుల ధార్మికులకు
యుక్తిగల దెట్లు హరిహరుల్ మెత్తురెట్లు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్ర ిరినాథ! సద్భక్తపారిజాత! 79

సీ కోరుతిండ్లను మెక్కి కూర్కు తృప్తియకాని
కుక్కలు పలుకూళ్లు కుడిచి పడవొ
మురికి దేహముబెంచు మురిపమింతియకాని
మిన్నగా బెంచదో మేయు దున్న
పొలతి పొందుచు మదిపొంగు టింతేకాని
పొందదో తగుపెంటి మందఖరము
బిడ్డల గన్నట్టి బింక మంతేకాని
గ్రామ సూకరములు గనుట లేదొ
బహుకాలము బ్రతుకు భావ గర్వమెకాని
క్షితికాకి పెక్కేండ్లు బ్రతుక లేదొ

తే ఏమిలాభంబు నరుడు నిన్నెఱుగకున్న
తుచ్ఛుడీ జంతువులకైన తూలలేడు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 80

సీ పండు వెన్నెలగాంచి పండుగా పసిపాప
లొడిసి చేకొన చేతులొడ్డు విధము
ఎండమావుల నీటి కెగసి జింకల దండు
త్రాగి దాహము బాయ తరలు విధము
మెఱుగు ముత్యపుచిప్ప మేల్మి వెండిగ నెంచి
అందుకొనగ గోరు అర్థి విధము
కొండ గోగుంబూలకోరి చిల్కలపిండు
దొండ పండ్లని పర్వుచుండు విధము

తే సారమేలేని సంసార సాగరమున
ఎన్నియత్నాలు సల్పిన నేమిఫలము
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాద! సద్భక్తపారిజాత! 81

సీ. తిథివారములరీతి తెలియకుండగ మున్నె
జాతక సిద్ధాంత శాస్త్రి కులము
గురులఘు గణములు గుర్తింపకుండనే
కవనంబుజెప్పెడి కవుల మేము
వాతపిత్త శ్లేష్మ ధాతువెఱుగకున్న
ప్రాతరోగుల బట్టు వైద్యులమిక
మంచి చెడ్డవిమర్శ నెంచ జాలక మున్న
పరుగున గద్దెక్కు ప్రభులమేము

తే. తెప్పు తలదన్ను దోషాలలెక్క గొనక
ఖ్యాతి కొఱకిన్ని వేశాలు గట్టుటాయె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! ౪౨

సీ. చేసెడు వృజినముల్ చేయుచు తెగబడి
ద్రవ్యంబు నార్జించి దట్టముగను
దాని తోడనె కొన్ని దానంబులన్ జేసి
ధర్మకార్యంబులు దగనొనర్చి
చేసిన పాపముల్ బాసి పుణ్యము నొంది
ఘనమైన సౌఖ్యముల్ గాంచవచ్చు
నన్నదురాశతో నున్నగ రాసుల
మొండి ముచ్చుల స్థితి ముందు జూడ

తే. నమ్మి విషముష్టి బీజంబు నాటివసుధ
పనస పండుల కాసించు భాతిగాదె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! ౪౪

సీ రాజువేషముగట్టి రచ్చదాసరి కొంక
డేగి రాజాసన మెక్కురీతి
అద్దెకుండిన వాడు కద్దుగా తనలోన
మిద్దెయే తనదని మెదలురీతి
తోటమాలిగ నుంచ దొరనంచు పాలేరు
నాదె తోటని చేయు వాదురీతి
నరకు తెమ్మని పంపజని బాలుడాటలన్
మరగి వచ్చిన పనిమఱచురీతి

తే నీదు నియమిత ధర్మముల్ నీఱుచేసి
నాది నేనన్న దు ఖముల్ నాటుకొనవె
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 84

సీ శిక్షించి విద్యలన్ జెప్పెడి గురునిపై
శిష్యుండు పెగపగల్ చెందుకరణి
తెగులు నివారింప తగిన వైద్యముసేయు
వెజ్జునుగని రోగి విసుగు కరణి
మన్ను మెక్కగ జూచి మందలింపుచు త్రోయు
కన్నవ్వపై బిడ్డ కనలు కరణి
గుణవృద్ధి కొఱకునై కోపించు తండ్రిపై
కొమరుండు కినుకతో కూయుకరణి

తే భావి భద్రంబునకు నన్ను బాధపెట్ట
బుద్ధి హీనుడనై నిన్నాడి పోసికొంటి
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాథ। సద్భక్తపారిజాత। 85

సీ. వనరామమూర్తివై వచ్చితివా నీవు
వైరాగ్య కాంతులు వ్యాప్తి చెందు
కోదండ ధారివై నాదండ నీవుండ
పగతురార్గురు బయల్ పట్టుచుంద్రు
విశ్వమోహన ధర్మ విగ్రహమ్మును జూడ
కవితా సరసకళల్ చివురు లెత్తు
సీతాసహితుడవై చిత్తమందున నిల్వ
ఆనందలక్ష్మి నాయందు జేరు

తే. స్వాంతరాజీవ మందీవు శయన మొంద
నిర్వికల్పసమాధిని నిలిచి కందు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! ౮౬

సీ. జగతిలో యీ జీవి జనన మొందిన నుండి
తలపరానివి యెన్ని తలచెనొక్కొ
పలుక నేర్చిన దాది పాపియై యీ నోరు
పలుక కూడని వెన్ని పలికె నొక్కొ
నడువనేర్చిన నుండి దుడుకులై అడుగులు
పోరాని చోట్లెన్ని పోయె నొక్కొ
చేయదగనివెన్ని సేసెనో చేతులు
కానదగని వెన్ని కనె నొకనులు
కుడువ దగనివెన్ని కుడిచెనో యీ పొట్ట
వినగదగని వెన్ని వినెనొ చెవులు

తే. బాపురే తాళలేనిట్టి పాప భరిత
దేహకారాగృహము నుండి తేలుటెట్లు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 87

సీ తగినౌషధంబెంత తవిలి వాడిన రోగి
పథ్యంబు నడపక బాగు పడునె
పొలములో పలనారు పొసగనాటిన రైతు
కలుపు దీయకయున్న ఫలముగనునె
శాస్త్రాదికములెన్ని చదువనేర్చిన వ్యక్తి
సద్గుణంబులు లేక సాధువగునె
గురుమంత్రమును బొంది మురిసిన చపలుండు
జపసాధనలు లేక సఫలుడగునె

తే పైకిమూఢుండు నీయందు భక్తి సూప
పాపవర్తన విడకున్న భక్తుడగునె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 88

సీ ఆకాశమన బోలునవధూత విద్యల
కాదత్తదేవుండు వేదమయుడు
ఆదిత్యుడనబోలు ఆదికవీశుండు
వాల్మీకి కావ్య విశ్వమ్మునందు
పూర్ణకళాధారి పూజ్యపౌరాణిక
వ్యాసమౌనీంద్రుడు భాసురముగ
కవివర గురులలో ధ్రువతారయన నొప్పు
ఆదిశంకరజగదార్యమూర్తి

తే యుగయుగాలకు ఒక్కరే తగినరీతి
అవతరింతు రీవిధమునీయంశవలన
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 89

సీ. పుండరీకాక్షనీయండ నాకొసగుచు
గండంబులెడబాపి కావుమయ్య
పరమాత్మ నీమాయ తరియింపగాచేసి
త్వరగనీదర్శన భాగ్యమిడవె
నారాయణానీదు నామమంత్రంబును
పారాయణముతోడ ప్రస్తుతింతు
లక్ష్మీశ దయతోడ లక్షణంబుగవచ్చి
మోక్షలక్ష్మినొసగిప్రోవుమమ్మ

తే. నిన్ను చూడక నామది నిమిషమైన
నిలువలేదే మిచిత్రమో నలువతండ్రి
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాధ। సద్భక్తపారిజాత। ౧౦

సీ. కోసల వరదేశ కుశలపాలన నేత।
భాసుర రాఘవ వంశజాత।
భక్ష రాక్షసమహారణరంగ ఘనఘాత।
పరమ భక్తాశ్రిత పాపపూత।
సుగ్రీవ సంప్రీత శూరసంగరజేత।
ధైర్య మారుతి దూత। దైత్యపాత।
సద్గుణ సంఘాత సంధాత సంకేత।
సకలసురవ్రాత సాధుగీత।

తే. త్రితయ గుణచేష్టతాతీత దివ్యదాత।
సతత మోక్షాను సంధాత సాకుజోత।
ధర్మసంత్రాత। రామ సీతాసమేత।
భద్రగిరినాధ। సద్భక్తపారిజాత। ౧౧

సీ॥ చదువు శాశ్వతంబు పదవి శాశ్వతంబు
సతులు సంసారంబు శాశ్వతంబు
పుత్రపౌత్రులు మిత్రములు సుశాశ్వతంబు
విశ్వజీవనమిది శాశ్వతంబు
పాడిపంటలు మహాప్రఖ్యాతిధనములు
సన్మానములు భూమి శాశ్వతంబు
భోగభాగ్యంబులు రాగరోగమ్ములు
సౌందర్యదేహంబు శాశ్వతంబు

తే॥ అనుచు జీవుండు శాశ్వతమైన నిన్ను
మఱచి శాశ్వతమ్ముగ మాయ మ్రగ్గుచుండు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 92

సీ॥ నాతల్లి గోదాంబ నవనీత హృదయంబు
దొంగిలించిన దొరదొంగవీవు
నాయమ్మ గోదమ్మ నవరస కవితతో
నిద్రలేచిన కపట ముద్రకుడవు
మాతల్లి గోద నిర్మాల్యహారంబుచే
బంధింపబడు భక్తబాంధవుడవు
మాయమ్మ గోదాంబ మదినిచ్చి పెండ్లాడి
జగతికిమేల్జేయు చల్లనయవు

తే॥ అట్టి పూజ్యురాలైన మాయమ్మగోద
ఆచరించు శ్రీవ్రతమునేనాచరింతు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 93

ు నేనేర్చు విద్యకు నీవెగురుండవై
స్వాధ్యాయ శిక్షణ సలిపినావు
నే పల్కు కవితకు నీవెవాగ్దేవివై
పలికించితివి నన్ను చిలుక భాతి
నాదు భావనకెల్ల నీదు సంకల్పమే
సింధురాజమునీవు చెలమనేను
నా ప్రవర్తన కంత నీ ప్రేరణమె సుమా
బొమ్మలాటరి వీవు బొమ్మనేను

తే సాధ్వసాధులక్షణగుణ శాస్త్రరీతి
తెలిసితెలియ కల్లితి భవదీయ భక్తి
సీసపద్య శతకముల స్వీకరింపు
తీవ కుటిల మైనను పూల తావికేమి 94

సీ ఏ శక్తులను జూచి ఏలితివానాడు
బాలుడౌ ప్రహ్లాద భాగవతుని
ఏ యుక్తులను జూచి ఎలితివానాడు
బాలుడయిన ధ్రువ భక్తమణిని
ఏకులంబును జూచి సాకితివానాడు
గోపాల బాలురకూడినీవు
ఏజన్మ మెంచి రక్షించితివానాడు
ఏన్గుల మేటిని ఏగిత్వరను

తే శక్తియుక్తులు ప్రాయముల్ జాతినీతి
సంపదల కావు భక్తి ప్రశస్తమయ్య
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! ౯౫

సీ వేద విద్యారణ్య వితత సీమలలోన
శోధించి నీజాడ చూడలేను
పంచేంద్రియోద్రేక సంచారకాశ్వాల
తేరెక్కి నీఊరు చేరజాల
ఈమంకు మనముచే ఏకాగ్ర చిత్తుడనై
ధ్యానించి సద్దినిన్ గానలేను
యాగయోగాలచే త్యాగాలచే మంత్ర
రాగాలతో నిన్ను లాగలేను

తే అత్మ నొకటే సమర్పింతు ఆదరించి
అందు కొనుము నీచరణాల కలరు సరణి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 96

సీ వేదంబులను సర్వవిజ్ఞాన గగనాన
రామాయణం బనురవిజనించి
నిగమంబులను మహాభగవదాకాశాన
భాగవత తేందుబింబముజనించి
శ్రుతులను పరతత్వ సుందరాంబరమున
చూడామణిగ వేగుచుక్క పొడిచి
స్మృతులను రాద్ధాంత సిద్ధాంతరిక్షాన
రసకావ్య నక్షత్ర రాశిదేలి

తే చూడ సత్యమై శివమునై సుందరముగ
సచ్చిదానంద ముగసృష్టిసాగుచుండె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 97

సీ మేరువతి యుపతి మేరు పర్వతరాజు
సంతానమును గూర్చి సంతపించి
బహుళ వత్సరములు భక్తితోడుత విష్ణు
భగవంతు సేవించి వరము వడసి
భద్రునీలు లనెడు వరపుత్రులిర్వుర
కాంచిరి తమ ఆత్మకాంక్షదీర
నయముగా శ్రీ జగన్నాథుని దరిచేరి।
నీలుండు సేవించె నిశ్చలముగ
భద్రుడనెడువాడు భగవంతుని గురించి
తలిదండ్రులను జూచి తెలియనడిగె

తే తల్లిదండ్రులు ఆభద్రతనయు జూచి
సంతసమ్మొంది ఆశ్చర్యచకితులగుచు
జన్మజన్మాంతరాల జిజ్ఞాసి ఇతడు
పుణ్యవంతుడు మాకడ్పు ధన్యమయ్యె 98

సీ యుగయుగాంతరముల యోగిపుంగవులకే
తపియించి దర్శింప తరముకాదు
అయినను మనము దీర్ఘాయుష్కులముగాన
సద్భక్తి తపమున స్వాంతశుద్ధి
పరమాత్మ దర్శించి భజియించగావచ్చు
అనుమానమిక లేదు వినుపుత్ర!
యుగయుగంబులలోన నొగిని నవతరించు
ధర్మోద్ధరణ సేయు నిర్మలుండు

తే చల్లగాత్రేత శ్రీరామ చంద్రుడగుచు
అవతరించుచునసురుల హతముచేయ
దండకారణ్య సీమలో తరలితిరుగు
సమయమున రామదర్శన సఫలమగును 99

సీ॥ తలిదండ్రులాజ్ఞను తలదాల్చి భద్రుండు
రామదర్శనపు లాలసతపూని
రాణకెక్కగ తెలంగాణ సీమలయందు
పావనగౌతమీ జీవగంగ
దరినిల్చి కడుభక్తి తపముచేయుచునుండ
రాముండు వెదకుచు భూమిజాత
భద్రాద్రిపై చేర భావ ప్రశాంతమై
అడుగిడజాలక అచటనుండ

తే॥ రాక్షసులమాయ యంచునాలక్ష్మణుండు
కోపముంజేయ భద్రుండు కోరిపల్కె
రామదర్శనమునుగోరి ప్రేమతోడ
యుగయుగాలుగా తపమందునున్నవాడ
భద్రుడనువాడనే పేరు బాలకుండ 100

సీ॥ శ్రీరామ నీశుభశ్రీ చరణాబ్జాలు
సోకి నాజన్మకు శుభముకూడె
నాతపంబు ఫలించె ననువీడి పోవద్దు
అనగ శ్రీరాముండు అభయమిచ్చె
అవతారకార్యమ్ములన్ని తీర్చినమీద
నీపైన నేనుందు నిక్కమిద్ది
అనుచు రాముడేగి అటనుండి చివరికి
అదిమఱచి వికుంఠ మరగి మగుడ

తే॥ కొంత కాలమ్మునకు నీవు స్వాంతమందు
భద్రునకు నిచ్చు వరము సఫలమునొంద
ఇలను భద్రాద్రిపైనుండ నిచ్చగించి
వచ్చుయత్నంబు చేయుచు వసజనాభ ॥భద్ర॥ 101

సీ రామావతారాన ప్రేమతో భద్రున
కిచ్చిన వరమును ఇచ్చనెంచి
వైకుంఠమున నుండి భద్రాచలమునకు
చేరు తొందరనందు వారకుండ
కుడిచేత శంఖంబు ఎడమచే చక్రంబు
ఒడిసపట్టి తొడిగి వడిగనేగి
వైకుంఠ రాముండ వైచతుర్భుజముల
శ్రీదేవి జానకై చేరవెంట

తే శేషఫణిని లక్ష్మణ మూర్తిచేసి వచ్చి
భద్రగిరి శిరంబుననుండ పరపదయను
భద్రముగ లోకముల నేలు భద్రమూర్తి
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 102

సీ భద్రభూధరవర ప్రాంతంబునంగల్గు
పాలెంబనెడు పల్లె పట్టునందు
భక్త శబర్యంశభవయన తగు సాధ్వి
పోకల దమ్మక్క పుణ్యురాలు
భద్రాద్రి అడవులం బాలుండు రామయ్య
పిన్న బిడ్డను పిల్చి వెదకుచుండ
పుట్టలోపలి నుండి బిట్టుగా కేకతో
దమ్మక్క రప్పించి దయనుజూపి

తే దర్శనం బిచ్చి కొడుకును తనకునిచ్చి
నీదు విగ్రహంబుల గొల్వ నియమమిడగ
భద్రుడొకతాటిపండిచ్చి భద్రముగను
నీకు నైవేద్యమిమ్మంచు నేర్పనాపె
అటులెపూజించె నిత్యంబు ఆత్మభక్తి ॥భద్ర॥ 103

సీ గంగయే నీపాద కమలమందుజనింప
నేనిడు పాద్యంబునీకదెంత
బహువిధ పుష్పాల ప్రకృతి నిన్నర్చింప
నేజేయు పూపూజనీకదెంత
దినమొక్క తీరుగా వనులు ఫలములీయ
ఏనిడు నైవేద్య మీకదెంత
మంగళదీపాలు మార్తండ శశులైతె
నేనిచ్చు హారతినీకదెంత

తే తల్లిదండ్రులు తమచిన్ని పిల్లలోలి
ఉల్లసిలి చేయు ప్రేమలకుల్లసలరె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 104

ఓం తత్సత్



ఓమ్

శ్రీ గణేశ్వరాయనమ
శ్రీ సరస్వతీ మాత్రే నమ
శ్రీ లక్ష్మీ నారాయణాభ్యామ్ నమ
శ్రీ సీతారామ చంద్రపరబ్రహ్మణే నమ

# శ్రీరామ పంచశతి

## (తృతీయ కాండము)

శ్రీ సీతా హృదయారవింద తరణిం శ్రీవత్సనారాయణం
కౌసల్యోదర శుద్ధసింధు శశినంకారుణ్య రత్నాకరమ్
కల్యాణప్రద ధర్మవిగ్రహ విభుం కైవల్య భావం జయం
బ్రహ్మానందమపారభాగ్య ఫల దంభద్రాద్రి రామం భజే

సీ శ్రీ వసుధాత్మజా చిత్త పంజరకీర।
సకల ప్రపంచ సంసార భార।
ఘన భీత దండక కాంతార సంచార।
శర దైత్య సంహార। సమరశూర।
సద్గుణజనవీర సద్భక్త మందార।
ధర్మావతార। సుధాశరీర।
అష్టాక్షర సుమంత్ర యంత్ర వన మయూర।
శిష్టరక్షణ ధీర। చిత్రప్రకార।
తే అఖిల పాప విరామ రామావతార।
ఆది నారాయణాకార వేద సార
భద్రసాకేతనరవీర। భయవిదూర।
ధర్మ సంసార। నిర్మల శర్మతీర।

సీ ఓం నమో భగవతే యోగీశ్వరేశాయ
నరసింహరూపాయ నక్షరాయ
మోహ మాయాలోక మోక్షాయ దక్షాయ
భక్త బంధోనమో భాగ్యదాయ
గగన విశాలాయ కమలజ జనకాయ
వకుళ భూషణ కాయ వసునుతాయ
తేజస్వరూపాయ దేవాది దేవాయ
వాసుదేవాయతే భాసురాయ

తే సుజనగణవందితాయతే సుందరాయ
దేవకీ తప స్సిద్ధయే తేనమోస్తు
వారినిధి శేషశాయినే వైష్ణవాయ
యదుకు లాగ్రాయతే నమోయాజకాయ। 2

సీ మొదలింటి ముగ్గురు మూర్తుల మూలంబు
దత్త దేవుని యవతార మౌను
బ్రహ్మదేవాంశాన భాసిల్లె భగవత్సు
తపసి వాల్మీక్యవతారమగుచు
నారాయణాంశావతారమై వెలుగొందె
స్వామి యౌవ్యా సర్షిజగము పొగడ
శంకరాంశము నాది శంకరాచార్యుడై
అవతరించెను గురువవుచు జగతి

తే ఇన్ని అవతారములకును ఈవె మూల
మగుదువట్టి నిన్నాత్మలో అభినుతింతు
భద్రసాకేతనరవీర। భయవిదూర।
ధర్మ సంసార। నిర్మల శర్మసార। 3

సీ కరుణమాలినవాని శరణు బొందుటకంటె
శౌర్యధైర్యము తోడ చావమేలు
పెద్దవారల పెంపు చేఁయుండుటకంటె
పుట్టనాగులకు పాల్ పోయమేలు
స్వార్థపరుల పొత్తు సల్పుచుండుటకంటె
బసవన్నలను గొల్చి బ్రతుక సుఖము
ద్రోహ గర్వాంధ భృత్యులను బెంచుటకంటె
ప్రేమతో కుక్కలంబెంచ ఫలము

తే పామరుల చేత పూజలు బడయుకంటె
పండితుల చేత తిట్టులు బడుట మేలు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 4

సీ బిడ్డలగను బాధ గొడ్డురాలెఱుగునే
కడుపునిండుగ గన్న కాంతగాక
సత్కవితపమును జడుడు గుర్తించునే
రసపాండితీ విశారదుడుగాక
భూమిసేద్యపుపాటు సోమరి తెలియునే
శ్రమకోర్చి పండించు రైతుగాక
సంసార భారంబు చంటిపాపెఱుగునే
ముక్కాక లారిన ముదుక గాక

తే మలిన చిత్తుండు నీ భక్తి తెలియగలడె
లలిత బుద్ధి పూర్ణుడు గాక లక్షణముగ
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 5

సీ. పాపముల్ బహుచేసి బ్రతికెడి క్రూరులే
పృథ్విలోపల పొందు వృద్ధి జూచి
పరకాంతల జెఱచి మురిసెడు నీచులే
జనులలో గాంచు ప్రశంస జూచి
న్యాయమార్గము తప్ప నడచెడు ద్రోహులే
గౌరవ సంపదల్ గనుట జూచి
దొంగ వ్యాపారాన దోచి సంపాదించి
కడుపునిండుగదిన్న ఖలుల జూచి
దేశమున్ చెడగొట్టి కోశంబులన్నింపి
పాలసుల్ పొందు భోగాల జూచి

తే. స్వప్నముననైన నాదగు స్వాంతమెపుడు
మోసపడకుండ కన్నుంచు మోక్షదాత
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 6

సీ. పాపబుద్ధులు కంటబడకుండినం జాలు
గతజన్మ కలుషముల్ గడచినట్టె
జారచోరుల గాలి జేరకుండిన జాలు
దారుణనరకంబు దప్పినట్టె
ఠంరలల్కుడు చెవి సోకకుండిన జాలు
అష్టదరిద్రంబులణగి నట్టె
ఇలకపటుల జోలి గలుగకుండిన జాలు
పుట్టెడు పుణ్యముల్ పొందినట్టె

తే. నిన్నుగొలువని పతితుల నీతి తలపు
నందకున్న జాలిక స్వర్గమబ్బినట్టె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 7

సీ. ప్రాణఘాతుకమైన పనులకు తెగియింత్రు
క్షణిక భోగమునిచ్చు కాసుకొఱకు
హీనమెంచగలేక మానమమ్ముచునుంద్రు
క్షణిక వైభవమిచ్చు కాసుకొఱకు
ఖలముదలంపక ఖండింత్రు తలలను
క్షణిక సౌఖ్యమునిచ్చు కాసుకొఱకు
తల్లిదండ్రులనైన తరిమి వైచుచునుంద్రు
క్షణిక సౌఖ్యమునిచ్చు కాసుకొఱకు

తే. శాశ్వతానంద మొసగు నీచరణయుగళ
మాశ్రయింపకించిత్తైన యత్నపడరు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 8

సీ. పునుక లోపలనుండి మనెడు పుర్వులరీతి
జలములోనున్న మత్స్యంబురీతి
మేడిపండులలోన మెదలు క్రిములరీతి
తల్లి గర్భమునున్న పిల్లరీతి
ధాత్రిపై వర్ధిల్లు తరుసంతతులరీతి
తరువున ఫలములు తనరురీతి
గ్రహములంబరమందు గల్గియుండిన రీతి
అచ్చులో హల్వర్ణమతుకు రీతి

తే. బ్రతుకు ఈ ప్రాణి నీలోన ప్రభవమొంది
తనకు తానె తందానాడతంట గాదె
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 0

సీ దయజూడ నినుబోలు దయగల వేల్పేడి
కరినాన నీయంత కాలుడేడి
శ్రీమంతమున నీకు చెందిన ధనియేడి
పేదలోనీయంత పేదయేడి
పెద్దకు నీయంత పెద్దవాడెవ్వడు
పిన్నకు నినుబోలు పిన్నయెవడు
స్థూలాన నీవంటి స్థూలమూర్తి యెవడు
సూక్ష్మాన నీవలె సూక్ష్ముడెవడు

తే కానరాడు పద్నాల్గు లోకముల నెపుడు
వెదకినన్ సచ్చిదానంద విశ్వరూప
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 10

సీ అధికారమును మించు ఆత్మశక్తి నొసంగు
కలశక్తి మించధికార మొల్ల
గౌరవంబుల మించు ఘనత నాకొసగుము
కోర ఘనతమించు గౌరవముల
కీర్తికిన్ మించు సద్వర్తన గుణమిమ్ము
వర్తనంబును దాటు కీర్తినొల్ల
సంపదల్ మించిన సంతృప్తి నొసగుము
సంతృప్తికిన్ మించు సంపదొల్ల

తే శక్తికిని మించు నీపాదభక్తి నిమ్ము
భక్తికిని మించు శక్తిని వడయ నొల్ల
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 11

సీ. బ్రతికి చచ్చెడు విద్య బహుగ నేర్తురు గాని
చచ్చిబ్రతుకు విద్య చదువబోరు
నవ్వించి యేడ్పించునయమంటుదురు గాని
ఏడ్చినవ్వెడు నయంబెఱుగ బోరు
వెలిగి మలుగు పేరు వెలయ గోరుచునుంద్రు
మలిగి వెలుగు పేరు మాటలేదు
పెరిగి విరుగుశక్తి పెంచుకొందురుగాని
విరిగిపెరుగుశక్తి వెదకబోరు

తె. కంటబడి కరగు జగము కంద్రుగాని
కనబడని తరగని కాంతి గాంచబోరు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 1

సీ. పసుపుకుంకుమ రోసె పసిడియే బరువయ్యె
పాశ్చాత్య వాసనే ప్రాకిపోయె
గడియారములు దేల కంకణాల్ మొఱటాయె
పడతులు పురుషులేర్పడుటపోయె
ధర్మంబు చేదాయె శర్మమ్ము తీపాయె
ప్రాచీన సంస్కృతి ప్రాచిబట్టె
వరశుల్కములగోరి పురుషులమ్ముడుపోయి
భర్తలేభార్యలై బ్రతుకుచుంద్రి
మగువలగౌరవ మర్యాదలిలతగ్గె
ద్రవ్యార్జనంబెప్రధానమాయె

తే. భయములేదాయె నీ మీది భక్తిపోయె
నయముగనరైరి మానవుల్ న్యాయమెఱిగి
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాథ! సద్భక్తపారిజాత! 11

సీ పూర్వసంచితమున బుట్టె గుణంబులు
గుణమువలన వృత్తిజనన మయ్యె
వృత్తిచేత కులము దత్తమయ్యెను ధర
అయిన నీ పదభక్తి అఖిల జనుల
కర్మమౌనం చాదిమంబైన వేదంబు
సకలపురాణముల్ సర్వఋషులు
సద్గురుల్ జ్ఞానులు జగతిలో ధ్వజమెత్తి
తవిలి చాటించినన్ చెవుటులగుచు

తే సొమ్మరోగి చందంబున దిమ్మ క్రమ్మి
పుడమి దుమ్ము లోపలబడి పొఱలుచుండ్రు
ధర్మసంత్రాత! రామ సీతాసమేత!
భద్రగిరినాధ! సద్భక్తపారిజాత! 14

సీ పూజ్యమౌ పాదంబు మోఁతివో లేదొ
తనపూజ్య రూపంబు గనె నహల్య
సూటిగానొకపండు నోటజేరెనొలేదొ
శబరి సదానంద శరధియాయె
చేరెడు నూకలు చేకొంటివో లేదొ
కోటికి పడగెత్తె క్షోణిసురుడు
చీరపేలిక యింత చీరి చుట్టెనొ లేదొ
అవ్యయ వస్త్రాంగ యయ్యె గృష్ణ

తే స్వామి సదుదార నీదు సేవాఫలమ్ము
ఏమిపలుక నౌతులతూచ నెంతకెంత
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 15

సీ నీవులేని స్థలము నిజమెక్కడను లేదు
చావని జీవులు జగతి లేరు
నాదంబులే కెప్ప నలువ సృష్టియు లేదు
సర్వజ్ఞుడైనట్టి జనుడు లేడు
వేదముల్ చెప్పని విషయ మెందున లేదు
ఆశవీడిన వారల పని లేరు
ఉర్వి యోగ్యులు లేని యుగము లెప్పుడు లేవు
తప్పుసేయని వారు ధాత్రి లేరు

తే తారతమ్యముల్ వీనిలో తవిలియుండు
కోకనద పత్రనేత్ర! సీతా కళత్ర!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 16

సీ నామమే సురసుధా నవనీతమనుకొంటె
ఆకార మానందలోకమాయె
ఆకారమే భువనైక మోహన మంటె
సుగుణశీలంబులు సురభిలించె
సుగుణశీలంబులే జగతికీర్తనమంటె
ధర్మ స్వభావంబు తళుకులొలికె
ధర్మ భావమె విశ్వదర్పణమనుకొంటె
సత్యసదాచార సరణి వెలిగె

తే యిన్ని సల్లక్షణములు నిన్నెనసియుండ
కరగకెటులుండు జగము నీగాథవినగ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 17

సీ ఒకసారి నీకు నేనొప్పైన కోవెలై
శాశ్వతవాస విశ్రాంతులిత్తు
ఒకసారి నీకు నేనొప్పల బిడ్డనై
ముద్దుల సంద్రాన ముంపుచుందు
ఒకసారి నీకునేనొప్పైన బంటునై
భావంబుతో మెచ్చ సేవజేతు
ఒకసారి నిన్నునే నోలలాడింపంగ
అనందముగ కవి నౌదుచూడు

తే అన్ని విధముల నీకిట్లు నమరనేను
పాలకదలిలో నీకేమి భాగ్యమొలుకు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 18

సీ పరమాత్మ నీ కంట బడకుండ నేనిల
చెయ్యుంబు లెయ్యవి చేసినాడ
దైవమానీయొక్క తలపున కందని
తంత్రంబు లేవేవి తలచినాడ
వేదవేద్యా! నీకు వినగరాకుండగ
కూతలెప్పుడు నేను గూసినాడ
ఈశ్వరామతి నీకు నెఱుక లేకుండగా
భువనమందున నేమి పొందినాడ

తే అన్నికనివిని యెఱుగుచు నండనుండి
తప్పునాపైని ద్రోయగా ధర్మమగునె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 19

సీ॥ అవతారములకెల్ల నగ్రపీఠస్థమౌ
తావకరామావతారమూర్తి
అఖిల ధర్మగుణాల కాట పట్టైయొప్పు
తావకరామావతార మూర్తి
శృంగారములకెల్ల శృంగార మేరువు
తావకరామావతారమూర్తి
సకల విద్యాకళాసారపూరితరాశి
తావకరామావతారమూర్తి

తే॥ నూరులేల నీరామావతారమరయ
సర్వశుభలక్షణంబుల సాగరంబు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 20

సీ॥ పొంగెడానందాశ్రు గంగాజలంబుల
కాళ్లు గడ్గె ద రమ్ము నల్లనయ్య
తలపులనెడుపూల దండల మెడనిండ
అల్లి వైచెదరమ్ము చల్లనయ్య
ప్రేమగంధము నీకు బేర్మి గై సేసెద
మోదమొల్కగ గొను మాదరించి
చిత్త నైవేద్యంబు జేసెద నెమ్మదిన్
స్వీకరింపుము తండ్రి శీఘ్రగతిని

తే॥ ఆఱు గుణముల బెకలించి ఆరతిత్తు
అందుకొని నాదు బంధంబులణ పుమయ్య
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 21

సీ  సతులకు సతతంబు పతిభక్తి దెలుపగా
శ్రీలక్ష్మి బుడమిలో సీతజేసి
నరనాథ ధర్మంబు లెఱిగించు కొఱకునై
రామభద్రుండవై లక్షణముగ
దూతలు తలదాల్పు నీతి వర్తనజూప
మరుదంశమున హనుమాను జేసి
పాపచిత్తులు పొందు ఫలితంబులం జూప
ద్వార పాలకుని రావణుని జేసి

తే  తేట పడగ రామాయణ నాటకంబు
జూపి సంస్కరించితి సృష్టిసుస్థిరముగ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 22

సీ  దయగుణ నీంవటి తలిదండ్రు లెవ్వరు
గురు తత్వ నీపాటి గురుడెవండు
శరధారి నీకీడు చక్రవర్తి యెవడు
జలజాక్ష నీ జోడు సఖుడెవండు
పరమాత్మ నీమాద్రి బంధువు లెవ్వరు
సురపాల నీ దొర సుఖమదేది
భగవంత నీకెనభాగ్యంబు లెయ్యవి
యోగీశ నీ దిన్సు భోగమేది

తే  దాశరథినీకు సరిగల దైవమేది
నక్షయానంద నీసమానందమేది
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 23

సీ. క్షణములో నఖిలంబు క్షయమొనరింపదే
నీయాజ్ఞపై బయల్ నిలచెగాక
కుప్పించి త్రుటిలోన కూల్చదే ఈసృష్టి
గాలినీ యానతిన్ దాళెగాక
కనురెప్పపాటులో గాల్చదేజగ మెల్ల
అగ్గినీ గడుపుపై నాగెగాక
పొంగుచు నిఖిలంబు మ్రింగదే కళలోన
జలమునీ మాటపై నిలచెగాక
తే. భూమి గడియ లోపలనంత భుక్తి సేయ
కుండునే నీదు మేరపై నోర్చెగాక
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 24

సీ. శంఖచక్ర గదాసుశార్ఙకోదండముల్
శత్రుభీకరముగ సంధరించి
కనచతుర్భుజములు ఘనముగా భాసిల్ల
హరిదివ్యసంకాశ తాకృతిగొని
శ్రీ రమాదేవిగా చెలగ సీతామాత
నారదా దిమునులు కోరికొలువ
పావనమౌ పెద్ద పాలసంద్రములోన
శ్వేత సౌందర్యాది శేషశయ్య
తే. యిందువెలుగు శ్రీనారాయణాది రూప
మరయజేసి సేవింపగా ఆనతిమ్ము
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 25

సీ. అన్నదానమునందు నఘము నెంచగరాదు
కన్నవారల మదిన్ గాల్పరాదు
చీకటిలో తిండి జేరి సాపడరాదు
ఇలపాలునది నెప్పుడీదరాదు
గుణములు గలచోట కులము నెన్నగరాదు
హీనునెప్పుడు నాదరింపరాదు
నిజమెఱుంగకముందు నిష్ఠుర పడరాదు
మొదలు పెట్టిన పని వదలరాదు

తే. దేశికుని శాసనంబును తెగడ రాదు
తలపునెవ్వేళ నీచింత దొలగరాదు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 26

సీ. సత్యంబుదప్పక సంచరించెదనన్న
బూటకులె కలరీ భూమినిండ
ధర్మంబు దప్పక ధరచరించె దనన్న
అడవిబట్టెను ధర్మమంతమిడికి
యోగమార్గము బూని యొప్పుదామనుకొంటె
కలరుకృతఘ్నులు పలుస్థలముల
సద్విద్యలను నేర్చి చక్కబడెదనన్న
తలనొప్పి విద్యలే ధాత్రివెలసె

తే. ఏమిసేతునీ కలియందు నెట్లు నేను
జీవనము చేసి నిను గాంతు జెప్పవయ్య
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 27

సీ. కవనంబు చెప్పుట క్రమముగా పలుకుట
ధైర్యంబు గలుగుట శౌర్యముంట
దానంబు సేయుట గానంబు సేయుట
సువివేకముండుట చోరుడగుట
కారుణ్యమొలుకుట కాఠిన్య ముండుట
జ్ఞానియై యొప్పుట జాడ్యుడగుట
సాత్వికుండగుటయు చండకోపియగుట
ధర్మమై నీ భక్తి దవిలియుంట

తే. నరులకివిజన్మతో బుట్టినవియ కాని
పరులజూచి నేర్చిన కొంత పట్టు బడును
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 28

సీ. దారువులందుండు దావపావకు రీతి
క్షీరంబులందుండు ఘృతము రీతి
తరచగా తిలలందు దైలముండిన రీతి
పూవులందు నతావి పొదుగు రీతి
చెఱకు గడల యందు జెలగు రసము రీతి
విద్యలలో బుద్ధి వెలయు రీతి
జ్ఞానవైరాగ్యాన జాను మోక్షము రీతి
తపోక్షమున శాంతి తనరురీతి

తే. కలవు పరమాత్మ సర్వత్ర కలవు నీవు
తెలివి గలవారె నీ గుట్టు దెలియగలరు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 29

సీ పిలువగా నాతోడ బ్రీతి మాటాడవా
నోరులేదని నీకు పేరు దెత్తు
తలచగా నాకు నీదర్శన మీయవా
ఆకార శూన్యుడన్ యశము గూర్తు
అర్పించు నైవేద్య మారగింపక యుంటె
కదలలేడని నీకు ఖ్యాతిదెత్తు
ఆపద సంపద లరయకుండితివేని
నిర్గుణుడని నిన్ను నిందసేతు

తే గనుక అంత పర్యంతంబు కాకమున్న
చేరినన్ను మెప్పించు మోచిద్విలాస!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 30

సీ మూర్తుల గనినంత ముఖము ద్రిప్పెడివార
లిసుక లింగపుగాధ బొసగ వినరొ
ప్రతిమల నర్చింప పరిహసించెడి వారు
మునిమృకండజు కధగనగ లేరొ
శిల్ప విశ్వాసంబు జిన్నగా గనువారు
చదువరో ప్రహ్లాదు సచ్చరిత్ర
విగ్రహారాధన వెక్కిరించెడి వార
లేక లవ్యుని స్థితి నెఱుగలెరొ

తే విదుల మర్మంబు తెలియక వెలితినరులు
మిడిసిపడుచుంద్రు రెంటికి చెడు చునుంద్రు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 31

సీ నీకళలేకుంటె నాకేదికళయని
వైకుంఠసీమనిన్ వదలదేమొ
స్వామినీ మంజుల స్పర్శమ్ము కలవడి
మిన్నాగునిన్ వీడకున్నదేమొ
హరినీ సుదర్శన మరయంగ మరగియు
పాలసంద్రంబడ్డు పడియెనేమొ
పరమేశ నసుమించు భక్తుల నంతంబు
గానుంట జేసినన్ గాన లేవొ

తే చీమ మొదలుగా భారతీ స్వామి వఱకు
మనగ బోషించు బాధ్యత మఱచి నావొ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 12

సీ జరుగ జాలని కుంటి సాధువు కొండలో
స్వప్నాన సామ్రాజ్య పదవిజెంది
చామను పెండ్లియై సంతాన వంతుడై
శత్రు రాజుల తోడ జయముగాంచి
హర్మ్యాగ్రములయందు నఖిలభోగములతో
హర్షాబ్ధిలోదేలు నంతలోన
పగతుడొక్కడు వచ్చి పట్టణమోడించి
పుత్రుల బలిబెట్టి పూని వాని
నెలతుకతో గూడ నెట్ట గాననమున
భార్యను బులినోట బట్టి చంప

తే కొట్టుకొని యేడ్చుచున్నంత గుఱకవదలి
నగెడిసన్యాసికల ఇట్టి జగము మాయ
నీదుదయలేక నీమాయ నీదగలమె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 13

సీ॥ తగని కార్తెలలోన తెగదున్ని రైతన్న
విత్తనంబును భూమి బెట్ట ఫలమె
బాల్యంబులో విద్య పఠియించి నేర్వక
ముదుక ప్రాయంబున జదువఫలమె
ముదురు మోసును దెచ్చి కుదుర గుంటను ద్రవ్వి
నాటి తోయము బోయ నాటుకొనునె
వృద్ధనాగము బట్టి మృగ శిక్షకుడు పొంగి
తీర్పుగా ఆటల నేర్ప ఫలమె

తే॥ అమర బాల్యయౌవన కాలమంతరిత్త
జారిమునలియై నిను మదిగోర ఫలమె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 34

సీ॥ ఇంటికి శోభయే యిల్లాలు నిజముగా
పసుపుకుంకుమ శోభ పడతులకును
సభయందు జూడగా సత్కవీంద్రుడు శోభ
గగన మందున సుధాకరుడు శోభ
వనవృక్షములకెల్ల ఫలవృక్షములు శోభ
వసుధాస్థలికి వృక్షవనము శోభ
కనతటాకమునకు ఘనరసమే శోభ
సారసంబులు శోభ నీరములకు

తే॥ దేహమునకు బాటింపగా దేహి కాంతి
దేహికరయంగ నినుగను తెలివికాంతి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 35

సీ ఎక్కడెక్కడనొ నిన్నేగి శోధించిన
ఉన్నచోటనె నీవునుండి నావు
మందుడనై నేను మఱచి యుండినగాని
కంటికి ఱెప్పటుల్ గలవు నీవు
కలడని నిను నమ్మి కొలచినవానికి
కనులముందే సదాగలవు నీవు
లేడని నినుమది లెక్కసేయని వాని
కేనాటికైనను లేనె లేవు

తే దృష్టి రీతిగ గనవచ్చు సృష్టి తీరు
వారి వారి బావన బట్టి స్పష్టమగుదు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 36

సీ వజ్రాన వజ్రమున్ వ్రక్కలించినయట్లు
కర్మతో కర్మను గడకు నెట్టి
ఇనుముతో యినుమును అణగగొట్టినయట్లు
అనుభవమున స్వాంతమణగ జేసి
ముల్లుతో ముల్లును వెళ్ళ దీసినయట్లు
కామాస కామమున్ గాలబెట్టి
మట్టితో మట్టిని నెట్టి వేసిన యట్లు
మాయతో మాయను మాయజేసి

తే సృష్టిపై దృష్టి పోకుండ జేసినన్ను
చెంతగొనుమయ్య త్వరగ నీసేవజేతు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 37

సీ భావాబ్ధి దాటింప జీవనావికుడవై
బోయని పడవెక్కి పోయితంట
ముజ్జగంబులు నీదు బొజ్జలో నుండంగ
శబరి భిక్షకు చైసాచితంట
సర్వభూతములకు సాయంబు నీ వుండి
కోతుల సాయంబు కోరితంట
జీవ బంధము లెల్ల చింపి వే సెడు నీవు
పులుగుతో బంధంబు తొలగితివట

తే చిత్రమయ్యె నీ ముచ్చట చెప్పుచుండ
దాసులను బెంపు చెసెడు తలపుగాదె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 38

సీ నాకు విద్యాశిక్ష నామమాత్రంబైన
కవితతోస్తుతి యించు కళనొసగుట
శాస్త్ర పరనలేని జాడ్యతగల నన్ను
సత్కవుల్ మెచ్చుగా సల్పియుంట
భావిలక్ష్యములేని బాటసారిని నాకు
భవ్యలక్ష్యపుతోడు భాగ్యమిడుట
మాయాంధకారాన మసలుచుండిన నాకు
జ్ఞాన ప్రకాశ ప్రసాద మిడుట

తే రామనామ ప్రబావ లలామమునకు
సాక్ష్యములు గావె ప్రత్యక్ష్య సత్యముగను
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 39

సీ ధరకలియుగమునసుర జన్మమునకంటె
కృతయుగంబున దైత్య గతియె మేలు
కలియందు వరయోగి ఘన జన్మమునకంటె
త్రేతలోపల పక్షిజాతి మేలు
కలిలోన వరరాజ బలజాతకము కంటె
కోతిగా త్రేతలో గూర్పమేలు
కలిలో నవిజ్ఞాన ఘనజన్మము కంటె
ద్వాపరమ్మున పశుత్వమ్ము మేలు

తే యిట్టి కలియందు బుట్టి సుఖించుకంటె
నిన్ను గొని కష్టముల మధ్య నిలువమేలు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 40

సీ ఎదుట నేరము లేరి యీర్ష్య యించుక లేక
చక్కదిద్దిన వాడె సన్నిహితుడు
తప్పులొప్పుగ బల్కి తనముందు బొగడుచు
సంచరించిన వాడె శాత్రవుండు
కల్మిలేములయందు కష్టకాలములందు
వచ్చితోడగు వాడె బాంధవుండు
వాటంబుకని పెట్టి వచ్చిపెంపులు పల్కి
కుడిచి పోయిన వాడె కుత్సితుండు

తే ఖండితంబుగ శిక్షించి కపటిగాక
సంస్కరించిన వాడెపో సద్గురుండు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 41

సీ పాంచభౌతిక తత్త్వమెంచు గర్వమె కాని
వాని గల్గించు నీ ధ్యానమరుదు
సోమమండలమేగు చోద్యమెంచుటె కాని
దానినిల్పిన నీదు తలపులేదు
యంత్రాలు కనిసేయు నతని మెచ్చుటెకాని
భూతాలజేయు నీ ముచ్చటరుదు
మెఱుపు శక్తిని గొన్న మేటి గొప్పలె కాని
శక్తి జేసిన నీ ప్రసక్తి లేదు

తే పంట పండించి నయ్యను బ్రక్కకుంచి
వంట వండి పెట్టిన యమ్మ వాసికెక్కె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 42

సీ కామియెన్నడు సిగ్గు కరుణ నెన్నడు లోభి
మంచి చెడ్డ గనడు మత్సరుండు
మదమెఱుంగడు స్థితిన్ ముదమెఱుంగడు గతిన్
మోహమెఱుంగడు ద్రోహములను
రుచినెఱుంగడు క్షుధ శుచినెఱుంగడు నిద్ర
కోపంబెఱుంగడు పాపములను
ధర్మమెన్నడు బాధతథ్యమెన్నడు భీతి
గర్వంబెఱుంగడు కర్మనీతి

తే పండితుల శ్రమ లెఱుంగడు పామరుండు
నీదుపదభక్తి తెలియడు నీచుడెపుడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 43

సీ దేవకార్యములందు ద్వేషముంచుట చేటు
గోవుల బనిగట్టి కొట్ట చేటు
ఫలవృక్షముల క్రింద మలము వీడుట చేటు
సలిలాగ్నులను మియగలుగు చేటు
స్నానమాడకమున్న సాదంబు దిన చేటు
నిండు శుద్ధిగ లేని తిండి చేటు
కామదృష్టిని గల్గి గరితల గనచేటు
యిల్లాలి నెప్పుడేడ్పింప చేటు

తే దారులుంచక బావులంద్రవ్వజేటు
కోరినిన్ గొల్వకున్నచో గొప్పచేటు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 44

శిష్టగ్రహములతో దుష్ట గ్రహంబుండి
మేలు గూర్చిన మాత్ర మిత్రమగునె
రత్నంబు పొడ సోకి రాజిల్లు మాత్రాన
ఆయినిక్కంబుగ రత్నమగునె
మింటరిక్కల చాడ్పుమెఱయు మాత్రనసుల్క
స్వప్రకాశంపు నక్షత్రమగునె
అగ్ని గ్రాగిన వేళ నరయలోహపుదున్క
యగ్నిగా గనిపింప యగ్నియగునె

తే దుండగుడు సజ్జనులచెంతనుండువేళ
సత్ప్రవర్తన జూపిన సాధువగునె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 45

సీ హెచ్చువానికి దీవనిచ్చు పెద్దలెకాని
చచ్చువానికి నిచ్చు స్వాములరుదు
నిండువానిని బిల్చి నింపుదాతలె కాని
యెండు వానికి బెట్టు హితులె యరుదు
దాసులన్ శోధించదగు దేశికులెకాని
తగుదేశికున్ జూచు దాసులరుదు
సభను నీతులు పల్కు స్వార్థపరులె కాని
నీతితో బ్రతికెడు నేతలరుదు

తే అరచి పుణ్యముల్ బోధించు నరులెకాని
సాధు ధర్మమ్మునడుపు సంసారులరుదు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 46

సీ తరులలో సద్గంధ తరువుగల్గిన రీతి
నరులలోపల ఋషివరులు వేఱు
పంచలోహములందు బైడిగల్గిన యట్లు
అతివలందున సాధ్వులరయ వేఱు
మక్షికాజాతిలో మధుపరాజము రీతి
జనులలోపల సాధుజనులు వేఱు
ధేనువులందివి ధేనువుండిన పోల్కి
హితులలోపల లోకహితులు వేఱు

తే అరయపక్షులందు పరమ హంసరీతి
భక్తులందున నీ భక్త వరులువేఱు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 47

సీ కర్మచండాలుని కంటె బలశ్రేష్ఠుండు
జాతిచండాలుడే జగతిలోన
చదువనేర్చిన మూర్ఖజనుని కంటె ఘనుండు
చదువని మూర్ఖుడే శతవిధాల
కులటా గృహిణి కంటె నిలలోన గణియింప
వేశ్యయే గుణవతి వేవిధముల
రాజ్యంబు గలిగిన రాజ రాక్షసుకంటె
కూటి దొంగయె దొడ్డ కోటిగతుల

తే గురుకటాక్షము కొని చెడ్డ క్రూరుకంటె
గొనక చెడునట్టి క్రూరుడె గొప్పవాడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 18

సీ కవనంబునకు సలక్షణ శాస్త్ర నియమముల్
భావంబు కర్దని పలుకువారి
పరమాత్మతత్త్వంబు నరయంగ యోగంబు
లాచారములె విఘ్న మనెడి వారి
ఆదిదేవునెఱుగ వేదశాస్త్రంబుల
జదువు లెందు కటంచు వదరు వారి
బ్రహ్మంబునందగా వర్ణాశ్రమంబుల
వరుస యెందుకటంచు పలుకువారి
చేతగాని తనము జెప్ప నగ్గొతారు
చెడుచుండి పరులను జెఱచుచుంద్రు

తే కూటిలో ఆయిదీయని గ్రుడ్డి చవట
యేటిలో దీయగలడను బెట్టి మాట
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 19

సీ. రుచిరరూపము కంటె శుచి శీలములు ముద్దు
శుచికంటె ముద్దు సద్వచనమరయ
సద్వచనముకంటె సద్విద్యయే ముద్దు
విద్యకంటెను ముద్దు వినయగుణము ముద్దు
వినయగుణముకంటె విమల ధర్మము ముద్దు
ధర్మంబు కంటె వర్తనము ముద్దు
వర్తనంబునకంటె స్వార్థ శూన్యత ముద్దు
దానికంటె పరహితంబు ముద్దు

తే. భూతదయకంటె నీ భక్తి పొసగ ముద్దు
పొసగునీ భక్తి కంటె నీ పొందు ముద్దు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 50

సీ. తెరదృశ్య నటనలు దేలుటేమో కాని
జారచోరులసంఖ్య మీరిపోయె
భౌతిక జ్ఞానంబు బహుగవెలసె కాని
నైతిక జ్ఞానంబు నాశమయ్యె
పలువాహనంబులు కలుగుటేమో కాని
పరమ భూముల పుణ్యఫలముతగ్గె
ముద్రణ యంత్రముల్ పుట్టెను సరెగాని
దుర్విద్యయే ప్రాకె నుర్వినెల్ల

తే. సారమతులు సలుపు నుపకారమెల్ల
గాంచన పకృతిన్ జేసెనీ కలివిభుండు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 51

సీ కర్మ భారముడుప గాళ్ల బడుట గాదు
భారముల్ మోసెడు బలమొసంగు
శ్రమలకోర్వగలేక శరణువేడుట గాదు
శ్రమలను సైరించు శక్తినొసగు
మిత్తి భయంబున కెత్తి కొల్వగ లేదు
దాని డీ కొనునట్టి ధైర్య మిమ్ము
ఇంద్రియచాంచల్య హీనంబు గోరను
తన్ని గ్రహత్వంబు తగనొసంగు

తే దర్శనం బీయ నీవెంట దగులలేదు
ధ్యాన మిచ్చికృపంజూప దలచినాడ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 52

సీ స్వరగీత మూదుచు జాంగలికుడు నాగు
నొడిసి పట్టుచు బుట్టి నుంచుభంగి
ఔషధంబన రోయు వ్యాధిపీడితునకు
ఇంపు వస్తువున మందిచ్చు భంగి
మత్తెక్కి తిరిగెడు గిత్తను రైతన్న
బహుయత్నములతోడ పట్టు భంగి
అర్భకునకు నక్షరాభ్యాస మొనరింప
సుందర చిత్రముల్ చూపుభంగి

తే అవనిభోగాలపై కొంత ఆశజూపి
పరమలక్ష్యాన మదిని నీ దరికి జేర్తు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 53

సీ. కడుపునగనునాడు కన్నవాలరుకారు
 పెంచి నేర్పరిని గావించునాడు
తనకు గల్గిననాడు తనయుండు గాబోడు
 ప్రాజ్ఞులు సరెయని పలుకునాడు
తోడబుట్టిననాడు తోబుట్టువులు కారు
 కలసి బ్రదికి ఖ్యాతిగాంచునాడు
పట్టమొందిననాడు ప్రభుడు గాడు నిజంబు
 సమభావమున ప్రజన్ సాకునాడు

తే. జపము గొనునాడు నీభక్త జనుడు గాడు
తపముచే నిన్ను మెప్పింప దగిన నాడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 54

సీ. బాలురెందరటంచు బ్రశ్నింతురే కాని
 ప్రతిభలెన్ని యటంచు బలుకడెవడు
ద్రవ్యమెంత యటంచు దట్టియడ్గుటెకాని
 యెవ్వరడ్గరు ధర్మమెంత యనుచు
కులమదెట్టిదటంచు గోరియడ్గుటెకాని
 యెవ్వరడ్గరు గుణాలెట్టి వనుచు
సౌఖ్యమెంతని నోట సాగియడ్గుటెకాని
 సంస్కృతి యెంతన జాలడెవడు

తే. యుక్తి రక్తి భుక్తుల నడ్గ చుంద్రుగాని
భక్తి నీ మీదయెంతంచు బలుకడెవడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 55

సీ అగ్నియు జలములు నవసరంబు లెరెండు
అవిలేక ప్రాణంబులాగ లేవు
అయిన నజ్ఞత జిచ్చు నంటి వాడిన హాని
యంటి వాడక హాని యగును జలము
అటులె ప్రకృతి పరమార్థంబులును రెండు
అవసరంబులె మానవాళి కెపుడు
చిచ్చు వంటి ప్రకృతి సృష్టి సంసారంబు
మతిమాలితగులుచు బ్రతుక హాని

తే జలము బోలు పరమార్థ మౌచల్లనైన
నిన్నునంటి కొల్వకయున్న నిజము చావె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 56

సీ నడకలందు తెలియు నయనీతి చిత్తమ్ము
బోధలందు దెలియు బుద్ధి బలము
శ్రమలలోన దెలియు శాంత స్వభావంబు
దారిద్ర్యమున చూడు దానగుణము
ఏకాంతమున గాంచు నిచ్చా చరిత్రంబు
చిక్కినప్పుడె చూడు చక్క దనము
రణరంగమున గాంచు ఘనమనోధైర్యంబు
పొత్తుచేయ తెలియు బొసగు గుణము

తే పండితుల సభలో గాంచు బ్రతిభయెల్ల
కలవరింతలో వాసనా బలము దెలియు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 57

సీ అభ్యాసమున విద్య యారాటమున గల్మి
శ్రద్ధతో జ్ఞానంబు సాధ్యమగును
యోగంబుచే శక్తి త్యాగంబుచే కీర్తి
శీలంబు నారోగ్య జాలమమరు
సత్కర్మచే శుద్ధి సద్భక్తమున బుద్ధి
యత్నంబుతో గ్రియలందు సిద్ధి
స్థైర్యమందు నయంబు ధైర్యమందు జయంబు
స్నేహాన గుణములు చిక్కుచుండు

తే విషయ వైరాగ్యమున భక్త వృద్ధి చందు
భక్తితో బద్ధసంసార ముక్తి దొరకు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 58

సీ ఈ గద్దెకోసమా ఇన్నాళ్ల నుండినే
వేయినోళుల నిన్ను వేడుకొనుట
ఈ మిద్దె కోసమా యింతకాలము దాక
విలపించి వీడు నీ వెంట బడుట
ఈ చద్ది కోసమాయింత పర్యంతంబు
నెమ్మనమ్మున నిన్ను నమ్ము కొనుట
ఈ విద్దె కోసమా యిందాక తాలుచు
కోరికతో నిన్ను గొలిచియుంట

తే ఎందుకయ్యా నామర్మ మీ వెతిగియుండి
మచ్చు చల్లుట నీకిట్లు మెచ్చుగాదు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 59

సీ. చక్కని వరవాజి యెక్క జిక్కగ లేదె
వైన తేయుని తప ఫలమదేమొ
పరుపుదిండులు నీకుబవళింప దొరకవే
శేషుని యోగ విశేషమేమొ
నివసింపదగినట్టి భవనంబు లేదొ కో
పాలకడలి పుణ్య బలమదే మొ
ధరియింప మణులున్న దండలు లేవొకో
తులసినోచిన నోము ఫలమదేమొ

తే. అన్ని యైశ్వర్యములు నీకు నమరియుండ
బూనివాని నంటుట వారి పూర్వఫలమె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 60

సీ. సజ్జనులకు సంతుస్వల్పంబుగా నిచ్చు
ఖలులకు బహుళంబు కలుగజేయు
ధర్మదాతలగడు ధనహీనులంజేయు
లోభమూర్ఖులకు బేరులనొసర్చు
పరమపాపుల భోగ భాగ్యవంతులజేయు
బహుకష్టములు ముంచు భక్తజనుల
అధమాధముల నేది అధికారములనిచ్చు
నీతినేతల తలవ్రాతమార్చు

తే. నిట్లు వికటాన అటనట నెనగసృష్టి
స్రష్ట ఆడించు జగము నీ కిష్టమౌనె
కలివిచిత్రంబు చూడు మోకమలనాభ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 61

సీ జడ్ను కడలి తడల్ చెలరేగి ధ్వనియింప
వినబడలేదొనా విన్నపంబు
పరమయోగపునిద్ర బట్టి యుండుట చేత
అందకుండెనొ నాప్రయాస వార్త
సామవేదస్తుతి సంగీత మూలాన
చెవిజేర లేదొ నేజేయు మొఱలు
నసుమించు భక్తులనంత మగుటజేసి
తలపు కెక్కదొ నేను పిలుచు ఎలుపు

తే కారణంబేమి తంద్ర నాకష్టములను
గానకుంటివి నినునమ్మ గతియిదేన
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 62

సీ మఱ్ఱియాకున బన్న మబ్బుకాంతుల కుఱ్ఱ
నిఖిల విశ్వము కఱ్ఱ నీదు బొఱ్ఱ
బ్రహ్మాండముల నెల్ల బాలించు నీ కఱ్ఱ
యాలకింప వదేలనయ్య మొఱ్ఱ
తఱ్ఱుతుఱ్ఱను దాల్చి విఱ్ఱవీగుచు గఱ్ఱ
మిఱ్ఱు జూపగ గల్లమీద బఱ్ఱ
దేహిమాయార్క జదివిజులకగు జిఱ్ఱ
అరయవచ్చెదు జగమంత బుఱ్ఱ

తే శుభదరామ నామ సుధను జుఱ్ఱ జుఱ్ఱ
పాన మొనరింప నోచని బ్రతుకు తొఱ్ఱ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 63

సీ కన్ను విప్పని కందు గగనమున్ జుంబించు
హిమ పర్వతాగ్రంబు నెక్కు చాడ్పు
కదలని పంగువు గంభీర మగుసము
ద్రేంద్రమ్ము లీల లంఘించు భాతి
అష్టదరి ద్రుండు నందంపు మగఱాల
మేల్మైన మేడనిర్మించు రీతి
పరమ దౌర్భాగ్యుండు సురనివాసంబైన
దేవలోకంబు సాధించు భంగి

తే నీదుకృప చేత ఒగమెల్ల నివ్వె రొంద
కవన ఫణితో నినుగొల్వ గలిగినాడ
భద్రగిరి పాల। శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। సువిశాల తత్వమూల। 61

సీ నీలంపుటలకల నిండైన ముని కొప్పు
మోహన శిరముపై ముద్దు గొలుప
అమ్ముల పొది భారమైన కోదండంబు
బలువు మూపులపైని పరిడవిల్ల
నిగ్గు చిల్కు గగన నీలంపు తనువుపై
వల్కలమ్ములు శుచినొల్కిచూప
కోటిభాస్కర కాంతి కొమరొప్పు మొగముపై
ధర్మావన తపస్సు తాండవింప

తే ఆదిదేవ నీముని రాజు న కృతి గొని
నిలువుమయ్య నాహృది సదా నిశ్చలము॥
భద్రగిరి పాల। శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। సువిశాల తత్వమూల। ౬౨

సీ ఏటేట గాముని గాటిలోపల బెట్టి
కాల్చిన జావడెక్కారణంబొ
చంపిన వాడట్టె చంపక మగుడీనా
ముక్కంటి బ్రదికించి ముప్పుపెట్టె
చచ్చిలేచిన గాని జంకింత లేకుండ
చిచ్చయ్యె బుధులకు బిచ్చిమరుడు
కాకోదరము జంపి క్రమ్మఱ బ్రతికింప
దొల్లింటి గుణమెట్లు దొలగునయ్య

తే కన్న భ్రమవీడి పరమార్థ కంటకుడని
శిక్షసేయవే జ్ఞానుల జేరకుండ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 66

సీ నరశరీరంబును ధరియించు మాత్రాన
నరులుగారందఱు న్యాయముగను
నరరూప దానవుల్ నరరూప దైవముల్
నరరూపపు పిశాచులరయగలరు
నరరూప ఖగములు నరరూప మృగములు
నరరూప పశువులు అరయ గలవు
నరరూప శునకముల్ నరరూప సర్పముల్
నరరూపు వృశ్చికా లరయ గలవు

తే వేయునేటికి నరులందు వెతకి చూడ
సకల భూతాంశములు నుండు సత్యమిదియ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 67

సీ. సీతమ్మ కథయన్న బ్రీతితో విందురు
చుప్పనాతి గుణంబు దప్పబోరు
రామాయణంబన్న బ్రేమతో బఠియింత్రు
రావణాసురుడేగు త్రోవవిడరు
ప్రహ్లాద భక్తిని బాల్పడి విన్నను
కనక కశిపునిరాక్షసత విడరు
పాండవ న్యాయంబు భళి భళియందురు
దుర్యోధనుని బుద్ధి దొలగనీరు
తే. సార్ధకంబేమి పైకెన్ని చదివి విన్న
జడులు తమ పుట్టుక గుణంబు సడలనీరు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 68

సీ. మాటలో రాముండు మనసులో కాముండు
నమ్మరాదన్న యీనాటి నరుల
మైనిండ వేషంబులోనంత మోసంబు
నమ్మరాదన్న యీనాటి నరుల
కూతలో నీతులు చేతలో గోతులు
నమ్మ రాదబ్బ యీనాటి నరుల
చూపులో తీపులు లోపల తూపులు
నమ్మరాదబ్బ యీనాటి నరుల
తే. ఇట్లు దుర్మార్గులెన్ని నాళ్ళీ జగమున
బ్రతికి యేమి సాదింతురో ఫలముదెలియ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
దర్మగుణశీల! సువిశాల తత్వమూల! 69

సీ  కోటి కల్లలు బల్కి కొంపలార్చెడి పచ్చి
    పగటి దొంగలమాట పాటియయ్యె
పరమ ధర్మము చేత బ్రతుకు చుండిన సత్య
    సాంసారికుల మాట సాగదయ్యె
లంచగొండులుమఱి రౌడీలె పెద్దలై
    జగతిలో ఘనత యశస్సుగనిరి
రక్తంబు వడిసి నీభక్తిచే జీవించు
    సజ్జనుల్ పడరాని శ్రమలు పడిరి

తే  యేమి అన్యాయమోయిది రామరామ
చూడరాదిట్టి కలిమాయ పాడుగాను
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 70

సీ  కందమూలములైన కాంక్షచే భుజియించి
    కొలువు నీయది సేతు గోసలేంద్ర
కష్టంబులెన్నేని కలిగినప్పటికిని
    నిమిషంబు నినువీడి నిలువజాల
స్వర్గభోగము లిచ్చి సాకుచుండిన యట్టి
    యింద్రుని కొలువైన నిచ్చగింప
తనువులోపలి ప్రాణి నినుజేరు నందాక
    దాపుండి చూపుంచు ధర్మరూప

తే  తనువు ధన మనమ్ములు నీవె మనువునీవె
తండ్రివీవె నాయాత్మ స్థదైవమీవె
భద్రగిరి పాల! శ్రీరామ! బక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 71

సీ నేజేయు పనులందు నీవు ధర్మంబెన్న
క్షోణిలోపల నాకు చోటులేదు
నేబల్కు పల్కులన్నీవు తప్పెన్నుచో
రసనకదల్ప నర్హతయులేదు
నేజూచు చూపులన్నీవు తప్పెన్నుచో
కనులు విప్పుటకు యోగ్యతయులేదు
నా తలంపులయందు నీతి నీవెన్నినో
ఈమనంబుండుట కిరవులేదు

తే తండ్రి నీ యొరగంటి చేదక్కియుంటి
బ్రతుకుదునె నీవు దృఢముగా బట్టునెడల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 12

సీ మరియాద రామన్న మాయింట నిలకున్న
మర్యాద గాదన్న మహాని నీకు
ముద్దుల రామన్న ముద్దు మాకిడకున్న
ముద్దు నీకిదిగాదు ముద్దుతండ్రి
మేటైన రామన్న మాటాడలేకున్న
సూటి నీకిదిగాదు తాటకారి
ప్రియమైన రామన్న ప్రియము సూపకయున్న
ప్రియముగాదిది నీకు నయవిశాల

తే అఖిలలోకాభిరామ నాయాత్మలోన
జేరిపాలింపకున్నచో జెల్లుగాదు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
దర్మగుణశీల! సువిశాల తత్వమూల! 71

సీ అనుకూలసంసారమొన గూర్చి వీనికి
నన్ను మఱుపజేయ నున్నవేమొ
ముద్దు సంతతినిచ్చి మురిపమందున ముంచి
తప్పించుకొన నీవు దలచినావొ
రాజగౌరవమిచ్చి రక్తిలోపల ద్రోసి
వీనిమోసము చేయవేచినావొ
ఐశ్వర్యసుఖమిచ్చి యాప్తుల బలమిచ్చి
వంచించి వదలిపోనెంచినావొ

తే యిట్టి పప్పులు నన్ను మెప్పింపగలవె
చాలు చాలు నీతంత్రాలు సాగవిచట
నిన్నువిడిచిన ఫలమేమి ఇన్నియుండి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 74

సీ నీ చూపుపడెనేని నీచాత్మకుండైన
పరమ పూజ్యుండునై పరగుచుండు
నీ చూపుపడెనేని నిమిషాన సుఖముగా
కొండనైననుదాటు కుంటివాడు
నీ చూపుబడినచో నెఱిజనుషాంధుండు
చూడ్కుల జగమంత చూడగలడు
నీ చూపుపడెనేని నిపుణతతో మూగ
చర్చించి గ్రంథముల్ చదువగలడు

తే స్వామి భవదీయ కారుణ్య భాగ్యమునను
కానిపనియేది సృష్టిలో జానకీశ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 75

సీ దర్శింప నీయవే దయతోడ నొకతూరి
జనకుండు గడిగిన చరణయుగము
స్పర్శింపనీయవా భక్తితోనొక తూరి
బండ పడచు జేయు పరమపదము
సేవింపనీయవే భావించి యొకసారి
సీతమ్మ సేవించు శ్రీపదంబు
అర్చింప నీయవే హర్షించి యొకసారి
హనుమన్న పూజించు అంఘ్రియుగళి
తే మ్రొక్క నీయవే యొకమారు మొనసినన్ను
రావణానుజ శరణ దరాజపదము
భద్రగిరి పాల। శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। సువిశాల తత్వమూల। 76

సీ రూపసంపదలతో రుచిర విద్యలతోడ
నిచ్చోట నరజన్మ మిడుటకంటె
శ్రీయయోధ్యాపురిన్ జన్మి కోతిగనైన
జిత్రకూటమునందు జెట్టునైన
శ్రీకాశిలోఎబ్బి జీమగానైనను
బంచవటీ స్థలిన్ బక్షినైన
రామేశ్వరంబున సామజంబుగనైన
భద్రాద్రిపై నొక్క బండనైన
తే జేవ వేయక నన్నిల జెఱచినావు
సూర్యకులసోమ రఘురామ సుగుణధామ
భద్రగిరి పాల। శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। సువిశాల తత్వమూల। 77

సీ రాజీవ సుతుడవై రకరకంబులు గాను
సృష్టించి సృష్టించి చిత్ర జగతి
చక్రధరుండవై చల్లగా వర్ధిల్ల
పోషించి పోషించి భువనములను
ఫాలచక్షుజ్వాల కాలరుద్రుండవై
సమయించి సమయించి సకలములను
క్షీరార్ణవము మధ్య జేరి లే గుఱ్ఱివై
మఱ్ఱియాకున బండి మసలనేల

తే అయ్యయో అంతయలసిన యయ్యనీవు
శ్రాంతి గొనుమయ్య నామనశ్శయ్య జేరి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 78

సీ తాత్కాలిక పురుచి దలచియు వెంగళి
విసపు టన్నంబును మెసపు మాడ్కి
పంచేంద్రియార్థసంబద్ధుడై మనుజుండు
ధర్మమార్గంబును దప్పుమాడ్కి
పదవి గర్వంబున బ్రజలను బీడించి
అధిపతి స్వేచ్ఛగా నాడుమాడ్కి
అప్పటి సుఖము నకాసించి గజదొంగ
పరుల ద్రవ్యముదోచి బ్రతుకుమాడ్కి

తే మాయసంసార సుఖమును మరగి నరుడు
తేపు తలదన్ను నరకంబు లెక్కగొనడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 79

సీ ఇందుకేనా మౌను లిహము కాలందన్ని
కాయగడ్డలు మెచ్చి కాననుంట
ఇందుకేనా శుకమౌనీంద్రుడలనాడు
తల్లిగర్భమునుండి వెళ్లనుట
యిందుకేనా మరున్నందనుండలనాడు
కొంటెకామునిగెంట యొంటిగుంట
యిందుకేనా సుభద్రేశుండు రణభూమి
విల్లమ్ములను నేల విసరి యుంట

లేదు లేదయ్య జన్మలో లేశమైన
సుఖము శాంతమ్ము పరికింప శుద్ధతత్వ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 80

సీ చీకులు నలువురు చేరి యొక్క గజంబు
ఋణుకుచు పరుసగా బుద్ధిలోన
తొండమమరువాడు దూలంబు చందాన
తోఁక బట్టినవాడు దుడ్డురీతి
కాలువట్టిన వాడు కంబంబు చాడ్పున
కడుపు బున్కిన వాడు కాగుమాడ్కి
భావించి తమలోన వాదించి లోకాన
నగు బాటుబడినట్లు నరులు చూడ
మతపక్ష పాతులు మహిలోన కొందఱు
నఖిల భూతేశు నేకైక మూర్తి

తే నాది మధ్యాంతరహితు నిన్నరయలేక
త్రెంచి వాదింత్రు జనులలొంగించు కొఱకు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 81

సీ పరమనాస్తికులెద బరమాత్మ గలదంచు
పిడివాదమున నోటనుడివి నాడ
బలులు నంజేరియు బ్రశ్నింప జర్చించి
బలమీశ్వరుండంచు బలికినాడ
స్వామిని నమ్మిన సాధువు చెడదని
జగమున గళమెత్తి చాటి నాడ
బంధుమిత్రులముందు ప్రతినతో గర్వించి
యాదేవుడే నాకు నన్నిటంటి

తే కానలోకమేకంబయి కాంచుచుండె
ఎటుల నెగ్గింతువో నన్ను నెఱుగముందు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 82

సీ పత్నికక్కరగాని పతియుంద మెందుకు
బ్రతుకు కక్కరరాని భాగ్యమేల
ఆజికక్కరరాని మోజు బంటెందుకు
తల్లిదండ్రికిగాని తనయుడేల
సంకటంబున లేని సఖులుబాంధవులేల
భావుకుల్ మెచ్చని బ్రదుకదేల
తరియింపజేయని గురువరుండెందుకు
వరియింపలేని వివాహమేల

తే ప్రజల కక్కరరాని భూపాలుడేల
స్వామి నిన్ను గొల్వగలేని జన్మమేల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 83

సీ తప్పుద్రోవను బోడు ధర్మశీలుండెప్పు
డొకడుచేయగ జూచి యోర్వలేడు
తానుజేయడు మంచి హీనస్వభావకుం
డొకడు చేయగ జూచి యోర్వబోడు
సంకటాలెన్నైన సహాయించు సద్గుణి
భరియించ లేడాత్మ పంచనంబు
ఎన్ని బంధురముల నీగి వంచితుడైన
బాపి ప్రాకృత బుద్ధి బాయలేడు

తే ధాత్రి సాధ్వ సాధుల తారతమ్య మిదియ
ధరణిజానాద! దయజూడు ధరణినాధ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 84

సీ నిన్ను గూర్చియు ప్రేమనన్ను జేసెడి వారి
నేను ప్రేమించెద నెమ్మనమున
నన్ను గురించి యేనన్ను ప్రేమించెడు
వారినే ప్రేమింప వసుధలోన
భవదర్పితమ్ముగా భావించియిడుగాని
సంతోషమున స్వీకరింతునేను
మామ కార్పితముగ ప్రేమ నేన్నిచ్చిన
గైకొన నొల్లనే కలలనైన

తే నిన్ను జూచుటకై నన్ను గన్నవారి
నేనుగాంచెద లాతులగాన నొల్ల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 85

సీ. శివ భక్తి నెవ్వడు చిత్తమందెఱుగడో
హరిభక్తి నెఱుగ లేడతడు నిజము
హరిభక్తి నేనరుండాత్మలో నెఱుగడో
శివభక్తి నెఱుగడు ధ్రువమతండు
జీవసేవ నెవడు సేయంగ నేర్వడో
దేవ సేవను వాడు దెలియలేడు
దేవసేవ నెవడు భావించి చేయడో
జీవ సేవను వాడు చేయలేడు

తే. ఇట్టి ఆంతర్యమెఱుగని పొట్టిమతులు
కపటగర్వులై తుదముట్ట రెపుడుగాని
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 86

సీ. పలలంబు నటుగోరు పాయసమ్మిటుగోరు
వాయసజాతి స్వభావమేమొ
అటుజూచురోతకై యిటుజూచునేతికై
హీనకుక్కుర గుణంబేమొ కాని
భ్రమసి రక్తము కాసపడు పాలకాసించు
ఊరబిల్లి మనంబు తీరదేమొ
పెంటనంటగ గోరువంట నంటగ గోరు
ఈగపుట్టుక గుణంబే మొ అటులె

తే. కౄరులిల నీచ సుఖములగోరి మఱియు
సూరులట్లునిన్ బొందగా గోరుచుంద్రు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 87

సీ మగలము మేమంచు దెగబడి కూతురు
మగతనంబే లేని మగలు భువిని
నాది నేనని నోట వాదించుచుందురు
స్వాతంత్ర్యమేలేని చాకిరీంద్రు
సుఖము బొందితిమంచు ముఖమెత్తియుఱతురు
సుఖముఖంబెఱుగని సష్కమతులు
తెలియువారలమంచు దెంపుతో నందురు
తెలివిమాలినమెండు తిక్కనరులు

తే బ్రతుకు చున్నామటంచును వదరుచుంద్రు
బ్రతుకలేక చచ్చుచు బుట్టు చతుకునరులు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 88

సీ కయ్యంబు లొకవైపు వియ్యంబులొకవైపు
చిత్రంబు చూడనీ సృష్టిమాయ
కానుపు లొకచోట కాష్టంబులొక చోట
చిత్రంబు చూడనీ సృష్టి ధము
శోకంబు లొకయింట సుఖగీతులొకయింట
చిత్రంబు చూడనీ సృష్టిమాయ
ధర్మాత్ములొక వంక దుర్మార్గులొక వంక
చిత్రంబు చూడనీ సృష్టి విధము

తే పంచరంగులు గల యీ ప్రపంచమెల్ల
యెట్లు చేసెనో ఆ బ్రహ్మ ఎఱుగవశమె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 89

సీ విధిలేక భారతి వెగటు జిహ్వలపైని
విక్రుతిగామారి వెతలమునిగె
పాపరేపుల యిండ్లబడ చిక్కిదరిలేక
కలిమి కన్నీళుల నొలుకు చుండె
నీతి హీనుల చేత నిలిచి భూమాతృక
తల్లడిల్లుచునుండె దాళలేక
ధర్మదేవత గతిదప్పచు దరిగాక
కొండ గోగులలోనగుందుచుండె

తే కానవేమి నీ సంసార గతిని నేడు
నవ్వుబాటయ్యెనయ్యయో నయగుణాఢ్య
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 90

సీ శిరమున మణిమయవర కిరీటంబును
కరమున కోదండ శరధరంబు
ఉరమున శ్రీవత్స మణికాల శుభరేఖ
కంధరంబున దివ్యకౌస్తుభంబు
మూపునమ్ముల పొదిమో మునసిరి బొట్టు
పసిడి వల్వలు మేని బరిఢ విల్ల
మఱియు కర్ణములందు మకరకుండలములు
నపరంజిమొలపట్టె యమరకటిని

తే కోటిమకరాంక తేజంబు గుప్పచుండ
నేది దర్శింప చేయుమా నీదురూపు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 91

సీ ధనము ధనముగాదు దండి పిశాచంబు
నీ నామచింతయే నిత్య ధనము
బలము బలము గాదు పాతకంపు దళంబు
నీ యనుగ్రహముంట నిజబలంబు
బంధువుల్ బంధులా పాలిటి శత్రులు
బంధులే నీ భక్త వరులు నిజము
మనము మనముగాదు మరణ దేవతసుమీ
నిను నిల్పుకొనునదే నిజమనంబు

తే తనువు తనువుగాదది యమ ధరణి గాని
నీకు నంకిత మగునదే నిజము తనువు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 92

సీ అగ్నికగ్గైన మాయమ్మను లంకలో
ఖండితంబాడు నీగుండె కటువు
తోడు నీడగనుండి తొలగని తమ్ముని
యెడబాఎనట్టి నీ యెడద బెడుసు
అడిగిన లేదనకం దిచ్చు దాతనే
అడుగంట ద్రొక్కిన గడుసుదనము
స్వర్గసాధన చేయు శంబూకునిన్ జూచి
స్వర్గానికంపు కషాయ గుణము

తే ఎఱిగి యుండియు నిన్నన నేమిఫలము
కోరి చేరిదేవుని తప్పు లేరినట్లు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల! 93

సీ అందఱుచే మంచి అనిపించు కొనలేడు
తిలకింపగా బ్రహ్మ దేవుడైన
అందరొక్క విధంబు అరయంగ నుండరు
చల్లగా నొక తల్లి పిల్లలైన
అన్ని విద్యలొకని కంటవు జగమున
నరులలో నెంత చతురునకైన
అన్ని సద్గుణములు ఎన్నగా నుండవు
ధరనెంత పండితోత్తమునకైన

తే అన్ని ఐశ్వర్య సుఖముల నందబోడు
చంద్రుడైనను కనగ దేవేంద్రుడైన
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 94

సీ విమల చిత్తునెనెంత వినుతింప నెదురుగా
అంతంత వినయంబు నతడు నూపు
స్వల్పుల నెంతెంత సమ్ముఖమ్మున మెచ్చ
అంతంత గర్వమత్యంత మగును
జడులతో మన్నించి తడవుగా మాటాడ
వరుసగా మర్యాద వదలిపోవు
జ్ఞానితో నెంతెంత పూని భాషించిన
అంతంత కూరిమి అధికమగును

తే మందభక్తుండు సుఖమున్న మఱచునిన్ను
పరమ భక్తుండు సుఖమందె భక్తి పెంచు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 95

సీ ఏ దేశమునపుట్టి ఏరీతిబ్రతికిన
ఎల్లరునీ పిల్లలే కదయ్య
ఏజాతి వారైన ఏనీతివారైన
అందఱు నీసంతతౌగదయ్య
ఏ భాష పలికిన ఏ మతంబుననున్న
ఎల్లరు నీ బిడ్డలేగదయ్య
ఏ రు పు కలిగిన ఏవేశమేసిన
అందఱు నీ వారలౌగదయ్య

తే జ్ఞానియైన మానవుడిట్లు సకల జనుల
సమముగానెంచి నినుగాంచు సత్యమిద్ది
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 96

సీ అందినట్టే అంది అందని చంద్రుని
చందంబునందరా వెందుకయ్య
చిక్కనట్టే చిక్కి చిక్కని హంసవై
ఎక్కడికో ఎగిరేగుదయ్య
పలికినట్టే పల్కి పలుకని చిలుకవై
కులుకుచు నెక్కడో కూరుచుందు
కనబడినట్లుండి కనబడకుండగ
ఆక్షణంచే మాయమౌదువయ్య

తే మెఱుపు కుప్పగా మెఱసి మెర్మిట్లు గొలిపి
ఆశపెట్టి మమ్మాడింతువౌగదయ్య భిక్ష
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 97

సీ నీలోన నన్నుంచి నాలోన నీవుండి
నిన్నెఱుంగగ నీవు నేర్పదేమొ
నేజేయు చేష్టలు నీవె జేయించుచు
నామీద మోపుదు న్యాయమేమొ
ఆటల బంతిగను మాయా విభూతిని వేసి
నన్ను వాడుకొనుచు తిన్నగాను
పాపపుణ్యంబుల నాపై నిమోపగ
ఏ ధర్మమో అది ఎఱుగలేను

తే చాలు చాలు నీసృష్టిలో సౌఖ్యమిదియె
చరణమందించి కరుణతో సాకుమింక
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 98

సీ జంఘూలముగ వీచు ఝంఝూనిలమ్మును
రేణువునిలుచునే రేగి ఎదిరి
కడువేగవంతమౌ గంగాప్రవాహమ్ము
ఎదురీద గలుగునే ఎఱ్ఱచీమ
దర్పించియుండెడు దావానలమ్మును
అడ్డగల్గునె చిన్ని గడ్డిపఱక
ఆకాశమే క్రుద్ధమై బ్రద్దలైనచో
అలుపంపు జీవులు నిలువగలరె

తే తల్లియే దయ్యమైనచో పిల్లలకును
తొట్టెగట్టగా నిజము తావెట్టులుండు
నీదుదయలేక నీమాయ నీదనాకు
సాధ్యమెట్లు నీవేతెల్పు సాధువరద 99

సీ దైవమా నీదాస దాసానుదాస త
ద్దాసదాసులకునన్ దాసుజేసి
శ్రీరామ నీభృత్య భృత్యాను భృత్యత
ద్భృత్య భృత్యులకునన్ భృత్యుచేసి
పరమేశనీభక్త వరులకు నిత్యంబు
పరిచర్య చేసెడి బంటుజేసి
శ్రీనాధనీ సేవ చేయు సేవకులను
సేవించు భాగ్యపు శిష్యుజేసి

తే ధన్యునొనరింపరయ్య నీదయను జూపి
జన్మజన్మకుజన్మంబు సఫలమొంద
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 100

సీ ఎన్నిజన్మములెత్తి యెంత కీర్తించిన
దేవఋణము మాకు తీరగలదె
ఎన్ని పుట్టువు లెత్తి ఎంత భజించిన
ఏల తీరును ఋషిజాల ఋణము
ఎన్ని భవంబులనెంత సేవించిన
స్వపితౄణమును దీర్చ జనుడెవండు
ఇన్ని ఋణములకు ఈవె కారణమయ్య
భవదీయ చరణముల్ పట్టినాడ

తే అన్ని ఋణములనుండి నన్నాదుకొనుచు
పారమును జేర్ప నీదెపో భారమంటి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 101

సీ జగదంబ జానకి జగదీశ్వరుడవీవ
జగములెల్లను గన్నజంటమీరు
ప్రకృతి సీతామాత పరమపూరుషుడీవు
సకలజీవులగన్న జంటమీరు
ఆదిశక్తియె సీత ఆదిదేవుడనీవు
సర్వశక్తులగన్న జంటమీరు
వేదవిద్యయె సీత వేద సారమునీవు
సకల విద్యలగన్న జంటమీరు

తే ఆత్మజానకి సరిపరమాత్మవీవు
అట్టి ఆదిదంపతుల మిమ్ము భినుతింతు
భద్రగిరి పాల। శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। వేదాది తత్వమూల। 102

ఓం తత్సత్



ఓం

శ్రీ గణేశ్వరాయ నమ
శ్రీ సరస్వతీ మాత్రే నమ
శ్రీ లక్ష్మీ నారాయణాభామ్యా నమ
శ్రీ సీతా రామ చంద్ర పరబ్రహ్మణే నమ

# శ్రీరామ పంచశతి

(చతుర్థకాండము)

శ్రీ వైకుంఠపురేశ్వరం మునిజనశ్రేయస్కరమ్ శ్రీకరమ్
లీలామానుషవిగ్రహమ్ యుగయుగే ధర్మావ నార్థాగతమ్
వాల్మీకాదిఋషీంద్రవర్ణితగుణం బ్రహ్మానుసంధాయకమ్
దైత్యాంతమ్ నిజభక్తలోకవరదమ్ దైవాధి దెవమ్ భజే

శ్రీ లతా సంబంధ శీలకల్పక సాల!
శాశ్వత సత్కళావిశ్వ లీల!
పాలకడలివట పత్రానగల బాల!
పాలబడిన మమ్ము నేలవేల!
శ్రావణ జలధర సామ్యసుందర నీల!
పావనవనమాల! స్వర్ణచేల!
దుర్మార్గజన గణోద్ధూతదండనకాల!
అమలిన కర్మధర్మానుకూల!
తే శుద్ధపుండరీకాక్ష యశోవిశాల!
అందరావయ్య మాకు దయాలవాల!
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!

సీ చలిమంచు కొండలు తెలిమేలిముత్యాల
దండలై కంఠాన తళుకులీన
కైలాసమనుమహా కలధౌత పర్వత
రాజకిరీటంబు తేజమొలుక
నందన వనసమ నైమిశారణ్యాది
శుభతపోవన వస్త్ర శోభవెలయ
పావన జీవన వరపుణ్యగంగలు
చక్కదనాల వాల్జడలుకాఁగ
తే సత్య శివ సుందరములకు సదనమగుచు
నిత్యకాంతిప్రసారమై నిఖిలలోక
కీర్తికిని పాత్రమౌ క్షేత్రమూర్తిసుమ్మ
పరమ పావనమైన ఈ భరత మాత 2

సీ కేదార గౌరీశు శ్రీగంటి చల్వచే
చల్లఁగా నెల్ల వర్ధిల్లుచుండి
పరమ దయాళువౌ బదరినాథుని పరి
పాలన పాటవ భాగ్యమొంది
శ్రీరంగ రామేశ కారుణ్యరసవార్ధి
తరగలందనిశంబు తడిసి తడిసి
కలకత్త నెలకొన్న కాళికామాతృకా
సౌభయవరకరచ్ఛాయ నుండి
కరమొప్ప వెలసిన కాశ్మీర శారదా
చలువచూపుల లోనజలకమాడి
తే ఘనజగన్నాథ వాత్సల్య వనధిఁదేలి
అఖిల సౌభాగ్య సంపదలలరుచుండి
దేశములలోన నన్నింట తేజమెసగి
పేరుగన్నది మాదివ్య భారతాంబ 3

సీ ఏ మహామౌనీంద్రు నెదజాలితో పొంగు
శోకమే మంగళ శ్లోకమయ్యె
ఏమహాఋషి చంద్రుడెల్ల లక్షణముల
నాది కావ్యము వ్రాసి ఆద్యుఁడయ్యె
ఏ తాపసేశ్వరు డెల్లవేదంబుల
సారంబుగా రామచరిత తెల్పె
ఏ పూజ్యపరయోగి యిల యోగవాసిష్ఠ
మను మహావేదాంత వనధిఁ బఱచె
తే సకల మానవజాతికి సాధ్యముగను
ఇహపరంబుల ధర్మంబు లెఱుఁగఁజేయు
నట్టి వాల్మీకి భగవాను డవతరించు
పరమపావన భారత ధరణి మనది 4

సీ వేదరాశిని ద్రచ్చి వెన్నగా విభజించి
సృష్టిఁ బంచిన మహాఋషివరుండు
అష్టాదశపురాణ సృష్టిని నిర్మించి
విశ్వ సంస్కృతి కూర్చు విశ్వగురుడు
పంచమాగమముగా ప్రఖ్యాతిగాంచిన
భారతంబు రచించు భవ్యకీర్తి
భక్తజనుల పాలిముక్తి రాజ్యంబన
భాగవతము బల్కు పరమయోగి
తే నాల్గు మొగములు లేనట్టి నలువయనగ
హస్తములు రెండు గలుగు శ్రీహరియనంగ
చిచ్చుకను ఫాలమున లేని శివుడనంగ
పరగువ్యాసమునీంద్రు శ్రీపదము కొలుతు 5

సీ పాపంబులను పెనుపాములపాలిట
ఘనరామనామంబు గరుడ పక్షి
అజ్ఞానమనెడు గాఢాంధకారమునకు
ఒగితారకంబు భానూదయంబు
భవ సముద్రము దాటభద్ర తరండంబు
శ్రీరామనామంబు జీవతతికి
శాశ్వత శాంతికి చక్కని పూబాట
శ్రీరామనామంబు సేవకులకు
తే యెగిజనుల బ్రహ్మానంద భోగమగును
నీదుశుభరామ నామంబు నిర్మలాత్మ!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 6

సీ వేదార్థవిదులను విమలరత్నములతో
తత్వజ్ఞులను కూర్మతతులతోడ
కవిరాజులనియెడి కలమౌక్తి కములతో
గాయకవరశంఖగణము తోడ
సహృదయశాస్త్రజ్ఞ శతపత్ర తతులతో
సాధుసజ్జనఫేన జలముతోడ
మతిమద్వి శేషజ్ఞ మకరమీనములతో
సద్భక్తులను హంససమితితోడ
తే మోదమనెడుతరంగాలమూకలోలి
వెలయువార్ధి వియనెడురే వెలుఁగు తోడఁ
బొంగుచున్నట్టి సత్సభారంగమనెడు
గొప్ప సంద్రమ్మునకు మ్రొక్కులప్పగింతు 7

సీ భద్రాద్రికేగంగ పాదంబులాడవు
పట్టణంబులకేగ పరువులెత్తు
సాకేతమున్ జూడ స్వాంతంబుకోరదు
లండనుచూడగా లాగుచుండు
శ్రీరంగముం జేర తీరిక దొరకదు
అమెరికన్ జేరగావ్యవధికలుగు
పండరి దర్శింప భావంబు పొంగదు
లండను చూడగాలావుపొంగు
తే ఇట్టి దౌర్భాగ్యముననున్న హీనబుద్ధి
కేమిగతి గల్గు నోయుందు ఎఱుగలేను
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 12

సీ సకలజనులు దేశ సంపదలెల్లను
సమముగను భవించ జాలినపుడు
అఖిలమానవులక్ష రాస్యులై దీపంపు
కలికలై దేశాన వెలిగినపుడు
సర్వనరులు మత సామరస్యముకల్గి
దేశమున్ వృద్ధికి తెచ్చినపుడు
అధికారులెల్ల నిస్వార్థులై ఇతరుల
మేలెంచి దేశంబునేలినపుడు
తే పల్లెపల్లెలోపల ప్రతి పట్టణమున
కూడు గుడ్డకు గూడుకు కొఱతలేక
ప్రజలు శాంతితో చల్లగా బ్రతికినపుడె
సార్థకముగ గాంధీయంబు సఫలమగును 13

సీ తుది మొదలెఱుగకే మదిపొంగి వదరెడు
అల్ప బుద్ధుల సంఖ్య అధిక మాయె
మౌఢ్యమతస్వలౌమంకుతనము వారి
కలహంబులం తటకానబడియె
తమకు తామే గొప్ప దలచియుప్పొంగెడు
నీచాధికారులు నిండినారు
పరమపునీతతన్ పైకి నటించెడు
పతితులే పూజ్యులై పరగినారు
తే ఘోటకమువలె ఉపకారిమాటమఱచు
బూటకులెవార్త కెక్కిరి మేటులనగ
కలివిచిత్రంబు కనుమయ్య కమలనయన
భద్రగిరి దక్ష! శ్రీరామభక్తరక్ష! 14

సీ ఎగిరెడు గండడుదిగనుజారక పోడు
పడిన బండడు లేవకుడుగ బోడు
నగుచున్న తిమ్మక్క వగవకుండగ బోదు
వగచెడు దమ్మక్క నగక పోదు
కూడిన పాంథుడు వీడకుండగ బోడు
వీడడు కూడక వీడువాడు
సాగువడెప్పుడో ఆగకుండగబోడు
ఆగువాడిల సాగకాగ బోడు
తే ఉర్విపుట్టు వారలు గిట్టకుండ బోరు
గిట్టువారలు పుట్టక తట్టుకొనరు
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 15

సీ ఆకటి చిచ్చున అడగెడు జీవున
కిడిన పిడికెడన్న మిచ్చుగలిగి
గుడిలోననున్నట్టి కుడువనిదేవుండు
కుడిచినంత ఫలము కూరుచుండు
సాదు పేదల తగుజంట గూర్చగ పెండ్లి
సాయంబు సేసిన న్యాయముగను
ఆలయంబుననున్న ఆ దేవమూర్తుల
కల్యాణఫలముగలు కలుగుచుండు
తే పరగ ప్రత్యక్షదైవాల పద్ధతిగని
ఇచ్చసేవింప అదినీవు మెచ్చినట్లె
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 16

సీ పచ్చని చిగురాకు ప్రభలతో విలసిల్లు
నీరాకచల్లని నీడయగుచు
సౌమనస్య కుసుమ సౌరభ్యములతోడి
నీ ప్రవేశము శాంత నిలయమగుచు
మధురిమ ఫలజాల మధుమాసయుక్తమౌ
భవదాగతము మహాభాగ్యమగుచు
శుక పిక శ్రుతిమంత్ర సురగాన సహితమౌ
తావకాగతి రాగ ధన్యమగుచు
తే ధాత్రి మానవుల్ తమ తమ ధర్మమార్గ
గాములై శాంతి కాములై క్షేమ మెసగ
కలసి వర్ధిల్లుదురు గాక కలిమి చెలిమి
స్వాగతము స్వాగతము రామచంద్ర నీకు 17

సీ వత్సరంబేదివ్య పర్ణదేహమునీకు
ద్వాదశమాసాంగభాసురుడవు
ఆఱుఋతువులునీయంతరంగములోని
షట్చక్ర సంఘమై జానుచుండ
మూడు కాలంబులు ముగ్గొనంబులు కాఁగ
అర్ధమాసాలు నీయడుగు లవగ
వారముల్ ఘడియలు పరివారముల్ కాగ
గంటలు నీవెంట బంటులనగ
తే మూడు వందల అఱువది నాడులలర
మూడులోకాలు మెచ్చంగ పూనిమమ్ము
మూడుపూలాఱుకాయలై మోదమలర
ఏలరావయ్య వత్సరకాలరూప 18

సీ కూటి గింజలలోన గులకరాళ్లను పోసి
లాభాలనుగొను ధన లోభిగణము
విత్తార్జనమునకై విసపుమందులొసంగి
రోగుల ప్రాణాలు త్రాగుజడులు
మోసాన గద్దెక్కి దోసమెంచకమెండు
లంచాల తిండ్ల కాసించు ఖలులు
పిచ్చి క్రూరమృగాల విధముగా చరియించి
సాటి వారిని హింస సల్పు శరులు
తే స్వార్థ పరులును దుర్మార్గ వర్తనులు
పాపభీతి నెంచని భూమి భారజనులు
లేక భూమండలంబు నీరాక చేత
లోక కల్యాణముగ నొప్పుగాక జోక 19

సీ. అక్రమార్జన చేయు అధమాధమునికంటె
చక్కనౌ వీధిలోకుక్కమేలు
అద్దెకుండెడు పెద్ద మిద్దెమేడలకంటె
స్వంతమయినపూరి పాకమేలు
పరులు చేసిన పంచపక్వాన్నముల కంటె
స్వీయమౌ అంబలే శ్రేయమగును
పరతంత్రుడై భోగభాగ్యమొందుటకంటె
స్వాతంత్ర్య జీవన శ్రమమె మేలు
సుందరంబగు వేశ్య పొందు కోరుట కంటె
ఎడ్డెగుడ్డిల్లాలు దొడ్డ సుఖము
తే. ప్రకృతిబద్ధతా శ్వైర్యంబు బడయుకంటె
పరమశుద్ధమౌ నీపాద భక్తిమేలు
ధర్మగుణశీల! సువిశాల తత్వమాల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 20

సీ. పలు రుచుల్ కలసిన పచ్చడ పానకం
బారోగ్య కారణమ్మగును గాదె
బహువిధ ఫలసుమ బంధుర వనములే
చూడ దేశమునకు శోభగాదె
నవరస యుక్తమౌ నాటకకావ్యంబు
ప్రజల ప్రశంసకు పాత్రకాదె
పంచమహాభూత సంచయ స్నేహాన
అంచిత నవసృష్టి యగును గాదె
తే. బహుళమత సంప్రదాయముల్ పరగియున్న
జనగణములైక్యత గలిగి మనిన నెడల
శాంతిపవనముల్ జగమెల్ల సచంరించి
భూమిమండలమే స్వర్గసీమ గాదె 21

సీ. ఇది వసంతంబని మదిపొంగి యోలాడె
పూలపాన్పుల లోనఁ బొరలు చొకతె
ఇది భరింపఁగరాని యెండగండంబని
నేల సోలుచు నేడ్చె నెలఁత యొకతె
ఆమని ఇదియని కామినితో గూడి
యారామములయందునాడె నొకడు
పగ లెల్ల శ్రమియించి సెగల పొగలఁగ్రాఁగి
తగని వగ పొగిలె మిగుల నొకడు
తే. సకల జనములు మధురవసంతసుఖము
పంచుకొంటెనే దేశ సౌభాగ్యమగును
స్వార్థపరులకే పరిమితమైన యెడల
ఆమనియె గ్రీష్మమై తాపధామమగును 22

సీ. వెలలకుఁ బుస్తకమ్ములఁ గొనఁ జాలని
పేద విద్యార్థులవాడు వేల్పు
చదువరులనెడు తుమ్మెదలగములకోలి
మేలాటపట్టైన పూలతోట
విద్యా ఎపాసులన్ విమల సారస పక్షు
లోలలూఁగెడు మేటి పాలకొలను
అనిశమ్ము శారదోపాసనాసక్తుల
పావనమైన తపోవనమ్ము
తే. సకల విజ్ఞాన జిజ్ఞాస సాధకులకు
ఆశ్రయం బిచ్చు వాకిటి యమర తరువు
అరయ గ్రంథాలయమ్మె దేవాలయమ్ము
ఓలివర్ధిల్లు గాత గ్రంథాలయములు 23

సీ న్యాయనిర్ణేతలే అన్యాయపరులైతె
న్యాయమెచ్చటనుండు నరులయందు
న్యాయవాదులచెంత న్యాయంబు లేకుంటె
న్యాయార్థి కెక్కడ న్యాయమబ్బు
అధికారులెల్లరు అవినీతిపరులైతె
ప్రజయే విధంబున బాగుపడును
లంచగొండితనంబు రాజ్యమేలుచు నుంటె
దేశాభివృద్ధి యేతెఱగు జరుగు
తే నరులన్యాయపాలన జూచి నవ్వుచుండె
కలియుగంబున కుక్కలే పలుచచేసి
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 24

సీ మందకావలినుంచ ఒరుగునఁకుక్కలే
దినమొక్క జీవమున్ దినినయట్లు
కాపుకోసము చుట్టుకలయంగ నాటిన
కంప యే చేలను కఱచి నట్లు
గ్రామాధికారులు సీమాధికారులు
మొదలగు స్వార్థప్రమోద ఘతులు
కర్తవ్యమునుమాని కడు పొట్టలంబెంచి
పాపభీతియు లేక ప్రజలపాలి
తె తొక్కుడు పిశాచముల వలె రక్కసులటు
రక్తమాంసంబులనుదిని ఱంకెవేయు
దురితశక్తులున్నంతటి వఱకు నరయ
బాగుపడునట్లు దేశంబు భద్రమగుచు 25

సీ తిన్నఁగాలోకింప దేశాభివృద్ధికి
నలువురన్నయ్యలే నాల్గుదిశలు
పలురకంబులఁ బైరు పంటలు పండించి
ఆఁకలిఁ జల్లార్చునన్నయొకఁడు
జీవనయాత్రలోఁజీఁకటిఁ దొలగించి
వివిధ విద్యలనేర్పువిబుధుఁ డొకఁడు
ప్రాణముల్ తెగియించి రక్షచేయు నొకడు
ఇల్లుకట్టియు నీడనిచ్చునొకడు
తే భుక్తి యుక్తి శక్తులమీఁద భూతకోటి
నిలిచియున్నది కావున నిశ్చయముగ
వీనికిని పాత్రులగువారి వృద్ధి కలుగ
దేశజనమెల్లవర్ధిల్లు తే జమలర 26

సి పంట పొలమ్ముల వ్యవసాయముంటచే
శుంఠల మొకములచూడ రోసి
ఒగి ప్రభుత్వాధ్యాపకోద్యోగమున గూడ
అధముల చేరి మాటాడ వింగి
పొట్టు విద్దెల నెట్లొ పట్టాలు గొన్న ఈ
స్వల్పబుద్ధులతోడ సాగ నలసి
విధి నిర్వహణమున విధిలేక వదలక
కపట నీచులమోము కాంచ విసిగి
తే కలియుగ ప్రపంచమ్మును గాంచ లేక
యుంటి నీ వాదరించెద వంటినమ్మి
ధర్మగుణశీల! సువిశాల తత్వమాల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 27

సీ  సుత్తెపోటుబడక చొక్కంపుపైడైన
భూషణంబులు కాదు పొలుపుమీర
పండిత సుతుడైన ప్రభుని పుత్రుండైన
శిక్షనీయకకారుదక్షతములు
కల్పవృక్షంబయినకడ చేరి కోరక
వాంఛితంబులనీదు వజ్రికైన
ఏదేవుడైనను ఎదనుభజింప
సాక్షాత్కరింపడు సఫలమొంద
తే  యుక్తి పరుడైన నిను సదా భక్తితోడ
రక్తిమాని స్మరింపక ముక్తి గనడు
ధర్మగుణశీల! సువిశాల తత్వమాల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 28

సీ  ప్రతిలత చిగురించి పచ్చనౌ చందాన
ప్రతి జీవితము మేలు పల్లవించి
సురభులు విరబూచి పరిమళించిన చాడ్పు
నరుల చిత్తాబ్జముల్ పరిమళించి
వనులెల్లఫలియించి వర్ధిల్లు భాతిని
జనులెల్లవర్ధిల్లి చల్లగాను
గొంతు గొంతున మత్తకోకిలగానముల్
జిహ్వా జిహ్వాకు రామచిలుక పలుకు
తే  లొలయు గనుప్రతి నవవసంతోదయమ్ము
సకల జీవ కొట్లకు సర్వ జగములందు
సంతసంబును వెదజల్లి సంతతంబు
దైవభక్తి భాగ్యమిడుత ధన్యమగుత 29

సీ॥ సంజీవితో మూర్ఛ సౌమిత్రియెడఁ బాసి
రిపుల పంచుచుఁ జెలరేగునట్లు
సహజ బలంబును సామీరి తెలియుచు
నెగసి సింధువును లంఘించినట్లు
పరకాయుడైన శంకర గురు వర్యుండు
స్మృతి గల్గి తొలిమేనఁ జేరినట్లు
కలసి కట్టుగ చిక్కువలలేపు కొనిపోయి
పావురమ్ములు బైటఁ బడినయట్లు
తే॥ భరత పౌర చైతన్య స్రవంతి పొంగి
స్వార్థ పరనాయకుల పైశాచత్వకపట
పాలనమునంతమొనరించ ప్రజలు కలసి
విప్లవంబున ఐక్యమై వెలుగవలయు 30

సీ॥ ఖగకులంబున జూడ కడు చిన్న పిట్టట్లు
కవిగణంబున చిన్ని కవినినేను
రత్న శిలలయందు రాజిట్లు పలుగట్లు
కవిరత్నముల పేరు కవినినేను
పనసాది రసమహాఫల వర్గమందున
కొండి దయిన మొఱ్ఱపండునేను
కేతకీమందార జాతిపుష్పాదులన్
పూవులన్ కడు చిట్టి పూవునేను
తే॥ నామమాత్రపు కవినేను రామ రామ
కవినినే గాను నిజముగా కవి జనాప్త
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమాల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 31

సీ॥ అన్నంబు పండించు అన్నకే అన్నంబు
కఱవైతె జనరాజ్యవరము కాదు
ఇలుగట్టు వానికే నిలనీడ లేకున్న
అపుడు గాంధీయంబునగున దెట్లు
బట్టలు నేసిన దిట్టకే కట్టగా
వస్త్రంబులేక స్వపాల నెట్లు
అమరచదువునేర్పు నయ్యవ పల్కగ వర
తంత్రుడై యున్న స్వతంత్రమగునె
తే॥ దేశమునకు స్వాతంత్ర్య మేతెంచి యిన్ని
ఏండ్లు దాటె స్వతంత్రత నెఱుగలేని
పేద పౌరుల కనుగప్పి పీఠ మెక్కి
స్వేచ్ఛనాటాడు ఖలులకు చేటుకలుగు 32

సీ॥ సత్యవ్రతంబును చాటినేర్పుచునున్న
భంగపడని పగల్ దొంగ భంగి
దాన గుణఫలముదారతతో తెల్పు
లోకాల ముంచెడిలోభి రీతి
చలనచిత్రములందు సాధ్వీత్వమును దెల్పు
లజ్జమాలినఱంకులాడి వోలె
నీతులు నియమాలు నిత్యవార్తలయందు
ప్రకటించెడు ప్రసార భటులవోలె
తే॥ ప్రజలవంచించి అధికార పదవులొంది
నిజము మఱచియు ఈ నాటి నీచమతులు
తరతరాలకు సంపదల్ తరగకుండ
కూడ బెట్టుచు నరకాన గూలుచుంద్రు 33

సీ. క్రమబద్ధముగను మంత్రంబు నొందనివాని
పరదార సంగంబు జరుపువాని
నితరుల సేవించు హీన వృత్తులవాని
కనగ సదాచారి గానివాని
తన ధర్మములఁ బరధర్మంబులను గల్పి
న్యాయ్యమే యిదియంచు నడుచువాని
వ్రేలెత్తి చూపు చేవేళ నన్యుల దోష
ముల లెక్కఁబెట్టెడు తలఁపు వాని
తే. తాను గట్టిన పూదండ తా ధరించి
తాను దీసిన గంధమున్ తానె యలఁదు
కొనెఁడు గుణహీను డాంబికుఁ గుమతి నెపుడు
వదలఁగోరును సంపద మదిని రోసి 34

సీ. జింక కన్నులఁ బోలె చెలువుఁ గన్నులదాని
కడుసన్నమౌ కౌను గలుగుదాని
రంగారు నల్లని ముంగురుల్ కలదాని
పొంకంబు గల కనుబొమల దాని
పొసఁగ లోతైనట్టి పొక్కిలి గలదాని
నరయుఁ జక్కని పలువరుస దాని
చూపుల కొప్పైన రూపంబు గలదాని
నయముగాఁదీరైన నడకదాని
తే. తృప్తి ధైర్యంబు గలుగుచుఁ బ్రియముతోడఁ
బలుకుదానిని సౌభాగ్యవతిని సాధ్వి
పరమశీలవతిని పుణ్యవతిని గూడి
వదలకసిరియందుండును ముదము నెపుడు 35

సీ. కనులయందు నలందఁగలుగు శ్రేయోహాని
ముఖము నంటిన ధనమ్ములు క్షయించు
గళ మునందును రాయఁ గలుగు దారిద్ర్యంబు
అతికాలఁ బూసిన నాయువుడుగు
నాసికా రంధ్రంబునందుఁ గరములందుఁ
బూసినవానికి బుద్ధి తఱుగు
చెవులందు మఱి నఱిచేతులందును రాయ
చేటుకు మూలంబు నూటిగాను
తే. కాన చందనాదు లెపుడు మానసమునఁ
బూని యెవడైన నే వేళనైనఁగాని
యలఁదుకొనునట్టి ధర్మంబు దెలసికొనుచు
మెలగు వారికి శ్రీదేవి మేలు కూర్చు 36

సీ. శ్రీ భ్రమరాంబికా శ్రీశైలమల్లీశు
చరణ సారసముల చలువలంది
దివ్యగోదావరీతీరమందిరుఁడైన
కాళేశ్వరుని కటాక్షమునఁ దోఁగి
విమల దాక్షారామ భీమేశ్వరుని దయా
ధర్మపాలనమున ధన్యమౌచు
మంగళ ప్రద మహాలింగ త్రయము పేర
నఖిల ప్రపంచ విఖ్యాతిఁజెంది
భద్రాద్రి పై నీవు భద్రంబుగా వెల్గ
భద్రమై జనులెల్ల వర్ధిలంగ
తే. సర్వగుణ ధర్మ ధన ధాన్య సంపదలకు
సాధు సజ్జనులకు మేలు చదువులకును
సకల కళలకుఁ బురుషార్థసాధకులకు
నిలయమై వెల్గుచుండు మా తెలుఁగుతల్లి 37

సీ. పరమపావనమైన భారతీయూలంబు
సలలితమైన మా తెలుఁగునాడు
అరయ శ్రీశైల శేషాచలాది పవిత్ర
తీర్థభూములకిమ్ము తెలుఁగుకొమ్మ
గోదావరీ కృష్ణమాది జీవనదులు
సతతంబు ప్రవహించు సాధు భూమి
కనకవజ్రాది సత్వనిజధాతుశ్రీల
కునికి పట్టైనదీ తెనుఁగుసీమ
తే. పాడిపంటలతోడ మేల్ వచ్చునగుచు
సకలవిధ సుమ ఫలవనౌషధుల చేత
వెలుఁగుచోలాడు సతము మా తెలుఁగు తల్లి
కడఁగి కొలుచువారల పాలి కల్పవల్లి 38

సీ. నన్నయ్య తిక్కనాద్యున్నత కవులను
గడుపారఁగను శుద్ధ గర్వరేఖ
భక్తులన్నమయాది వాగ్గేయకారుల
రాగాల లాలించు రంజనమ్ము
వేద వేదాంగాది విద్యా విశారద
తతికిఁ బాల్గుడిపిన యతుల తృప్తి
గురు మల్లినాథాది గురు శాస్త్ర పండిత
వరుల నందించిన భవ్య యశము
తే. త్యాగులను యోగులను మహా ధార్మికులను
నయముగాఁ గనిపెంచు నానంద కళలు
వరలఁ బ్రాచ్య సంస్కృతులకు బట్టుఁ గొమ్మ
యైన సౌభాగ్య సహిత మాయాంధ్ర మాత 39

సీ  కలిమికి లలిత సత్కళలకు నిలయమై
  విలసిల్లు నేల మా తెలుఁగు నేల
చెలిమిలో బలిమిలోఁ దొలఁగకుండ నిలువ
  తెలివైనదంట మా తెలుఁగుబంటు
ఇహపర భాగ్య నివహ సాధనములందు
  నలరువెల్గుల తెన్ను తెలుఁగు మతము
అన్ని రంగములందు నారితేరిన  చేయి
  తేజంబుమీర మా తెలుఁగు జాతి
ఆ  తెలుఁగుగడ్డ దొడ్డ తెలుఁగు గుణము దొడ్డ
తెలుఁగు పలుకు జుంటితేనెగడ్డ
తెలుఁగు గడ్డపైని కలిగియుండిన బిడ్డ
తెలివి దొడ్డవాఁడె వెలుఁగు గడ్డ 40

సీ  ముత్యాల సరులుగా ముద్దుకొలుపుచునుండి
  కనువిందు సేయమా తెనుఁగు వ్రాఁత
పలుకులు సరళమై సులభమై రసనకుఁ
  దెనెల నీను మా తెనుఁగు బాస
సంగీత కళకుఁ గ్రీడాంగణమగుచు వీ
  నులకింపొసంగు మా తెలుఁగు పాట
సద్భావ సాహిత్య సరస సంపన్నమై
  మనము రంజిలఁజేయు తెలుఁగుకైత
తే  తల్లి విద్దెకు గారాబుతనయ తెనుఁగు
పిల్ల చదువుల యందెల్ల పేరు తెలుఁగు
కలుగు ధర్మంబులకునికీము తెలుఁగుఁదనము
తెలుఁగు గుణమెన్న నలవె బ్రాఁజిలువకైన 41

సీ కస్తూరి తనయందుఁ గల్గినఁ దద్గంధ
మెఱుఁగఁజాలని మద మృగమురీతి
పులగంబునే ప్రొద్దుఁ గలుపుచుండిన దర్వి
దాని మాధురి నంటలేని భంగి
కడలఁ గ్రుమ్మరు చెప్పు కమల సౌరభ్యమ్ము
పొందెనోచని భేకముల క్రమమ్ము
నిరతంబుతోడున్నఁ బరమాత్మ తత్త్వంబు
కనఁజాలలేని జీవుని విధంబు
ఫణతలంబున తన మణిగాంచ నోచని
దివ్యనాగము భంగి దివ్యముగను
తే నీవు నాలోని నిరతంబు నిండియుండ
తెలియజాలని మందుండ తెలపుతట్టి
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 42

సీ రమణీయతరు శిలారాజి విభ్రాజిత
శృంగాద్రి సింగార శృంగమలర
బొంగి పావన జీవ తుంగభద్రా గంగ
జలజలఁ జల్లఁగ సాగిపాఱ
నతి మనోహర దృశ్యమై యరణ్యమ్ములు
నానాతరు మృగాల జానుచుండఁ
జిత్ర విచిత్రమై చిత్ర వక్షాదిమేల్
పక్షులు చెవులకుఁ బబ్బమిడఁగ
తే నపర నైమిశారణ్య మోయనఁగఁబరగు
శృంగ శైలావనింగాంచి చిత్తమెసఁగ
శారదా పీఠయోగ్య మీ స్థలమటంచు
గురుతరానందమొందె శంకర గురుండు 43

అమర లోకమునుండి యమృత భాండమ్మును
దీక్షతో ఖగరాజు తెచ్చినట్లు
నాఁడు భగీరథ నరపతి సురగంగఁ
దిన్నఁగా ధరణికిదించు సరణి
నందనవనినున్న నవపారిజాతంబు
నందనందనుఁడిల నాటుభంగి
సాధించి సమయాన సంజీవ శైలంబు
ధీరాంజనేయుండు తెచ్చు పగిది

తే వ్యాస భగవదుక్తము మహాభాగవతము
దేవవాణి నుండిన మూలభ వములరఁ
తెలుఁగువారి కందిచెను తేనెఁగలిపి
శాశ్వతంబుగ పోతన సత్క విపుడు 44

సీ ఒక పూటనాఁగలి నొనరంగఁ జేపట్టి
పొలములు గుడ్డముల్ కలయదున్ని
పాటొనర్చుచుఁ బచ్చపైరుపంటలు దీని
న్యాజీవనమును నడుపుచుండి
గంటమ్ము నొకపూటఁ గైకొని కవియౌచు
దాటికమ్ముల దున్ని పాటవముగ
ఘనవంతమగు పద్య రత్నాలు పండించి
కలకాలముగ భక్తి కలువుదీర

తే వెలుఁగ నాంధ్రుల నోముల పంటలనఁగ
భాగవత వీరభద్ర ప్రబంధములను
భక్త సాహిత్య నిధి నిచ్చు భవ్యమతిని
గురుకవి కృశీవలుని మేము మరువఁ గలమె 45

సీ. శ్లేష భావములు సంశ్లేషమై భాసింప
పద సౌకుమార్యంబు పరిఢవిల్ల
అక్షర రమ్యత సాక్షాత్కరింపఁగ
నర్థ గాంభీర్యంబు నావహింప
కమనీయమగు నలంకార సంభరితమై
ప్రతివాక్యమున రసధ్వనులు పొంగ
శిల్ప చిత్రణములు శృంగార రసమొల్క
శయ్యాకథాచారముయ్యలూప
తే. తనరసత్యంబు శివము సుందరమునగుచుఁ
బరమ సంగీతమున కాటపట్టు నగుచుఁ
జక్కఁగా నవరసములు ఎక్కటిలఁగ
భక్తి రసమూరు పోతన్న భవ్య కవిత 46

సీ. భాగవతంబను భాగీరథి మునింగి
యెందఱో పావనమ్మొందుచుండ్రి
భాగవతమ్మను భానూదయము కాఁగ
నెందఱో గమ్యమ్ము నందుకొనిరి
భాగవతోద్యానవనము లోపలనెన్నొ
విద్వద్భ్రమరములు వృద్ధిచెందె
భాగవతం బను బాలకొలంకులో
పరమహంసము లెన్నొ మురియుచుండె
తే. భరతదేశ సంస్కృతికెల్ల బట్టుఁ గొమ్మ
యనెడు భాగవతమ్మును దెనుఁగులోన
పొంకముగ దించి బమ్మెర పోతసుకవి
అర్పణము చేసె రామ! నీకంకితముగ 47

సీ. రాచగద్దియ నెక్కు రాష్ట్రాధిపతియైన
బడిలోన శిక్షణపడిన వాఁడె
జయభేరి మ్రోగించు సైన్యాధిపతియైన
పారశాలను శిక్షపడ్డవాఁడె
కావ్య సృష్టి నొనర్చు ఘన కవీంద్రుండైన
బడిలోని విద్యార్థి బాలకుండె
శశి మండలముపై ధ్వజంబు నిల్పించిన
శాస్త్రజ్ఞులును బారశాల వారె
తే. అవని వేయేల నేరంగమందునైన
వలఁతిగాఁడెంత ఘనుఁడైన వాస్తవంబు
పారశాలా ప్రభావంబు పడకయున్నఁ
బరఁగ సకలార్థశాలయే పారశాల 48

సీ. శిలల రీతి నెఱింగి శిల్పి వివిధములఁ
జిత్రించి శిల్పముల్ చెక్కు భంగి
పంచలోహంబులఁ బనిఁ తీరుకంసాలి
చెలువుగా సొమ్ములు చేయు సరణి
ఓజభూగుణమెంచి బీజముల్ చల్లుచు
లలి పంటలందీయు రైతు భాతి
వైద్యుండు పరికించి వ్యాధికి దగినట్టి
మందుచే నారోగ్యమందఁజేయు
తే. కరణిబాలుర తత్వంబు నెఱిగి గురుఁడు
వారి వారికిందగు విద్య వరుస తోడ
బోధనము చేసనవశక్తిపొంగి పారల
జాతి రత్నాల గావింపఁజాలవలయు 49

సీ సకల వేదంబుల సారసుధారాశి
భగవానుఁ డిచ్చిన పరమగీత
సకల మతమ్ముల సమ్మత తత్వమ్ము
భగవత్ప్రసాదిత పరమగీత
సకల ధర్మంబుల సంబోధ శాస్త్రంబు
భారతాం తర్గత భవ్యగీత
సకలలోక సకలజన పఠనీయంబు
భగవన్ని బోధిత పరమగీత
తే అమరముని జన పూజ్యమై యలరు గీత
భ్రమ వికారంబులను బాపి భవముఁ బాపి
శాశ్వతానంద మిచ్చు నీ సాధు గీత
గీత గుణమెన్నఁ దరమౌనె ధాతకైన 50

సీ పఠన చేసినవానిపాలి చింతామణి
వరభగవద్గీత వాస్తవంబు
మననముండినవాని మందిర సురగోవు
వరభగవద్గీత వాస్తవంబు
ధ్యానించువారికి దగ్గఱి దైవమ్ము
వరభగవద్గీత వాస్తవమ్ము
ఆచరించినవారి కవ్యయభాగ్యంబు
వరభగవద్గీత వాస్తవంబు
తే నమ్ముకొనువాని దాచిన సొమ్ముగీత
గీతఁ జదువని బ్రతుకంత ఘూత రోత
ఇహపర ఫలప్రసాదంబు నిచ్చుగీత
యటి గీతను సేవింతున నవరతము 51

సీ పావన గీతయన్ జీవనగంగలో
స్నానమాడిన పాపజాలముడుగుఁ
బావన గీతయన్ జీవనౌషధ మాత్ర
సేవింప హృద్వ్యాధి శిథిలమగును
బావన గీతయన్ జీవన మంత్రమున్
ధ్యానింపనఱచేతికబ్బు ముక్తి
పావన గీతయన్ జీవనామృతమును
త్రాగిన భవపీడ తరగిపోవు

తే సర్వపుణ్య సంఘసదనరాజము గీత
సకలదేవ ఋషుల స్థలము గీత
అఖిల లోకములకు నాలయంబగు గీత
నిఖిల తీర్థములకు నెలవు గీత 52

సీ గీతార్థ మెఱిఁగియే ధాత బ్రహ్మాండంబు
సృష్టించుఁ జిత్ర విచిత్రముగను
గీతార్థ మెఱిఁగియే కీర్తిగా విష్ణుండు
పాలించు విశ్వంబు భద్రముగను
గీతార్థ మెఱిఁగియే గిరిరాజు నల్లుండు
సంహార మొనరించు జగములెల్ల
మంత్రంబులకు నెల్ల మందిర మీ గీత
మాతలందఱకును మాత గీత

ఆ వె గీతనాశ్రయించి తాతలు ముగురుంద్రు
గీతనుంద్రు మువురు మాతలెపుడు
బ్రహ్మరూపిణియగు పరభగవద్గీత
అట్టి గీతనెంతు నాత్మలోన 53

సీ. మూఁడు కాలంబులే ముఖ్యమై జగతినిఁ
జల్లఁగాఁ బోషింపఁజాలెఁ గాదె
సూర్యేందులిద్దఱే శోభింపజేయ రో
సర్వలోకంబుల శాశ్వతముగ
కుశలవులిద్దఱే శశిసూర్యులను బోలి
జగములందు వెలిగి పొగడబడరె
మూఁడు ధాతుగుణాలు ముఖ్యమై దేహమున్
జక్కగాఁ నడిపింపఁ జాలలేవొ
ఆ.వె. చక్కనైన బాలబాలిక లిద్దఱో
ముగ్గురైన మేలె ముందు నరుడు
ఏమరి మఱియింతకెక్కుడు కన్నచో
ఇడుము కడలిలోనఁ బడును జడుడు 54

సీ. పుట్టిన పిల్లలఁబోషించుటకుఁజింత
ద్రవ్యార్జనముగూర్చి తగులుచింత
ఎదుగుచుండినబిడ్డ చదువుగూర్చొకచింత
అప్పుదీర్పఁగలేక గొప్పచింత
ఈడుమీరెడు పట్టి జోడుగూర్పఁగఁ జింత
ఆరోగ్య భోగభాగ్యాల చింత
నీతి నియమము చింత ఖ్యాతి గౌరవ చింత
అభివృద్ధికిం జింత యనవరతము
తే. కాన బాగుగాలోచించి పూనవలయు
మిత సుసంతాన దీక్ష సమ్మతమునొంది
ధరణి గతజల సేతుబంధనముపోలె
మెలఁగఁబోకుండ మనుజుండు మేలుకొనుచు 55

సీ. త్రోవ మేసెడి గోవుఁ గొలఁగించుమాత్రాన
జనకర్షియొకఁ జాముజముని వెఱపెఁ
గరజలంబునఁ గూలు కపట గోహత్యకే
గగన గంగను దించె గౌతముండు
వ్యాఘ్రముఖమునున్న పాడియావు కుమాఱు
వలచి దిలీపుండు వంచెతలను
అరయంగఁ బంచమహాపాపములకంటె
గోవధ పాపంబు ఘోరమండ్రు
తే. గోవుమహిమలఁ దెలియగఁ గొలఁది కాదు
గోవె మూర్తీభవించిన దేవతాళి
పావనంబగు గోమాత భక్తితోఁడ
గొలువ యిహపర సౌభాగ్యఫలము గలుగు 56

సీ. గోవులోనఁ గలవు పావన గంగలు
గోవులోనఁ గలవు కోటి నిధులు
గోవులోన గలవు కులపర్వతములెల్ల
గోవులోనే సప్త జీవనధులు
గోవులోనె కలదు దేవతా గణమెల్ల
గోవులోఁ గలవెల్లఁ బావనములు
గోవునందుఁ గలరు కోరిముమ్మూర్తులు
గోవునందె కలరు మూవురమలు
తే. కలరు గోవులో నష్ట దిక్పాలకులును
గగనఁ సూర్య చంద్రాది నక్షత్రతతులు
గోవులోననె కొలువుండెఁ గోటియేల
గోవు సేవించు వారికే కొఱఁత లేదు 57

సీ తియ్యవిల్తుని మేటి తేరికిఁగట్టిన
యెలపచ్చముద్దురా చిలుక యనఁగ
మచ్చికొందు ప్రకృతి మాతచేత నెగురు
పచ్చాకురంగు మేల్బంతి యనఁగ
పచ్చని కాంతులఁ బలుదెసల్ నింపిన
వరహరిణ్మణి దివ్యగిరియనంగ
ధాన్యలక్ష్మి పదద్వయముక్రింద వెలుంగు
ఆకుపచ్చని పట్టుకోకయనఁగ
తే వఱలి యీవానకాలాన వసుధ శుచిగ
స్నానములుచేసి మిన్నేటి జలముతోడ
సస్యశాద్వలకోమల శ్యామలాంబ
రముల ధరియించి మెఱసెఁబో రమ్యముగను 58

సీ తడిచిన యొడలితో వడవడ వణఁకెడు
పాలేరువారు కై కూలివారు
డొక్కనిండుగఁ దిండి చిక్క పొక్కుచు
దుక్కులు పొలములు దున్నువారు
నీరూర్చుచున్నట్టి పూరిపాకలలోనఁ
గాలంబు గడిపెడు కార్మికులును
కొట్టంబులందునఁ గూలు బక్కెద్దుల
మేపఁజాలని పేదకాపువారు
తే కంటినిండ నిద్దుర లేక కడుపునిండఁ
గూడులేక మైనిండుగ గుడ్డలేక
పుడమితల్లికై బ్రతుకులు ముడుపుగట్టు
పేదరైతు మురియుకున్న లేదు ప్రగతి 59

సీ జీవ లోకాల సృష్టించిన పంమేష్ఠి
తామర పువ్వులోఁ దగవసించు
విశ్వ పాలకుఁడైన వెన్నుండు సతతంబు
మందార వనమున మసలుచుండు
లయకారకుండు త్రినయనుండు నావెండి
కొండ గోఁగులఁ బాంయుండలేడు
భువన నాటక సూత్రమూలంబుగలదేవి
యాకదంబాటవి నలరుచుండు
తే స్వర్గనాథుండు గగనాన శాంతికొఱకు
నందనంబును నాటించె సుందరముగ
వనులు లేకున్న నీ జనావాళుల కెచట
శాంతి లభియించు నీ ధరాస్థలములందు 60

సీ మా అష్ట దిక్కరులపై నలరారు భూదేవి
కుటిల సుందరమైన కుంతలములో
ఆదిశేషాహా ఫణాగ్ర పీరి వెలుంగు
మణికాంతి కిరణ సమూహ మగునో
ఓలి ధరాంగన యొడలిపైఁ దాల్చిన
పొలుపారు నవరత్న భూషణములో
వెలయు వసుంధర వీఁకతోఁ గట్టిన
కొమరు వన్నెలపైఁడి కోకలగునో
ప్రకృతి సుందరిచేత భాసిల్లు బంతిపై
రమణీయ చిత్రవర్ణంబులొక్కొ
తలఁప పుడమితల్లి తొలి చూలికానుపై
ల సించు కాంతార లక్ష్మి యగునో

సతతమ్ము నితరోపకృత నిమిత్తమ్మున
మూర్తీభవించిన మునికులమ్మొ
మోక్షార్థ సాధక ముని ఋషి యోగీశ
తాపసేంద్రుల రాజధానులేమొ
భూతసృష్టికి ధాత మూల బీజములుగాఁ
జల్లు సారంపు టౌషధుల పైరొ
దైవరచన కళావైవిధ్య వైచిత్రి
తులలేని దనమచ్చు తునకలేమొ
మాయాకలిత సృష్టితోయరాశి జెలంగు
తీరైన పగడాల తీగలేమొ
తే వలసపోయిన ధర్మదైవతము మురిసి
తాండవించుచుండిన మేలుతావులగునొ
ఏమివర్ణింతు నీవసనీమగరిమ
కుంభినీమాత సొగసుల కుప్పలివియ 61

సీ భాసిల్లునే వృక్షపంక్తులు లేకున్న
సర్వోన్నతంబైన పర్వతములు
శోభించునేపద్మ సుమసంతతులు లేక
యమలాంబుపూర జలాలయములు
రాజిల్లునే మహారణ్యముల్ లేకున్న
కాశ్మీర సమమైన క్ష్మాతలంబు
రాణించునే ముదారామముల్ లేకున్న
జగములోఁ బేరైన నగరములును
తే గుళ్ళయందు గృహములందు నూళ్ళయందు
రమ్యతీర్థమ్ములందు క్షేత్రమ్ములందు
పూజ్యమయ్యు పనులులేని భూములెల్ల
దీప్తినొందవు నిక్క మేదేశమందు 62

సీ॥ ఫల పుష్ప పత్ర ప్రభావంబుచే గాలి
విమల జీవన శక్తి నమరి వీచు
మట్టిలోఁ గల వేర్ల మహిమచే జలములు
పూతౌషధ గుణము పొసఁగి పాఱు
దారు శాఖల మూలకారణంబున వహ్ని
పరమ పవిత్రమై ప్రజ్వరిల్లు
పవన పావక శుభ్ర బలముచే గగనంబు
నిర్మలంబుగ వెల్గు శర్మదమున
వనులుండు పరిసర ప్రాంత భూ ఖండముల్
బలు సారవంతమై పసిఁడి పండు
తే॥ దిన దినంబడుగడుగున మనుజవనము
పంచ భూతాల కలుషఁ బఱుపుచుండ
వాని శుచి హేతువై మహా కాననములె
లోకముల సుఖంబున నుంచు శ్రీకరముగ 63

సీ॥ కపట గరళ పూరఖల నర సర్పాల
కంటె కాల ఫణుల కడను మేలు
స్వార్థ మానవ పాప జంతు సంఘము కంటె
క్రూరమృగాళులే గొప్ప జాతము
సాధు సంకట మూర్ఖ జన పిశాచుల కంటె
సహజాటవీ పిశాచములు లెస్స
పర పీడనోజ్జీవ పురకంటకుల కంటె
అడవి మనుజులె బాగటంచు నెంచి
తే॥ తత్త్వవిదులైన ఋషులను త్యాగయోగు
లాత్మ విసిగియు పురగంధ మంటకుండ
కొండగోఁగులందునఁ జేరియుండి రనిన
ఎన్య చూ దన్యమింక వేఱ పలుకనేల 64

సీ. పంచ పక్వంబుల రంచించుకమ్మని
ఫల కంద మకరంద పంక్తు లొకట
అఖిలాంగరాగంబుల ధమంబు లచిపించు
కమ్మని చల్వలే గాలు లొకట
నగర శోభనలక్ష్మి నలుపు గావించెడు
లలిత శోభిత వృక్ష కులము లొకట
కవి గాయకులఁబోలెఁ గర్ణోత్సవము సేయు
కలకంఠ శుకపిక గణము లొకట
తే. పశువులను దూలు పచ్చిక బయలు లొకట
తరులు గిరులు ఝరుల్ కరుల్ హరులు సిరులు
వరఁగుచుండి యరణ్యముల్ ధరణి నపర
నందనము లయ్యె నూతనానంద మెసఁగ 65

సీ. బమ్మి తిమ్మినొనర్చి తిమ్మి బమ్మినిఁ జేసి
ఒయ్యన నిను జేరు నొక వకీలు
పరుల కొంపలు దీసి యెరుగకుండఁగ నిన్ను
వీడక దర్శించు లీడరొకఁడు
అబ్బిన లంచంబు నందులో నీ కింత
ఫీసు చెల్లించు నాఫీసరొకఁడు
నల్ల వ్యాపారాలు చల్లఁగా సాగగా
శరణమే నీవను స్మగ్లరొకఁడు
కటికయై యొరులిండ్లఁ గన్నాలు పడవెస
చేరును నీ కొండ చోరుఁ డొకఁడు
తే. దోషములు చేయుటకు వేయువేషములకు
లోపమిసుమంత లేదయ్య లోకరక్ష
కోరఁదగని కోరికలలోఁ జేరి నిన్ను
బేరమాడు భక్తుల సంఖ్య మీఱిపోయె 66

సీ॥ రత్నగర్భాంగాన రాజిల్లుచుండిన
నవరత్న పరభూషణాళులనఁగ
సుందరమైన వసుంధర తనువుపై
నిగ్గులీను వసిఁడి మొగ్గలనఁగ
పుడమితల్లి యొడలు పులకింప విరివిగాఁ
బండిన వజ్రాల పంటలనఁగ
భూలోకమనుమింటఁ బొలుపొందఁ దోచిన
చక్కనికాంతుల చుక్కలనఁగ

తే॥ దివ్యదీపాళి మెఱయంగ దేహమెల్ల
గ్రాలి భూలక్ష్మి యాకాశ లక్ష్మితోడ
పందెమిడ నుండి చింతచే కుందుచుండె
నరమురు నరకాసురులొాగిఁ బెరుగుకతన 67

సీ॥ దీపంబు లెన్నియో దీపించుచున్నను
వ్యాపించి చీఁకట్లు ప్రబలమయ్యె
అక్రమ తిమిరమ్ము లవినీతి తిమిరముల్
హింసాంధకారంబు హెచ్చుచుండె
జారచోరభయద ఘోరాంధకారముల్
స్వార్థ కపట తిమిర జాల మెదిగె
కోప పాపంబుల తాపాల చీఁకట్లు
కలహాల చీకఁట్లు క్రమ్ముకొనెను

తే॥ ఇంట నింటను దెస దెస నెదురు లేక
కంటి మంటగా దేశాల కంటకముగ
నెన్ని దీపికల్ వెలిగిన నేమి ఫలము
అన్ని తామస చిహ్నాలె యవనిఁజూడ 68

సీ జలముచే దీపాలు వెలిఁగించు నరజాతి
వెలిగింపఁ జాలదా? చెలిమి జ్యోతి
గగనాన పయనంబు గావించు మనుజుండు
నైతిక మార్గాన నడువలేడ?
చంద్రమండలమేఁగఁ జాలిన మానిసి
శాంతి మండలమేఁగ జాలఁడేల?
తగ దూర దృశ్యముల్ దర్శించు మానవుల్
సమ దర్శనము సేయఁ జాలరేల?
తే అంగడిని అన్నియున్నవి యతని కింక
శనియె నోటున్న దన్నట్టి సామెతాయె
భౌతిక జ్ఞానమున నెంత ప్రగతిఁగన్న
శాంతి సహన సాధన నుండి జారెనరుఁడు 69

సీ ఒక కొమ్మపై నిల్చు బక కాక సంఘముల్
పక పక నవ్వె నీ ప్రజలఁ జూచి
చెలిమితో నొక దొడ్డి జీవించు పశువులే
కలఁత నొందె మనుజ కలహములకు
ఒక వనాన బ్రతుకు నొగి క్రూర మృగములే
జన హింసలను జూచి జాలి నొందె
ఒక సరస్సున నుండి యొప్పు జలచరాలు
నరమత్సరముల కబ్బురము చెందె
తే జ్ఞాని కాగల మానవ జన్మమెత్తి
సాటి వారినిఁ బీడించి స్వార్థజనుఁడు
లేశమైనఁ బాపపు భీతిలేక బ్రతుకు
నరయవేమయ్య యీవింత తిరుమలేశ! 70

సీ వరుల కట్నాలీయ భరియింపఁజాలక
యురులలోఁ బాసిన యుసురులెన్నొ
వ్యాపార వరదాన వైవాహికమ్ముల
నేపురాణమ్ములు చూపుచుండె
కులమత భేదాల కుమ్ములాటలలోన
బలియగుచున్నటి ప్రాణులెన్ని
హింసాయుతంబైన యీ మతకలహాల
నే మతశాస్త్రంబు లెసఁగఁ దెల్పె
తే స్వల్పబుద్ధిచే మూర్ఖులు స్వార్థులగుచు
పరుల బాగోగులెంచక పాడి గనక
మానవత్వంబు నెల్లను మంటఁ గలిపి
చెఱచెదరు దేశమున్ వారు చెడుచునుంద్రు 71

సీ ఎదుటనుండిన ప్రాణియేద్వ శునకమైన
సహియింపఁజాలక సహకరించు
ఎదుటివానేడ్పించి ముదముచే స్వయముగా
నవ్వుచుండును హీన నరుఁడు చూడ
ఇతరోపకృతికంటె హెచ్చు పుణ్యములేదు
పరపీడకంటెఁ బాపంబులేదు
అనుచు మానవునకు న్యాయమున్ వేదాలు
ప్రభువులై శాసించి పలుకకుండె
తే మిత్రులై పురాణమ్ములు మేలు ధర్మ
బోధ గావించి కావించి బాధఁజెందె
మధురకావ్యాలు నీతిని మాట మాట
తెలిపి తెలిపియు వేసారి తలలు వంచె 72

సీ మంగళజ్యోతులు మైత్రి దీపమ్ములు
సుందరదీపికల్ శోభిలంగ
సంతోషకాంతులు సత్యదీపమ్ములు
శాంతి కిరణములు కాంతిమీఱ
ధర్మదీపమ్ములు ధైర్యదీపమ్ములు
విజ్ఞానదీపాలు వెలుఁగులీన
సమభావ దీపాలు సహన దీపమ్ములు
క్రమశీలదీపాలు క్రాలుచుండ
ఆ అనవరతము వెలుఁగ నానందదీపాలు
సకలజనుల యందు జగమునందు
చంద్రదీపమైన చల్లని నీ చూపు
వెలుగుఁజిలికి యేలు వేంకటేశ! 73

సీ చల్లఁగా నామని పిల్లతెమ్మెరసోక
బీళ్ళలో మ్రోళ్ళు చిగుళ్ళువేసె
ఉల్లంబు లెల్లను బల్లవించెను నూత
నోల్లాసములు చొచ్చి చల్లసేయ
కొమ్మకొమ్మను జేరి కోకిలలుప్పొంగి
పంచమస్వరముతోఁ బాడఁదొడగె
కమ్మని పూదేనె కడుపునిండుగఁ గ్రోలి
జుమ్ముజుమ్మని మ్రోసె తుమ్మెదలును
తే చెవులకింపుగాఁ బలికె రాచిలుకదండు
పుడమిచేడియ వేడుక పొడమనెడఁద
తీరుతీరు వన్నెలనెన్నొ దిద్దుకొనియె
బలిర యీ మధు మాస ప్రభావమేమొ 74

సీ. కొలఁకులందునఁ గూడి కొదమరాయంచ గు
  పుఱ్ఱుఁతలూగుచు నోలలాడె
ధర చకోరావళి తపములు ఫలియించె
  వనములు ఫల పుష్పభరితమయ్యె
అఱియ జ్యోతిశ్చ క్రమాకాశపథమున
  మెఱసె నల్లని మబ్బు తెరలు లేక
సమశీతలంబున సౌఖ్యదాయి యగుచు
  వాతావరణ మతి ప్రీత దోచె
తె. వింత వింతలొచు బ్రకృతి వివిధరీతి
నవ్య శోభనాలంకృతుల్ నాట్యమాడ
పుష్పవతియయ్యెఁ గనువిందుఁ బొసఁగ జేసి
సృష్టి కళ్యాణ హేతువు స్పష్టపడఁగ ౧౨

సీ. ఎండుటాకులనెడు ప్రాఁతవల్వలువీడి
  చిగురాకుఁ గోకలఁ దగధరించి
కోమల సుమజాల దామముల్ తలఁజుట్టి
  సొగసుగా ఫలములన్నగలు వెట్టి
వసతోడి తరుణింపుఁ బరిమళంబుల లంది
  ఒయ్యారములు నోలి నొలుకుచుండఁ
గడఁగి సీతారామ కల్యాణమును జూడ
  సింగారములఁ దాల్చి సిద్ధమైన
తే. తరులతాసుందరాంగులు సిరులుమెఱయ
నందచందాలతో నిండి యడవులెల్ల
నేత్రపర్వంబొసంగె నీ చైత్రమందు
కంపుకొంపల నగరాల కాలదన్ని ౧౩

సీ చైత్రభానూదయ సమయమ్ము రాగానె
చలిమంచు జడివాన సడలిపోయె
అమృత ప్రభంజన మావరించిన యంత
విసపుగాడ్పుల వస విరిగియొరిగె
కడలి పెన్వరదల గండంబు లెడఁబాసె
బడుగు జనంబుల బాధలడఁగె
మండుటెండలలోన మసలాటవికులకు
నిలను జల్లనినీడ నిలువదొరికె
తే స్వాగతము స్వాగతమ్మను స్వాగతంబు
నవ వసంతాని కిపుడు మానవుల బ్రతుకు
నంతసమ్మునఁ దేల్చఁగా సామ్యదృష్టి
చల్లనగు ఋతుపత కిదే స్వాగతమ్ము 77

సీ కడఁగి బ్రహ్మాండాల గడగడలాడించు
భీకరమ్మొకవంకఁ బేరుకొనఁగ
చంటిపాపలనైన సంతోషపఱచెడు
వాత్సల్య మొకవైపు పరువులెత్త
ఒకచేత దుష్టాత్మ నికరంబు శిక్షించు
నుగ్ర రసా వేశ మొలుకుచుండ
ఒకచేత శిష్టుల నొడిసి రక్షించెడి
యుభయ ప్రసన్నత్వమలుగువాఱ
తే సర్వ జంగమ స్థావర జగములందు
పొందుగా నిండు సచ్చిదానందమూర్తి
నాఁడు ప్రహ్లాదునేలఁ గనర హరివయి
అవతరించితి స్తంభాన నవనిఁ బ్రోవ 78

సీ కలుషితాహంకార కనక కశిపుఁ బట్ట
వాడి గోళుల తోడ వ్రచ్చి వేసి
పరమ భక్త యనెడు ప్రహ్లాదుఁ జేపట్టి
నిరతంబు వర్ధిల్లఁ గరుణ నేలి
అజ్ఞాన మనెడు గాఢాంధ కారంబును
చిత్ప్రకాశముతోడఁ జీల్చి కుల్చి
శుద్ధ బుద్ధి జ్యోతి సుందరంబుగ వెల్గ
వాత్సల్య తైలంబు వరుసఁ బోస
తే ఆత్మ యనెడు శ్రీదేవి నీ యండనుండ
అనవరతము నా భావాంతరంగమందు
నిలిచి జన్మంబు తరియింపఁ బలుపుమయ్య
క్రూరజన శిక్ష! శ్రిత రక్ష! నారసింహ! 79

సీ అష్టకష్టంబుల యష్ట భోగంబుల
యనుభవ జ్ఞానంబు నమరవలయు
ప్రకృతి తత్వమునెల్లఁ బ్రాజ్ఞుఁడై సూక్ష్మతా
దృష్టిచేఁ వీక్షించి తెలియవలయు
పరమార్థమర్మంబు ప్రాపంచికపు నీతి
గురుకుల వాసియై యెఱుగవలయు
వేదశాస్త్రపురాణ విధమెల్ల గ్రహియించి
లక్షణంబుగ గైఁత వ్రాయవలయు
తే తొందఱను మాని స్వార్థమ్ముఁ ద్రోసిపుచ్చి
దేశకాల పాత్రంబుల తెన్ను దెలిసి
లోకహితకవితను వ్రాయు పాకబుద్ధి
మంతులేకపుల్ నావంట మతులుగాదు 80

సీ మండు వేసవి యెండ నుండి దప్పిలు వాడు
 వినుమబ్బు నీటికి వేచు సరణి
గొప్ప యెద్దడి వేళ క్షుద్బాధ గొనెడు వా
 డిల పుట్టు పైరు కాశించు సరణి
పులివాత బడిన క్రే పులుకుచు నింటున్న
 ఏలిక శరణ మాసించు నరణి
శుష్క హ్రదము నుండి శోచించు మత్స్యంబు
 స్రోతస్వని కెదిరి చూచు సరణి
తే అయెనా గతి నిను నమ్మ అవనిలోన
ఎటుల జరుగునో ఇకముందు ఎఱుగలేను
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 81

సీ ఏమి చిత్రమొ కాని ఈ విశ్వమున కెల్ల
 తిలకింప నెవ్వరు దిక్కులేరొ
మంచి చెడ్డల గాంచి ఎంచి విమర్శించి
 చక్కబెట్ట నెవడు స్వామి లేడొ
పశువులన్ పశువులే పాలించు కొనునట్లు
 జగమంత కలుషమై సందడించె
ధర్మాత్ములందఱు దరిలేక కరినుడౌ
 కలిపూరుషునికేల నలగుచుండ
తే కరుణ లేశంబు చూపడు కలడొలేడొ
అనుచు నాత్మసంశయ మొందెనంద రేల
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 82

సీ. దేవుడే లేడంచు తిరిగి నాస్తికులాడు
మాటలే నేటికి పాటియయ్యె
ప్రత్యక్ష విశ్వమే సత్యమన్ చార్వాక
వాదమే నేటికి వేదమయ్యె
భౌతిక భోగాలె పరమార్థమని చాటు
శరగురు లింతకు ఒయము గొనిరి
తమకు తామే గొప్పదై వాలమనుకొను
జడుల విశ్వాసమ్ము సత్యమయ్యె
తే. మూగ దయ్యంబువలెనీవు మూలనుండి
ఏమి తెలుపవు ననుమోసగింప దగునె
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 83

సీ. ఈనాడుగాకున్న ఏనాటికైనను
ఆర్తరక్షకుడు నన్నాదరాడ
ఒక వేళగాకున్న ఒకవేళనైనను
కరుణామయుని కృప కలుగబోద
అనుచు నే నీ పైని నాధార పడియుంటి
ఆత్మవిశ్వాసంబు నధిక భక్తి
కలనైన ఈ మధ్య కంటికి పొడసూప
కుంటివి నీకిది ఉచిత మగునె
ఎప్పటికింతేన! ఇలలోన మాగతి
చెప్పవెందుకటయ్య శీఘ్రముగను
తే. ఆశపెట్టియు దాగి నిరాశకలుగ
నేసివేయగ నీకిది చెల్లదయ్య
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 84

సీ॥ విందగల్గియు ముగ్ధ పొందకుండిన వాడె
వసుధలో వాస్తవ బ్రహ్మచారి
తినగల్గి భోజ్యముల్ తినక మానిన వాడె
యోగి సమ్మత నిశ్చయోపవాసి
కొట్ట గల్గియు శత్రుగొట్టకుండిన వాడె
సహజ దయాళువు సత్యమతడె
అనుభవింపగ గల్గి అనుభవింపనివాడె
సుజన సమ్మతమైన నిజ విరాగి
తే॥ మాట లాడగ గల్గియు మాటలాడ
కుండువాడయ్య నిజమైన మౌని వరుడు
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 85

సీ॥ తనయుండు చెడిపోవ తండ్రిని గాకున్న
అపకీర్తి యెవ్వని యందు జేరు
ఛాత్రుండు శుంఠైన స్వగురువునకు గాక
నిందయెవ్వని నొందునీవె తెలుపు
సేనపిఱికిదైన సేనానికే గాక
నలుపెవ్వనికి చూడు నిలచి క్షణము
ప్రజనష్టమైనచో ప్రభువును గాకున్న
అపవాదమెవ్వని యందుజేరు
తే॥ కొంచమోపికతో విచారించి చూడు
నేను బాగైన నోగైన నీదె కీర్తి
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 86

సీ పగతుర నెప్పుడ బలులను కొన ముప్పు
హీనుల తప్పు సైరింప ముప్పు
సజ్జనుల్ వినుగొంద సంచరించుట ముప్పు
సహన శీలము లేక చాల ముప్పు
శక్తి మించిన దాని సల్పుచుండుట ముప్పు
తెలివి మాలిన మాట తెచ్చు ముప్పు
తారతమ్యము లేక ధర చరించుట ముప్పు
తనకు తానే గొప్ప దలప ముప్పు
తే తప్పు దారిలో నడచుట ముప్పు ముప్పు
క్రూరతన్ నిన్ను వీడిన గొప్ప ముప్పు
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 87

సీ ఈ ద్రోహికీ శిక్ష నీ యనర్హుండంచు
నిర్ణయించునుగాని నీతివిదుడు
దానిలోలేశంబు తన చేత జరిగిన
తాపమొందుచు తానె తల్లడిల్లు
ఇతరుల మనము నొప్పించు నంతటికంటె
విమలాత్మునకు శిక్ష వేఱెలేదు
పరభూతముల దుఃఖ మరయు చుండుటకంటె
సదయాత్మునకు దుఃఖ మరయ లేదు
తే జీవులకు నిన్ను దర్శింప జేయుకంటె
దేవసేవయేది మహాను భావులకును
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 88

సీ నీ ఫల పుష్పాలె నీకు సమర్పించి
నాపూలు పండ్లందు న్యాయమేమి
నీవిచ్చు బోనమే నీకు నివేదించి
నా నివేదన యన్న నవ్వుగాదె
నీవిచ్చు వాక్కుచే నిన్ను వర్ణించుచు
నా కవిత్వంబన్న నయ మదేమొ
నీవిచ్చు కరములనిన్ను సేవింపుచు
నేను గొల్చితినన్న నేర్పదేమొ
తే నీవు సృష్టించు నేనిల నిన్ను మాలి
నేనుగాకయే నేనన్న జ్ఞానమేమి
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 89

సీ ధీమంతుడెవ్వడో శ్రీమంతుడవ్వాడె
యోగరతుడెవడొ భోగివాడె
భావబలుడెవండొ బలవంతుడవ్వాడె
ఆత్మ సౌందర్యుడే అందకాడు
చిత్తశుద్ధి గలుగ శీలజనుడు వాడె
సచ్చరిత్రుండె యశస్వియగును
నియతేంద్రియుండె ఈ నిఖిల జగజ్జేత
కరుణార్ద్ర హృదియె శ్రీకరతపస్వి
తే స్వార్థ రహితుడే సరియైన సత్య శాలి
భక్త నీయందు కలవాడె ముక్తి మాలి
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 90

సీ ఆదికవీశ్వరునాత్మాభిరాముండు
                నిత్యంబు నామదినిలుచుగాత
వ్యాసమహాఋషిశ్వాసతో జపయించు
                మంత్రంబునాశ్వాస మనలుగాక
శుకమౌని దర్శించు సుందరతత్వంబు
                ఏ వేళనేను దర్శింతు గాత
సూతర్షి బోధించు శుద్ధప్రకాశమ్ము
                నిలిచి నాలోసదా వెలుగుగాక

తే ఎందఱో మహర్షులు సదానంద మందు
చుండునీ సేవ నాకందుచుండు గాత
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 91

సీ ఏ వెల్గు పొడసోకి ఈలోకములలోన
                సూర్యచంద్రులు వెల్గుచున్న వారొ
ఏ శక్తి కిరణాల ఈపంచ భూతాలు
                అంచితంబుగ సంచరించుచుండె
ఏ జ్ఞానబలముచే ఎల్ల సృష్టి జ్ఞాన
                వేదశాస్త్రంబులు వెలసె నొక్కొ
ఏ సత్య తత్వాన ఎల్లబ్రహ్మాండాలు
                ధర్మమ్ముతో వృద్ధి తనరు నొక్కొ

తే అట్టి బ్రహ్మ పరంజ్యోతివైన నీవు
భద్ర సన్మంగళాకార భద్రమిడుము
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల! 92

సీ॥ పరుశ వాక్కులుగల బ్రాహ్మణాధముకంటె
సాధుభాషణశూద్ర జనుడుమేలు
సత్వతత్వములేని క్షత్రియాధముకంటె
శాంతంబుగల క్షుద్రజాతిమేలు
భ్రష్టదురాచార వైశ్యశూద్రుల కంటె
సద్గుణాచారపంచములు మేలు
మంచి చెడ్డెఱుగని మాలమాదిగ కంటె
సాధువర్తన మృగజాతిమేలు
ఏ శాపఫలితమో ఏ పాపఫలితమో
కలిమాయ జనులిట్లు కలుషపడిరి

తే॥ జాతికాదు మానవులకు నీతిగాని
కులముకంటెను శ్రేష్ఠంబుగుణకాదె
అన్ని జాతులలోనుత్తమాధములును
కలరు సజ్జనులేబ్రహ్మకులమువారు 93

సీ॥ మ టు కూతలు నోట మొలుగు మానవుకంటె
నిక్కంబుగావీధి కుక్కమేలు
శీలవర్తన లేని చెనటి నరునికంటె
కరమొప్పగా ఊరకాకి మేలు
క్రోధమూర్ఖతగల క్రూరమానవుకంటె
కంచరగాడిద కరముమేలు
సహనంబు లేని దుస్స్వార్థమానవుకంటె
నీచపు జంతులే నిండుమేలు

తే॥ సాత్వికపు భక్తితో నీదుచరణములను
కాంచ లేనట్టి మానవుకంటె చూడ
నీచమగు పశుపక్షులేనిజము మేలు
ధర్మగుణశీల। సువిశాలతత్వమూల।

సీ. బ్రాహ్మణజాతిలో బ్రాహ్మణుల్ కొందఱే
ఎందఱో పతితులు ఎంచి చూడ
క్షత్రియ వర్ణాన క్షత్రియులెక్కడో
ఎందఱో హీనులు ఏరిచూడ
వైశ్యకులంబున వైశ్యులు కొందఱే
ఎందఱో నీచులు ఏరిచూడ
శూద్రవర్ణములందు శూద్రులుకొందఱే
ఎందఱో హీనులు ఈయుగాన

తే. మానవులయందు కొందఱే మానవులును
ఎందఱో నరపశువులు ఏరిచూడ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 95

సీ. సంధ్య వార్చగలేని జంధ్యంబులెందుకో
దొంగ గడ్డలకున్న దుడ్లరీతి
పరగప్రతిభలేని బిరుదంబులెందుకో
బడుగుగేదెలకున్న పిడుదులట్లు
సద్వివేకములేని చదువులుఎందుకో
ఖరము వీపున నున్న గంధమట్లు
ధర్మార్జితముగాని ధనసంపదెందుకో
స్వార్థపిశాచ భూషణములట్లు

తే. భక్తులెందుకో నీమీద భక్తిలేని
వేషముల్ వేయు ఊసర వెల్లులట్లు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 96

సీ. ప్రేమతోనే విశ్వసృష్టి యౌచున్నది
ప్రేమతోనే జగము పెరుగుచుండు
ప్రేమించు జీవుడే ప్రేమింపబడుచుండు
ప్రేమయుండినచోట రాముడుండు
ధర్మయుక్తపు ప్రేమ దైవసమానమౌ
స్వైరంపు ప్రేమ పిశాచమగును
ప్రేమయున్న మనమె శ్రీలనొల్కుఘనము
ప్రేమలేని జనుడు ప్రేతసమము

తే. ప్రేమ రూపుండ వనినిన్ను ప్రేమతోడ
నిన్ను సేవింతు ప్రేమింప నన్నునీవు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 97

సీ. కామంబుతో చెడె ఘనరావణబ్రహ్మ
తామసమున ద్రోణ తనయుడు చెడె
లలిలోభమున ధృతరాష్ట్రుండు చెడిపోయె
బలుమోహమున సింహబలుడు చెడెను
బహుమదంబున శిశుపాలుండు నశియించె
మరి సుయోధనుడోడెమత్సరమున
అంతరంగమునున్న అర్వురశత్రుల
అణచిన వానికి అవనిలోన

తే. సాటి లేరయ్య ఎవ్వరు సత్యమిద్ది
శాశ్వతానంద జలధిలో స్నానమాడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 98

సీ మర్యాదగానువాడె మర్యాద సేయును
అవమాన మొర్చువాడవమతించు
తిట్లు తినిన వాడె తిట్టునోరుంచెడ
కొట్లకోర్చే వాడె కొట్టజూచు
ఆనంద పడువాడె ఆనందపఱచును
ఏడ్చుచుండే వాడె ఏడిపించు
చెడిపోవు వాడెపో చెడ చూచునొరులను
బాగు పడెడు వాడె బాగుసేయు

తే పెఱ్ఱికుక్కల నోటిలో విషమెనిండు
పాడియావులో అమృతంబుకూడియుండు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 99

సీ పంచ భూతంబులు ప్రప్రసన్నత నొందె
దిక్కులన్నియుమెండు తేజరిల్లె
గంధర్వులాగి దివ్యగానముల్ సలిపిరి
సకల భూతమ్ములు సంతసిల్లె
సురలు హర్షము చెంది సుమములు గురిసిరి
ముజ్జగంబులు చాలమురిసె మెండె
ధర్మదేవత పొంగి తాండవ మొనరించె
వేద మాతృకయు దీవింపుచుండె

తే బ్రహ్మ విష్ణుశంకర పరబ్రహ్మమనగ
బ్రహ్మవిజ్ఞాన శక్తిచే బ్రహ్మ ఋషియు
తనువు దాల్చిన దివ్యసత్తవమువోలె
ధ్యానభగవానుడవనిలో అవతరింప 100

సీ. తనకు మెప్పైన మాత్రమున దుర్గుణినైన
ఘనత చేయును స్వల్పజనుడు పొగడి
తన కొప్పకుండు నంతటితోనె సద్గుణి
నైన నిందించును హీన జనుడు
ఖాల రత్నంబుల లక్షణంబెఱుగని
మంద మతుల్ స్వార్థమగ్నజనులు
అవివేకుల ధమాధమాధికారులు గల్గ
నెలవులన్ని పతన నిలయములగు
తే. పరుల బుద్ధి పై నాధార పడెడు వారు
చెఱచెదరు లోకముల వారు చెడుచునుండ్రు
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 101

సీ. ధర్మదేవత కలిఘాటికి సూటియై
ఒంటిపాదముమీద కుంటుచుండ
తమతమ మార్గముల్ తప్పి పర్వెత్తెడు
జనులందు తనబాటసాగనపుడు
సర్వధర్మంబుల సంబంధమును ద్రెంచి
స్వీయాత్మధర్మంబుశ్రేయమనుచు
నిన్నాశ్రయయించిన నిజమాత్మధర్మమౌ
అపదధర్మంబున మరినరుడు
తే. గీతలోనీవు సెలవిచ్చు రీతిదెలసి
శరణమనినీదు పదభక్తి సలుపువాడు
ధన్యుడై జన్మతరియించు ధర్మరూప!
భద్రగిరిపాల! శ్రీరామ! భక్తలోల! 102

సీ మనము నింద్రియముల వెనుక నుంచుట ముప్పా
మనము వెంటింద్రియ లునికి యొప్పా
బుద్ధిని మనముతో పోవనిచ్చుట ముప్పా
బుద్ధివెంట మనస్సు పోవుటొప్పా
ఆత్మబుద్ధికి వశమగుటయే పెనుముప్పా
బుద్ధి ఆత్మవశాన పొసగుటొప్పా
సంసారమాత్మలో సంచరించుటముప్పా
సంసృతి నాత్మ సంచార మొప్పా
తే ఫలముల వెనుక జీవుండు బడుట ముప్పా
ఫలములే జీవుని వెనుక బడుట యొప్పా
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 103

సీ నీధర్మ చరితమే నిజము నాకర్షించె
కలిమి బల్మల శక్తి కాదు కాదు
నీ దయాభావమే నిలుపునన్ గరగించె
నీ గౌరవ ఖ్యాతి నిండి కాదు
నీ సుగుణంబులే నీ వైపునన్ లాగె
అసమ సుందరరూపమరయగాదు
నీ సత్యశాంతమే నీ వంక మఱలించె
కాదు నీలో కాధికార మధిప
నీ పితృ భక్తియు నీ ఏక పత్నీవ్ర
తంబె నీ భక్తికి దారి దీసె
తే నీదు వేదాంత తత్వమ్ము నేను వినియు
కరము నిన్ను గొల్చితి గాని కాదు వేఱు
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 104

సీ కారుణ్య భావాన నేరమున్ మన్నింప
బలహీనుడని శంర చులక జూచు
తప్పు లేకున్నను దండించు వారినే
గొప్ప వారని మ్రొక్కి కొలుచుచుంద్రు
శిక్షింపదగినంత శిక్షించి మూర్ఖుల
బుద్ధి వచ్చిన జాలిబూన వలయు
మందచిత్తుని తప్పు మన్నించుటే తప్పు
నిందు మెప్పివాడు నీతి తప్పు

తే మంకు కుక్కకు దూరమే మందనంగ
వాటమును గాంచి క్రూరుల దాటవలయు
భద్రగిరి పాల ! శ్రీరామ ! భక్తలోల !
ధర్మగుణశీల ! వేదాది తత్వమూల ! 105

సీ వస్తువున్ చూచియావల వెలనీయనౌ
వెల జూచి వస్తువున్ వలచవలదు
చీకటి పయనంబు చేయగా దగదెందు
క్షుత్తులేకుండగా కుడువదగదు
తొందర పడి వెన్క ముందు విచారంబు
సేయకే పనినైన చేయ దగదు
యత్నించి దుర్జనున్ త్యజియింపవలెను ప్ర
యత్నించి సన్మైత్రి నందవలయు

తే ఎఱుక లేని త్రోవను నమ్మి ఏగవలదు
మరగినీ ధ్యానమెప్పుడు మఱువ దగదు
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 106

సీ ॥ శ్రుతులకు నానార్థగతుల స్మృతులజేయ
ఋషులకు నెవడిచ్చె దృఢమనీష
ఆగమశాస్త్రాల నవని సృష్టించిన
బుధులకు నెవడిచ్చె బుద్ధి బలము
అద్వైతతత్త్వమ్ము అవనిలో స్థాపించు
గురువుల కెవడిచ్చె పరమశక్తి
ద్వైతమతంబును ధరలోన కల్పించు
ధీరున కెవడిచ్చె సారమతిని
ప్రియమున నలువుర పెండ్లాడి పురుషుండు
సపతుల పోరులో జార్చు క్రమము

తే ॥ వివిధముగమారి ఊసరవల్లిరీతి
మాకు కోట్లాటపెట్ట నమ్మతమె నీకు
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 107

సీ ॥ మల్లియ పూవుపై మనసుండ నది చేర
మొల్ల పూవుల పైకి ఉల్లమేగు
మొల్లపువ్వబ్బిన మొనయక చిత్తంబు
మొగలి పూవులపైని దగులుకొనును
మొగలిపూవందిన మురిసి కూర్చుండక
చెందామరలపైని చేరు మనసు
చెందామరయు చిక్క చెలరేగిడెందంబు
పారిజాతము పైకి పరువులెత్తు

తే ॥ బ్రహ్మ సృష్టిలో గల పుష్ప పంక్తులెల్ల
చిక్కనను వెఱ్ఱి మనమున తిక్క వోదు
ధర్మగుణశీల! సువిశాల తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 108

సీ సద్గ్రంథముల యందు స్వల్ప బుద్ధులు చూచి
తనకు రానివియన్నితప్పులనుచు
తనుమున్గమడుగునే ఘనసాగరంబుని
గొప్పతలంచు పెన్గప్పవోలె
తననాల్కరుచి తప్ప తగుతీపి వస్తువుల్
రోగి చేదనుకొనిరోయునట్లు
తన దృష్టి దోషంబు తానుతెలియలేక
దృష్యలోపంబని తెల్పు భంగి
తే సకలమును తెలఎన యట్లు సత్వరపడి
చులకనొదురు ఒకనాడు వెలితి మతులు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 109

సీ ఆదిశక్తియె తల్లి అధియజ్ఞుడే తండ్రి
ఐదు ప్రాణములె నా సోదరులును
జ్ఞానమే గురువగు మానసమే పత్ని
నాల్గు సాధనములె నాకు సుతులు
సుగుణ సంపత్తియే చుట్టముల్ మిత్రులు
విద్యలే ఐశ్వర్య వితతి నాకు
శాంతియోగమె భుక్తి సత్కర్మ భోగంబు
ప్రజ్ఞయే రాజ్యాధి పదవి నాకు
ఆరోగ్య తేజ కళాకారములె భాగ్య
మవయవంబులె నాకు అనుచరులును
తే దేహమే ఇల్లు నివసింప దేవ దేవ
నీదు పద సేవయే నాకు నిత్య ముక్తి
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 110

శతమఖుంటులు చేసి శుక్రుండు కావచ్చు
సద్భక్తజన్మ మసాధ్య మరయ
అతి తపంబుల నణిమాదు లందగవచ్చు
సద్భక్తజన్మ మసాధ్య మరయ
సకల విద్యలు నేర్చి సత్కవి కావచ్చు
సద్భక్తజన్మ మసాధ్య మరయ
సద్ధర్మ్మడౌచు శాశ్వత కీర్తి గనవచ్చు
సద్భక్తజన్మ మసాధ్య మరయ

తే ఎన్ని సంపదలైన సాధింపవచ్చు
స్వాంత శుద్ధినిన్ గొల్వన సాధ్యమండ్రు
ధర్మగుణశీల! సువిశాల తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 111

సీ ఏడేడు లోకాల నేలంగ వెలసిన
ఏడు కొండలవేంకటేశుడీవు
బదరికాక్షేత్రాన పరంగ నారాయణ
నామంబుతో వెల్గురాముడీవు
శ్రీ రంగమున దివ్య శేషశాయిగవెల్గ
శ్రీరంగనాథుడవ్ శ్రీధరుడవు
నయముగా పురిజగన్నాథనామంబున
రాజిల్లు శ్రీకృష్ణరాముడీవు

తే శ్రీ అయోధ్యలోపల వెల్గి సృష్టినేలు
జానకీరామ మూర్తివి స్వామి నీవు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 112



ఓం

శ్రీ గణేశ్వరాయ నమః
శ్రీ సరస్వతీ మాత్రే నమః
శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమః
శ్రీ సీతా రామ చంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీరామ పంచశతి

## (పంచమకాండము)

శ్రీ క్షీరాంబుధి మధ్య పత్రశయనం శృంగార బాలాకృతిమ్
బ్రహ్మానందసుకేళిలోల విలసత్బ్రహ్మాండ భాండోదరం
నీలాకాశ సమప్రభం సురనుతం నిత్యంసదా శైశవమ్
సత్యం శాశ్వత బాలకంచనిరతం సంభావయేచ్ఛ్రేయసే

శ్రీరామచంద్రాయ। సీతా సమేతాయ।
నారాయణాయ। తేనరవరాయ।
వేదాంతవేద్యాయ। వేదవిద్యార్థాయ।
ధర్మస్వరూపాయ। నిర్మలాయ।
వాల్మీకి వాక్సరో వరజమరందాయ।
బాదరాయణిమనోభాసితాయ।
భరతాగ్రజాయ। సత్భక్త మందారాయ।
కరివర పాలాయ। సురవరాయ।

తే కేవలానందతత్వాయ। పావనాయ।
బంధమోక్షాయ। తేనమోభద్రకాయ।
ఆదిమధ్యాంతరహిత సుధాకరాయ।
సాధువరదాయ। సగుణాయ। శాశ్వతాయ।

సీ. ఓంకార పంజరవరోత్తమంబునగుల్కి
ప్రేమ జిలికెడు శ్రీరామ శుకము
శ్రీంకారమందార శృంగార వనమున
విహరించినటియించు వింతనెమలి
రామాయణామృతరస సాగరంబున
రంజిల్లుకలహంస రాజవరము
రామతారకమంత్ర రమ్యయంత్రంబులో
వ్యాపించి దీపించు అమృతశక్తి
తే. మాత జానకీమానస శ్వేత ఫణిశ
యనమున సుఖించాదినారాయణుడవు
నమ్మి జపియింతు తారకనామ నిను న
మస్క్రియలనాశ్రయించి సమస్తమీవె ౭

సీ. తల్లి గర్భమునుండి తరలి నప్పుడె పండు
భంగిర విగొనబోవు బంటువయ్య
తాపసాటంకుడౌ తలిరువింటి జయించి
యొంటి ఒందెముఁదాల్చు యోగివయ్య
ఆగమస్మృతి నవవ్యాకరణాదులం
దతుల మౌనట్టి పండితుఁడవయ్య
రోమరోమమునందు రామనామామృత
సారంబు నిండిన సాధువయ్య
తే. ఊరనూర నీగుడి లేక యుండదయ్య
వేడుకొనినట్టి భక్తుల వెన్నుఁదట్టి
కోడునీడ వైకాపాడు దొరవటయ్య
రాక్షసాంతకకాయ! వీరాంజనేయ! ౩

సీ	జేజెల మేటికి చేమోడ్పు జేజేలు
		చిన్నారి కన్నయ్య చిన్న పూలు
ఎల్లజగము తేనికె న్నెన్నొటెంకణాల్
		ఎల్లప్పటయ నేరెడల్లులివిగొ
జోగుల జున్నట్టు జోహార్లు జోహార్లు
		తాతతాతా! నీకు జోత జోత
కెంగల్వకంటికి  చెంగనాలివె సంకు
		లచ్చిపెన్మిటికి వేల్గొబ్బులిడుదు

తే	నలుపు కలువ మైవాడ వెన్నెలలు నూర్లు
పెబ్బలకు పెబ్బ వనినన్ను పబ్బతింతు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల!

సీ	గళమున సుతులసీ కౌస్తుభవన మాల
		లలర రావేల కృపాల వాల
వలచియు నీపాలబడిన దాసులనేల
		చలమేల సజ్జన సానుకూల
ఫలముల దళముల జలకుల సుమజాల
		ముల పొంగు గోపాల ముక్తిఖేల
పిలచిన మాత్రాన తలపు తొందర లీల
		అలనాడు కరినేల వఖిల పాల

తే	అలస యుంటి నీ ప్రకృతి నేమందుగోల
కలసి నన్నాదరించు ప్రకాశనీల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 5

సీ. పుణ్యమూర్తుల వాస సుందరతుషారాద్రి
　　　　రాజితంబు నిఖిల పూజితంబు
హిమకూటాశ్రిత పవిత్రాకాశ గంగాప్ర
　　　　వాహ జీవనంబు పావనంబు
నైమిశారణ్యాది నానా మహాతపో
　　　　వనగణంబు సుగుణధన గణంబు
సంస్కార విజ్ఞాన సంభార వేదవి
　　　　భూషణంబు దివిజ భాషణంబు

తే. ధర్మరాముచరిత్రకు తావలంబు
కృష్ణలీలావిలాసంబు కీర్తిదంబు
శర్మనిర్మలకర్మంబు శాంతిదంబు
ధీరరస భారతంబు మాభారతంబు 6

సీ. వేదాల బోధింపు వేదాంత విజ్ఞాన
　　　　సచ్చిదానందాత్మ సారమీవు
దత్తదేవుడు పల్కుతత్త్వావధూత స
　　　　ద్గీత లోపలి పరంజ్యోతివీవు
వాల్మీకి మౌనీంద్ర భణితరామాయణ
　　　　గ్రంథంబులో మహారసము నీవు
వ్యాసమహర్షి సద్భాగవతమ్ములో
　　　　శృంగార భృంగార శీలమీవు

తే. విబుధ శంకర గురుని వివేక తత్త్వ
కృతిని వెలుగొందు అద్వైత పతివి నీవు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 7

సీ ఆకాశమున కంటె అతివిశాలంబాశ
ఎంతగల్గినగాని అంతులేదు
చుక్కల రాసికంటెక్కువ కోరికల్
తీరవెన్నటికింక ఊరుగాని
గాలికంటెను గూడ కడుచంచలము చూడు
తలపేమొకచటుండి నిలువ లేదు
క్షణభంగురమె కాని శాశ్వతంబిక కాదు
తనువునాయువు జూడ ధరణిలోన

తే నీదు దయలేక నేనెట్లు ఈదగలను
జన్మ జలనిధి కావున చల్లుదయను
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 8

సీ దర్శన మాత్రాన తగ భగవద్భక్తి
పొసగింప జేయు నేపూజ్యమూర్తి
స్పర్శన మాత్రాన బలుజడమతినైనఁ
బండితున్ జేయు నేపరమగురుఁడు
బాషణ మాత్రాన బండ డెందమునైనఁ
గ్రొవ్వెన్నఁజేయు నేకోవిదుండు
ఉపదేశ మాత్రాన చపలచిత్తులనైన
దృఢనిష్ఠముంచు నేబుధవరుండు

తే పరమనిష్ఠా గరిష్ఠుండు బ్రహ్మవిదుడు
అతిదయా మయ సద్గురు యతివరుండు
దివ్యతారక మంత్రోప దేశికుండు
నైన శ్రీఅఖండానందు నంఘ్రిగొలుతు 9

సీ॥ నిన్ను నే మఱచిన నీకేమికొఱతగు
నన్ను నీవుమఱువనాకుముప్పు
నినునేను గనకున్న నీకేమి కొదవన్న
ననునీవు గనకున్న నాకుముప్పు
నినుగొల్వకున్న నేఁ నీకేమి తక్కువ
నన్నేలకుంటివా నాకు ముప్పు
నీ స్తోత్రములు సేయ నేనెంతవాడను
ననునీవు మేల్కొల్పనాకు మేలు

తే॥ నేను లేకున్న నీకేమి న్యూనమగును
నీవు లేకుంటెనాకంత నిష్ఫలంబు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 10

సీ॥ సాక్షి స్వరూప నీ సంకల్పమున జేసి
మూలప్రకృతి పుట్టెముందు నొకటి
దాని వలన మహత్తత్వంబు ఆమహ
స్సందు బుద్ధియు బుద్ధి నందు మనము
ఈ నాలుగింటిలో ఎసగె శబ్దస్పర్శ
రూప రసగంధమేపునైదు
గగన వాతానల కమల భూస్థలులను
పంచ మహాభూత సంచయంబు
కనులు చర్మము ముక్కుకర్ణముల్ నాలుక
అనెడు జ్ఞానేంద్రియాలైదు మఱియు

తే॥ వాక్కు కరములు పాయువు పస్థ పదము
లనెడు కర్మేంద్రియంబులు అయిదుకలయ
ఈ యిరువదినాలుగిటితో ఇట్ల మేను
చేసి ఈ జీవునాడింప జేతువీవు 11

సీ. స్వల్పుండు చూపునీ శిల్పాల గనుకంటె
నిన్ను నాలోచూడ నేర్చుకొందు
వెలనిడి గుడిలోని విగ్రహార్చనకంటె
తలపిడి నిను గొల్వ వలచుచుందు
ఒక్కొక్కచోట నిన్నోలి చూచుట కంటె
అంతట నినుగాంచ నారటింతు
అప్పుడప్పుడు నేను ఒప్పనిన్ పూజింప
నిరతసేవావిధి నేర్చుకొందు

తే. కోరికల బేరమున నిన్ను జేరుకంటె
ఆత్మనర్పించి యానందమందుచుందు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 12

సీ. ఆదికవి బ్రహ్మర్షియైన ప్రాచేతసు
న సమానకవ నాభ్రహంసకీర్తి!
పావన వాల్మీకి దేవభాషాసుధా
సాగరవరరామ చంద్రమూర్తి!
సర్వజ్ఞ వాల్మీకి సముదితాదిసుకావ్య
సృష్టికి నాధార శీలవర్తి!
బ్రహ్మర్షి సాహితీ బ్రహ్మాండ భాండమం
దవతరించిన సుధర్మాది మూర్తి!

తే. ఆదికావ్యరామాయణ మహామృతాబ్ధి
మధురముగ పేరు తారక మస్తు పూర్తి!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 13

సీ మాతల్లి గోదాంబప్రీతితో దాల్చుపూ
దండలోపల సుగంధంబదెంతొ
దమ్మక్క పెట్టిన తాటి పండులలోన
కమ్మద నంబెంత కలదొస్వామి
మీరాంబలోనుండి మ్రింగె విషములో
సారామృతంబెంత చేరియుండె
సక్కుబాయింటిలో చక్కగాచేసిన
చాకిరి లోనెంత జోకకలదొ

తే బందియైరామదాసుండు ప్రశ్నలడిగి
తిట్టు తిట్లలోపల ఎంత తీపిగలదొ
నీకెతెలియును సద్భక్తలోకవంద్య
ధర్మగుణధామ! శ్రీపరంధామ! రామ! 14

సీ పచ్చని ఈ చెట్ల పల్లవమ్ముల కొసల్
దైవదిక్సూచులై తాండవించు
చల్లని తరువుల ఛాయలు సౌఖ్యమై
చలిజాల సౌధాల తలనుదన్ను
చక్కని వల్లరీ సౌరభపుష్పాలు
సురభిళింపుచుమనోహరములగును
దివ్య పాదపముల తియ్యని ఫలములు
అమర పానామృత సమముదోచు

తే సుందరంబైన దేవేంద్ర నందనమ్ము
నందుకొనజాలు అందమ్మునందిమిగుల
అందగించె నీభూలోకమందువనులు
డెందమానందసింధువై చిందులేయ 15

సీ	లతలత కొక తీరు అతి విచిత్రమ్ముగా
		విరబూచి పువ్వులు పరిమళించె
	ఒక్కొక్కవృక్షంబు ఒక్కొక్క మధురమౌ
		ఫలదళంబుల తోడ కళలు మించె
	ఒక్కొక్క జంతు వింకొక్క సౌందర్య
		రూపాన దీపించి చూపులాగె
	ఒక్కొక్క ఖగ వరంబొక్కొక్క యింపుగా
		కూయుచు చెవులకు కూర్చెవిందు

తే	కొండ కొండకు ఒక్కొక్క గొప్పతనము
	బండ బండకు నొక్కొక్క బాగు గుణము
	తనరు ఈవన దేవతా దర్శనంబు
	పూర్వపుణ్యంబువనె చూడపొసగునిజము	16

సీ	పదునాలుగేడులే భ్రమియించి రామయ్య
		వన జీవన మెమహాభాగ్యమనెను
	గోవుల వెంటాడె గోపయ్య కాపరై
		కాంతారసంచార కాంక్షచేసి
	దేవతాగణములు దివ్యంబులని మెచ్చి
		పావనారణ్యాల పట్టునుంద్రు
	తాపసుల్ ఋషులును తరియింపగా గోరి
		కాలమడవులందు గడపఁ గాంత్రు

తే	యోగముల సిద్ధి నొనగూర్చు యోగులకును
	రోగముల నెల్ల హరియించు రోగులకును
	శాంతిసౌభాగ్యముల నింపు సాధువులకు
	కాంచవనభూములిలను స్వర్గములుకావె	17

పుళ్ళున్న చోటైన లేళ్ళు వృద్ధినికాంచు
కాంచునా నరులున్న కాననమున
పాములున్న అడవి పక్షులు వర్ధిల్లు
వర్ధిల్లు నా జనుల్ వనమునున్న
కోతులుండిన చోట కొల్లలు ఫలములు
నరజాతికలదేని దొరక లేవు
చీడయున్న వనము వాడకుండ పెరుగు
మనుజులున్న వనము మంటగలయు

తే ఘోర జంతువులుండిన గూడ నయమె
క్రూరమానవులున్నచో ఘోరభయము
మలిన పూరిత ఈ స్వార్ధమానవులను
కాంచి ప్రకృతి మాతయె బిట్టు కలతచెందె 18

స శ్రీకృష్ణునటు బహు స్త్రీల సరసమెంత్రు
గోవర్ధనంబెత్తు గుట్టుగనరు
పరశరామునిబోలి వధియింత్రు తోబుట్ల
తద్రీతి బ్రతికింపతగరు గాని
సత్యభామను జూపి జాడింత్రుమగలను
తద్రీతి పతిగూర్చి త్యాగపడరు
పాంచాలి సతినెంచి వంచింపబడుదురు
శీలమ్మునట్లు రక్షించుకొనరు

తే పద్ధ చారిత్రులందున సూక్ష్మ బుద్ధు
లంత రార్ధంబు తెలియని అధమనరులు
వింతవింతగా భావించి అంతరింత్రు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల! 19

సీ భావం బనెడు మహా భయద రాక్షసి వంచి
దేవతగా చేయు ధీరుడగుచు
భావమర్కటమును పావనిగా మార్చి
తావకాంఘ్రుల నుంచు ధన్యుడగుచు
భావశృంఖలమూని పంచేంద్రియాశ్వాల
బ్రహ్మరధము ద్రోలు ప్రౌఢుడగుచు
భావమీనము బట్టి పరమహంస నొనర్చి
భవసాగరమునీదు భాగ్యుడగుచు

తే భావజీవ స్రవంతీ ప్రవాహమెనయ
దేవ దేవ! నీశ్రీరామ దివ్య భవ్య
తత్వసచ్చిదానందసుధారసాబ్ధి
లీనమైన జ్ఞానికి జన్మలేదు లేదు 20

సీ ఆదిమీనంబువై వేదాలకాపాడి
కూర్మమై కవ్వంపుకొండనెత్తి
యజ్ఞవరాహమై అవనినుద్ధరింయించి
నారసింహుండవై చీరి యసురు
వడుగువై అన్నకు అడిగిచ్చి స్వర్గంబు
పరుశువూని నృపుల నరికి బెరికి
జనకజామాతవై దనుజులదును మాడి
సీరివై శౌరివై క్రూరులణచి

తే బుద్ధమూర్తివై కపటుల శుద్ధిచేసి
కలికలుషముల కడుగగా కల్కిమూర్తి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 21

ం నిర్మలజల పూరనీల మేఘశ్యామ!
శర్మద సత్కర్మ ధర్మధామ!
రవివంశపాథోధిరాకాసుధాసోమ!
కవిదేవ వర్ణితధవలలామ!
పావన మునిలోక భావతారక నామ!
సేవనాంకిత జనజీవ నేమ!
పాపదానవ గర్వపర్వత సుత్రామ!
తాప సాశ్రిత శాంతి దానసీమ!

తే సకల రంగాంతరంగ సుసార్వభౌమ!
ప్రకట సచ్చిదానంద సౌభాగ్య సామ!
భద్రగిరి ధామ! శ్రీరామ! భక్త కామ!
ధర్మగుణ సీమ! శ్రీ పరంధామ! రామ! 22

సీ రామ! రామా! రామ! రామాభిరామ! శ్రీ
రామ! రామారామ! రామ! రామ!
రామ! లోకారామ! రామాత్మరామ ధీ
రామ! రామా రామ రామ రామ!
రామ! దేవా రామ! రామ! భావా రామ!
రామ! జీవా రామ! రామ! రామ!
రామాభి రామ! శ్రీరామ రామా రామ!
రామభూరామాభిరామ రామ!

తే రామరామ సీతారామ రామ రామ!
రామ సర్వాభిరామ శ్రీరామరామ!
ధర్మగుణధామ! శ్రీరామ! దైత్య భీమ!
సాధుజన కామ! జగదేక సార్వభౌమ! 23

సీ॥ పుట్టుకతో బుట్టు చెట్టకు చెడుగులు
ముల్కచెట్టుకు పుట్టుముళ్లవోలె
జ్ఞానికి సుగుణముల్ సహజంబుగా కల్గు
పూవులకును బుట్టుతావివోలె
పాముపిల్లకు పుట్టుపంటి విసమువోలె
బాముతోనే కల్గు పాం కఘము
ఇక్షుదండమునందు నెనయు మాధురి రీతి
సాధువు నందుండు సర్వహితము

తే॥ జన్మజన్మాంతరాల సంస్కారముననె
వారి వారికా తత్త్వముల్ వరుస కలుగు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 24

సీ॥ కుల కులంబుననొక్క దళము సంఘము తేలె
ప్రజలకు నిసుమంత ఫలములేదు
సర్వజనులు నేడు చదువు నేర్చిన గాని
మానవ ధర్మంబు మంటగలసె
పల్లె పల్లెకు న్యాయ పంచాయతులు నున్న
నీతులు నిజములు నీటమునిగె
ప్రజల పాలనమైన స్వార్థులు భ్రష్టులే
పెద్దలై దేశాల పీల్చి తినిరి

తే॥ స్వార్థమే స్వధర్మంబయ్యె జనుల కిపుడు
పాశవిక ధర్మమే కలి ప్రబలమొందె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 25

౦ ఏవేళ నెచ్చోట ఏ ప్రాప్తమున్నదో
ఈ జీవునకు విశ్వభాజనమున
సమ్మానలాభాల సంతస పడుచుంట
అవమాన గండాల వ్యథను గొనుట
భోగభాగ్యములతో పుడమి వర్ధిల్లుట
రోగదైన్యతలతో రోయబడుట
సాధు సద్భక్తుల సాంగత్యమబ్బుట
కుంరజనుల గాలి సోకుచుంట

తే కలుగు సకలమ్ము నీదు సంకల్పముననె
కారణంబు ముమ్మాటికి కాదువేఱు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 26

సీ ధర్మ పథము బట్ట తప్పెచో నా తప్పు
దాని కండ నిడ వాతప్పునీది
సద్భావనము నేను సల్పకుండిన తప్పు
దాని కూత నిడ వాతప్పునీది
సత్కర్మలకు నేను సాగకుండిన తప్పు
తగిలిభిన్నము సేయు తప్పునీది
సద్విద్యలను నేను చదువకుండిన తప్పు
తవిలి విఘ్నముసేయ తప్పునీది

తే ఉల్లమున నేను నిను గోరకుంటె తప్పు
తల్లడింప గాజాడింప తప్పునీది
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 27

సీ కర్కోటకుని కాటు కాలకూటము ఘాటు
యముని శూలపు పోటు యతులతిట్టు
కామధేనువరాలు కరగని స్వర్గాలు
ఋషుల దీవెనలందు వృద్ధిమేలు
జ్ఞానులుండని తావు శాంతిలేని నెలవు
కాకులుండెడి రేవు కంపు తావు
సాధులుండిన చోట సర్వతీర్థములుండు
సకలదేవతలుంద్రు సంతసించి

తే తాపసుల స్వాంతమే నీకు స్థానమండ్రు
మౌనులను గొల్వలే నట్టి మనుజుడేల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 28

సీ పంచ పక్వంబుల పెంచిన దేహంబు
పంచభూతంబులే పంచుకొనును
స్వార్థపిశాచతన్ సంపాదనము చేయు
విత్తంబు రవ్వంత వెంట రాదు
సార్వభౌమత్వంపు గర్వ పర్వంబెల్ల
కాలలాహుగ్ర సించుక్రమముగాను
ఎంత వారలనైన సుంత జాలియులేక
కాలభటుడు పట్టినేల రాయు

తే ఇంతమాత్రానికే జీవుడంతులేని
మోహ జలధిలోబడి నిన్ను ముట్టబోడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 29

సీ దశరథ వరసుత! దశముఖ ఖరహత!
కుశల వశిశుపిత! కుశల చరిత
ఘనశరధర శరఘనభుజ ధరవర!
వనచర వరసుర వరద నిరత!
జలజదళనయన! జలధి ఫణిశయన!
జలజభవ జనక! జలజ వదన!
మునిహృదయ కమల ముకుళసుదినకర!
మనసిజ శతశత మధుర సదన!

తే శ్రితపతిత నత శరణద సతత చరణ!
అతుల గుణగణసురతరు గతివిత రణ!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 30

సీ రసరాజములకెల్ల రసరాజమగుదీవ
మధురంబులకు నెల్లమధురమీవ
సద్గంధములకెల్ల సద్గంధమగు దీవ
శక్తులకెల్ల సుశక్తి నీవ
ఆనందములకు బ్రహ్మానందమగుదీవ
కళలన్నిటికి మహాకళవు నీవ
పావనంబులకెల్ల పావనంబువు నీవ
భాగ్యంబులకు మహద్భాగ్యమీవ

తే త్యాగములకెల్ల సరిలేనిత్యాగమీవ
ముక్తిజాలంబులకు మూలముక్తి నీవ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 31

సీ ఛీఛి ఈ రోగాల చీము నెత్తురు నంజు
బొక్క బోనులలోన చిక్కజేసి
అక్కట ఈ ప్రాణిన ధమ ధర్మందైన
కలిపూరుషుని చేత నలగద్రోస
ఆనంద లేశంబు అందని ఆభాస
సౌఖ్యప్రకృతియందు జారవేసి
కోరి ఏకాంతాన చేరిమెల్లగ నీవు
నిర్మలంబుగ నుంటధర్మమౌనె

తే దీన నీకేమిలాభమో తెలియగాని
జీవునకు మాత్రమిబ్బంది దేవ దేవ!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 32

సీ ప్రకృతి మాతయెప్పుడు పట్టితన్నుచునుండు
దారిదప్పకుమంచు తట్టినెట్టి
గ్రహములుగ్రతనూని కలవరపఱచును
నిగ్రహహీనుని నిలిపి నలిపి
కోర్కులకొండెత్తి కూర్చుండి మనసులో
కాముండు నవ్వుచు కాంచుచుండు
దేహమోహమునందు దాహమేకలదంచు
దేహంబు రోగాల దేలుచుండు

తే ఇంతయైనను జీవుండు సుంతయేని
జ్ఞానమూనినిన్ గాంచగ పూనుకొనడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 33

సీ బ్రహ్మముఖమునుండి ప్రభవించునే దాల
సార ప్రసారంబు జగతినింప
బ్రహ్మయే వాల్మీకి భగవానుడై వేద
రామాయణాదుల వెలయజెసె
బ్రహ్మయే శ్రీవ్యాసభగవానుడై వేద
విభజనగావించి విశదముగను
భారతాదుల మహాభాగవతబ్రహ్మ
సూత్రాల రచియించి చూపెదారి

తే అట్టిబ్రహ్మదేవుడె కలి నవతరించి
ఆదిశంక రాచార్యుడై అఖిల జగతి
దుర్మతంబుల ఖండించి ధర్మమెంచి
సన్మతంబుల స్థాపించి సంస్కరించె 34

సీ దైవమున్ విడి తొక్కు దయ్యమున్ గొనునట్లు
మాయ లోపల జిక్కి క్రుగ్గుచుండు
పూల బాటను వీడి ముళ్ల బాటనుబట్టి
కాలమంత శ్రమల గడపుచుండు
పీయూషమునుమాని విషముకోరినరుడు
అయువంత ప్రకృతి కమ్ముకొనును
నావను విడనాడి నాచు నెక్కినయట్లు
చిత్తంబునాశలో చేర్చియుండు

తే అకటదుర్లభ నరజన్మ మంత ఇట్లు
వ్యర్థ పఱచును జీవుండు వదలినిన్ను
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 35

సీ. పచ్చిపాలకడలి పాము పానుపుపైన
మచ్చికపవలించు లచ్చిమగడ!
చిచ్చుకందేవర మెచ్చిన నెచ్చెలి
పచ్చవిల్తునిగన్న హెచ్చుతండ్రి!
పచ్చజాపన్నియలచ్చంబుగా విచ్చ
మచ్చెకంటుల ఇచ్చ ముచ్చునే ల్పు
మచ్చలేక యెదను నిచ్చలు నినునమ్మ
నచ్చి ఇచ్చల నిచ్చు క్రచ్చుగిడ్డి!

తే. ఇచ్చితిని వచ్చి నా ఇచ్చ పుచ్చుకొనుచు
మచ్చలేని నీజాడ నాకిచ్చిప్రోవు
అచ్చుగానరి మచ్చెద విచ్చు సామి
భద్రగిరి ధామ! శ్రీరామ! భక్తకామ! 36

సీ. కొంగరక్కసి దొంగ గొంగ! వెన్నల దొంగ!
రంగ పక్షితురంగమంగళాంగ
అంగజశత కోటిశృంగార రసరంగ
సంగదూ రాపాంగ! శాస్త్రసంగ
మంగళ దేవతా మానసాంబుజ భృంగ
సంగర రిపు శృంగ శౌర్యభంగ!
భృంగా రక ఘటసారంగ మాయలు కృంగ
బంగుర మొనరించు భయతరంగ

తే. పొంగి ప్రవహించు కరుణంపు నింగిగంగ!
సంగతినిగాంచి ఏలవా? శరణనంగ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 37

సీ. ఉల్లంపు నీటిలో నున్న మురికి బాప
శ్రీరామనామంబు చిల్లగింజ
మానసారణ్యాన మంటలు చల్లార్ప
శ్రీరామనామంబుఘోర వృష్టి
భావా భ్రి సంచార బాధాంబుదములకు
శ్రీరామనామంబు పేరుగాడ్పు
స్వాంతావని నిసాధు సస్యాల పండింప
శ్రీరామనామ మమృతపుధార

తే. హృదయదీపమున్ వెలిగింపకదల కుండ
రామనామంబు తైలంబు రమణమీర
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 38

సీ. ఏజీవికైనను ఏవేళనాచేత
అపంత అపకారమంద వలదు
ఎ పరిస్థితుల లో నేను నుండినగాని
మనసులోనిన్ను నేమఱువవలదు
చేత నైనంతమేల్ చేయించు పరులకు
చేటు మాత్రమెపుడు చేయనీకు
సంకటంబులు నెన్ని సమకూరిననుగాని
సాధుసాంగత్యంబు జరుగవలయు

తే. నేను నిన్ను వీడినగాని నీవు నన్ను
వీడవల దయ్య ఇది యెనే వేడువరము
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 39

సీ ఉల్లి పూవులదండ మొల్లపూదండవునె
జడుడు మెడను దాల్చి చాటుమాత్ర
బాటపలుఁగు జాయిమేటిరత్నంబౌనె
పలువ గౌరవించి తలధరింప
మంకులేపెడి కల్లు మధురామృతమగునె
వెఱ్ఱిపెదవమెచ్చి జుఱ్ఱినంత
మొఱకికి పాట లెటుల సరససంగీతమౌ
ఎఱుగాకి గద్దెక్కి పాడగానె

తే తమకు తామె గొప్ప యటంచు తఱ్ఱినరులు
ఒకరికొక్కరు ఒన గూడి ప్రకటముగను
డప్పుకొట్టు కొన్నంతనె గొప్పయగునె
ప్రాజ్ఞ లోకంబులో నగుబాటుదప్ప 40

సీ విద్యాధి దేవత వేదభారతికాగ
విద్యా నిషేధంబువెలది కేల?
సకల శక్తుల కాది శక్తి మూలముకాగ
సబలనబల జేయు సంఘమేల?
సంపదలకు తల్లి సాగరోద్భవకాగ
తరుణికి పార తంత్ర్యంబదేల?
ఆదిపరాశక్తి అఖిల లోకములేల
రాజ్య రాహిత్యంబు రమణికేల?

తే మాత గాయత్రియే ప్రణవమంత్రమైతె
ప్రణవ మంత్ర నిషేధంబు పడతికేల?
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 41

సీ స్వార్ధరహిత నీతి చరిత ముండిన చాలు
యాకలి పూరుషుండేమి సేయు
గలనైన బరపీడ దలపకుండి నచాలు
యారాక్ష సావళి యేమి సేయు
సత్కార్యములు సదా సల్పు చుండి నచాలు
యాకుగ్రహమ్ములు నేమిసేయు
నంతర్విరాగియై ఆత్మనీ కర్పింప
యామాయ లజగమ్మె మిసేయు

తే నిన్నుగను మనమ్మున జీవుడు న్నయెడల
చేయునేమి యీ చాపల్య చిత్తశక్తి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 42

సీ సాధు వృద్ధులులేని సభ సభయనరాదు
బుద్ధి పెద్దదిగాక వృద్ధుకాడు
తలప సత్యములేని పలుకుధర్మముకాదు
కపటమున్నది సత్యమెపుడుకాదు
ధర్మమెఱిగియున్న దాచియుండగ రాదు
దాచిన దోషం బుదప్పబోదు
భయముచె నాశచే పగచేత గలనీతి
దప్పజెప్పిన వాడు దండధరుని

తే వేయి దారుణ నరకాల వెతలలోన
చిక్కుకొని సహస్రాబ్దముల్ పొక్కునంద్రు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 43

సీ రామ రామాయంచు ప్రేమ బిల్చెడి నన్ను
ఏమిరాయని పల్కరింప వేల
తండ్రి కేశవ యంచు తల్లడిల్లెడి నన్ను
రారబిడ్డాయంచు చేరవేల
కృష్ణ కష్ణాయంచు కీర్తింప ఆర్తితో
సొంపుకేలెత్తి లాలింప వేల
వాసు దేవాయంచు దోసిలొగ్గెడినాకు
వత్తురాయని వార్త పంపవేల

తే ఎన్నివిధముల వేడి నేచిన్నపోవ
కన్న వాడవునీమది కరగదేమి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 44

సీ దుర్మార్గమున జగద్ద్రోహమ్ముగావించు
దుర్గాసురుల పాలిదుర్గలగుచు
అడ్డదారి పదవు లార్జించిదోచెడు
క్రక్షరాక్షస కాళిమాతలగుచు
జనుల నష్టపఱచు స్వార్థపిశాచాల
దండించి చెండించు చెండులగుచు
వధువులవంచించి వధియించు కుదియించు
మహిషాసురుల పాలిమారులగుచు

తే ఉర్విలోపల మహిళలు నుద్యమించి
నప్పుడే దేశజనులంు అగునుప్రగతి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 45

సీ. పం[?]లను తాను తారు మారుగ [?]
మిడికించు నీ పెద్దకొడుకు చూడు
[?]ందులు [?]మానసంబున లేని
చిచ్చు బెట్టును నీటు చిన్ని పట్టె
[?] సురాగాల మలిపురి[?]
బంధించు నీమాయ వదలకుండ
[?]ములోన ఆడించుచున్నది
ప్రకృతిన్సృష్టవిరసఫలముచూపి

తే. [?]గండాలదాటుచు ఎట్లునిన్ను
చరగలనునీదయలేక చెప్పుమీవె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మ[?]శీల! సువిశాలతత్వమూల! 46

సీ. స్వార్థ[?]చారె ప్రభువులై యున్నచో
ధర్మమెక్కడ స్థానముండు
[?] అన్యాయపరులైన
అవినీతి ఎన్నడు అంతమగును
[?] తనంబురాజ్యమేలు చునుంటె
అక్రమార్జనమెన్న డాగగలదు
[?]క్రమార్జనులున్న ఆదేశమెన్నడు
సక్రమ మార్గాన చక్కబడును

తే. [?]బడనిదే మెటుల శాంతిసుఖము
జనులకబ్బును సత్కీర్తి జయముగాంచు
[?]మ్ము గావించి తిక్క ప్రభులు
[?]మై దోషులై చచ్చుచుంద్రు 47

సీ పరకవిత్వమ్ముల ప్రావీణ్య మెసంగ
దొంగిలించి బ్రతుకు ఎంగిలికవి
ఇతర ధనంబుల చతురతతోదోచి
నీటుజూపిబ్రతుకు నీచుడొకడు
ఒరునిసత్వాలన ఒర్వకతాకూల్చి
గద్దెనెక్కి బ్రతుకు గ్రద్ద యొకడు
పాపభీతిని మాలి పరుల చంపిబ్రతుకు
స్వార్థరాక్షసజాతి సాహసించి

తే పంచభూతముల్ నవ్వను పక్కుమనుచు
జ్ఞాన హీను లౌ ఈవెఱ్ఱి మానవులను
కాంచి వీరుసాధించిన ఘనత ఏమి
రెంటికినిచెడ్డ రేవళ్ళ రీతిఇదియె 48

సీ కాలెటో చేయెటో కన్నెటో మొగమెటో
వెఱ్ఱి ఈ వచన కవిత్వమునకు
తలపె టోపలపెటో పలుకెటో కులుకెటో
వెంగళినేటి కవిత్వమునకు
తానేమి చెప్పునో తనకె అర్థముకాని
క్రొత్తకైత యటంచు ఎత్తి అఱచి
కవులు కొందఱు పద్య కవితాంగమధ్యంబు
విఱుగగొట్టెద మంద్రు వింతయేమొ

తే కాకులేకమై కలహంస గణము ద్రోసి
గౌరవముగాంచె ఈకలికాలమేమొ
స్థూలమునకున్న ఘనతేది సూక్ష్మమునకు
హృద్యమైన గద్యముకూడ పద్యమగును 49

సీ. అధికారపదవుల నధమాధముండున్న
అధమాంగుల నెత్తి ఆదరించు
లంచగొండితనంబు మించ దేశంబెల్ల
స్వార్థపరతమీరి వ్యర్థమగును
అధికార పీఠాన అల్పమానవుడున్న
ఆదేశమధమమై అడుగుబట్టు
అల్పబుద్ధులకును అధమాధములకును
అధికార పదవులనంట గట్టు

తే. అధములెక్కువై దేశంబు అధమగతికి
తెచ్చుచున్నారు ముచ్చలైచచ్చు జడులు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 50

సీ. పడి పుల్గు పెద్ద తత్తడి రౌతునరితాల్పు
ఉదల పుత్తడి చీర లొప్పువేల్పు
తండ్రులందఱగన్న తండ్రి యౌముగ్గుఱ
మొదటితండ్రులకు నుమొదలి తండ్రి
ముజ్జగంబుల నెల నొజ్జయై తానెలు
బొజ్జలోపలనుంచి బుజ్జినాన
మాయను బుట్టించి మమ్ముల కలిగించి
మాయలోపల ముంచుమాయదారి

తే. మాయతొలగించి మాకును సాయపడుచు
పాయకుండ నెల్లపుడు కాపాడుగాక
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 51

సీ దద్దీ త్రెంచుకొనుచు దొంగతనంబున
గడ్డివాములు మేయు గొడ్డులనగ
పది మంది కైవండు పాక భాండంబుల
కూర్చిమెక్కెడు గొంటు కుక్కలట్లు
మందమీద పడుచు మంకు గొఱ్ఱెలనోలి
కూడి తోడేళ్లు పీక్కొన్న యట్లు
అందఱి కనిగుమ్ము లందుంచు ధాన్యాల
కొట్టి మెక్కెడు పందికొక్కుల నగ

తే ప్రజల సేవింతుమని ఎట్లొ పదవులూని
స్వార్థ పరనాయకుల్ దేశసంపదలను
దోచితినుచుండ్రి సమయమ్ముదొరకగనె
దొంగజపములు చేసెడు కొంగలగుచు 52

సీ శిశువుకాధరంబు క్షితి తల్లిదండ్రులు
పశువు కాధారంబు పాలకుండు
పడతి కాధారంబు ప్రాణనాథుండగు
ఫలముకాధారంబు విదపంబు
పాదపాధారంబు పరికింప ధరణియౌ
ధరణికాధారంబు ధర్మమగును
ధర్మంబునకు తావు నిర్మలకర్మంబు
నిర్మలకర్మకు నీతి యగును

తే నీతికాధారమైయుండ్రు నీతిమతులు
నీతిమతులకాధారంబు నీవెయగుదు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సుపవిత్ర తత్వమూల!

సీ. దేవతలే ఇట్లు త్రోవదప్పిరటంచు
తాను తప్పవలదు దారినెపుడు
తెల్పు పెద్దలె ఇట్లు సల్పుచున్నారంచు
తాను సల్పవలదు తప్పులెపుడు
బుధుల చేష్టలు కొన్ని పొరపాట్లవలె బైకి
దోచిననవి దేశ దోహదములె
తొందరపడి మహాత్ముల నెప్వుడైనను
నిందసేయగ రాదు నేర మెంచి

తె. అప్పటప్పట విశ్వకళ్యాణమునకు
ఋషిమహాత్ముల్ త్వదంశంబు నవతరింత్రు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 58

సీ. తనకపకారంబు నొనరించినను సరే
లోకోపకారిని రోయవలదు
తనకు మేలొనగూర్చు తనయునైనను గాని
లోకాపకారిని ద్రోయవలయు
స్వార్థపరతకంటె పరమ పాపములేదు
పరహితంబునకంటె ఫలములేదు
సంకటంబులనోర్చి సహన భావముతోడ
సజ్జన సంగతి సలుపవలయు

తె. భోగభాగ్యంబులెన్నున్న త్యాగబుద్ధి
దుష్టగంధంబునంటక తొలగవలెయు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 59

సీ॥ భగవానుడా! నీకు భక్తుండ నేను నా
భారమంతయు మోయ భాగ్యమిడవె
అనుచు నెమ్మదినమ్ముకొని చేతులందుల్పి
ఏ యత్నమునులేక హాయిగాను
నట్టింటిలో సొక్క నరునకే దైవమ్ము
సహకరింపక తగు శాస్త్ర చేయు
గాలిలో దీపంబు మేలుగా నిలపెట్టి
వెలిగింపుమని మ్రొక్కు వెఱ్ఱివోలె

తే॥ అఱియత్నముల్ తనవి ఏడవది తోడు
పడగసఫలమ్ముచేయు దైవమ్మునీవు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 60

సీ॥ గట్టుచేర్చే నావె నట్టేట ముంచును
ప్రౌఢరావాత్య సారధ్యమునను
భోగమిచ్చే మేనె రోగదు ఖములిచ్చు
యోగమ ర్గముదప్పు రాగమతిక
రక్షాయుధమెతన్ను శిక్షించు భక్షించు
దక్షత లేనట్టి దానవునకు
మోక్షకారణమున మూలమౌభావమే
ప్రజ్ఞలేకున్నచో బంధమగును

తే॥ అన్నమే విషంబన్నమే అమృతమగును
వాడుకొను రీతులను బట్టి వారి కోలి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 61

ఒక వాయసము నీల్గ ఒనగూడ వేవేలు
కాకములే విలపించు కలత చెంది
ఒక వానరము పడ్డ ఒక్కటై క్రోతులు
సాధ్యమైనంతకు సహకరించు
ఒక తెనెటీగకు ఒందిలి వాటిల్ల
ఏకమైపోవు పోటీగలెల్ల
చీమలైకమత్యతకల్గి జీవించు ప్రేమతో
పామునైనెదిరించి పట్టుదలను

కాని మానవులిది యేమి కారణంబొ
క్రూర జంతులే ఛీయని దూరుచుండ
మంత్ర జ్వాల సృష్టించి మడియుచుంద్రు
కలం జీవింప నొల్లక కాటులాడ 62

కోయిల పుట్టువు కొంతకాలము చాలు
కాకిబ్రతుకు చిరకాలమేల
పూవుగా నొకపూట జీవింప చాలదా
కంటకం బెన్నాళు కలుగ నేమి
పండుగా నొళ్లలో నుండ జాలిన చాలు
బండగా తలలపై నుండ నేల
యోగమ్ము నింతంతయే పదివేలు
గ్రద్దల భోగాలు గంపెడేల

ఉపయుక్తులై జనపద శ్రేయమెంచి
సాధుచరితతో కొన్నాళ్లె చాలుబ్రదుకు
పెద్ద దేహంబు కలిగిన శరుని బ్రతుకు
ఎందుకు ఎనుధవిసుగ ॥భద్ర॥

సీ. హరి హరభేదంబు పొరయ ం రాగముసేయు
దక్షప్రజాపతి శిక్షవినరొ
హర హరిభేదంబు నరసి కయ్యము సేయు
బాణాసురుని పరాభవముకనరొ
అరయంగ విష్ణుసాహస్ర నామములందు
శుభశివ నామంబు చూడలేరొ
శివసహస్రాఖ్య సంస్తవమునందుండదో
హరి శుభనామంబు తిరముగాను

తే. భేదమే లేని మీకును వాదమతులు
భేదమును చేయువారికి మోదమేమొ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 64

సీ. బ్రహ్మర్షి వాల్మీకి రామాయణంబును
చదువని కవివరు జన్మమేల
వ్యాసమహామౌని భాగవతాదుల
చదువని సత్కవి జాతమేల
ఆది శంకర జగదాచార్య రచనల
చదువని సాహిత్య చతురతేల
బమ్మెర పోతన్న భాగవతంబును
చదువని తెలుగన్న చదువదేల

తే. దేవదేవ! సనాతనదేవ! నిన్ను
భావమున నిల్పికొల్వని భక్తుడేల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 65

సీ. నీ యోగమున గాని నిఖిల భోగంబులు
రోగంబులే అవి భోగశయన
నీ చూపునకులేని నిఖిల సుఖంబులు
దుఃఖమూలములవి దోషహరణ
నీ భోగ్యమునగాని నిఖిల భాగ్యంబులు
యోగ్యంబులవికావు భోగ్యమునకు
నీసిద్ధికినిగాని నిఖిల సిద్ధులు కూడ
సిద్ధంబులే ఆత్మశుద్ధమునకు

తే. నీదుభక్తికి కానట్టి నిఖిల దివ్య
శక్తులెల్లను రక్తులే ముక్తిగావు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 66

సీ. పెను పేరటంచు పెద్దగా మురియుచు
పేరు సంపాదింత్రు పెక్కుతీర్ల
రామాయణంబున రామచంద్రుని తోడ
రావణాదులపేర్లు వ్రాయబడవొ
సీతాచరిత్రాన ఎతమ్మ పేరుతో
చప్పనాతికి గూడ చోటులేదొ
వసుదేవఘనునితో వల్లగాడిదగూడ
పలుకబడుటలేదా ప్రజల నోట

తే. పతితులెందఱు జగతి శాశ్వతులుగారు
పేరి చరితమే ధన్యంబు ఖ్యాతిగాదు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 67

సీ సరస సాహిత్య సస్యావళు లడుగంట
స్వైరవాఙ్మయతృణావళి ఫలించె
కలకంఠ గణముల కడనెట్టి 'ఏకమై
గ్రద్దలు కాకులే ఘనతగాంచె
మందార మకరంద మాధుర్యమానెడు
తుమ్మెదలరుదీగ దోమలెదిగె
స్థూలంబు విలువైన కాలంబు రాగనే
సూక్ష్మశీలజ్ఞాన శూన్యమయ్యె

తే కలనవ్వెను సత్యమున్ గాంచి వసుధ
కలియుగము మహామను జూడు కలుషహరణ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 68

సీ చల్లగా సౌరభ్య శాంతి మారుతములు
విశ్వమందంతట వీచవలెను
సకల మానవగణ స్వాంతమ్ములందున
స్నేహలతికలు పుష్పింపవలెను
సర్వప్రపంచంబు సౌభాగ్య భోగ్యమై
స్వర్గప్రమేయమై సాగవలెను
మానవధర్మంబు మహినందనమువోలె
సుమియించి ఫలియించి సొంపుగాలయి

తే జీవి జీవి లోపల నిజదైవభక్తి
కలిగి వెలుగొందవలయు ఈ కలియుగాన
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 69

సీ॥ సచ్చరిత్రమె నీకు సత్యమైనర్చన
సత్యవాక్యమె నీదు సన్నుతులును
సాధుదర్శనమె నీ సందర్శనమ్మగు
సద్గుణంబే నీదుచరణ భక్తి
శ్రేయశ్రవణమెనీ లీలాశ్రవణమగు
శీలగమనమెనీక్షేత్ర యాత్ర
సాధు సంకల్పమే సరినీదు ధ్యానంబు
స్వార్థరాహిత్యమే ఆరగింపు

తే॥ శాంతతత్వమే నీదు ప్రసాదమగును
త్యాగయోగమే నీ తత్వ భోగమగును
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 70

సీ॥ గోమాతలను గోరి గొల్వ హీనంబాయె
కుక్కలసేవింప గొప్పయయ్యె
శాస్త్రీయ సంగీత సారస్యమానరు
స్వైరగానంబులే శ్రావ్యమయ్యె
విమల పురాణాల వినబోరు చదువరు
వెఱ్ఱినవల లెప్ప విడువరైరి
అమ్మ నాన్నా యన అవమానమయిపోయె
మమ్మిడాడీ యన్న మహితమయ్యె

తే॥ కలియుగపు వింతలను నీవు కాంచుమయ్య
భరతవర్షాని కేగతి పట్టినాదొ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 71

సీ॥ పౌరాణికులయెడ గౌరవంబులు తగ్గె
నవలారచయిత గౌరవము హెచ్చె
శాస్త్రీయ నటులకు సాపాటు కఱవాయె
స్వైరనర్తకులు సంపన్నులైరి
ధర్మ సత్కర్మముల్ ధరలోన కొదవయ్యె
ద్రవ్యార్జనంబె స్వధర్మమాయె
సత్కవిత్వంబన్న సాదరంబే లేదు
కొనిరి సత్కారముల్ కుకవు లెల్ల

తే॥ సరగునను జేరి మఱవక సదయహృదయ!
సంస్కరింపవే మూర్ఖుల జానకీశ!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 72

సీ॥ అకారమును జూచి ఆదరింత్రు ఒడులు
శ్రీకారమును గాంత్రు శీలమతులు
ఖ్యాతిననుసరించి గౌరవింత్రు జడులు
జ్ఞానమను సరింత్రు జ్ఞానులెపుడు
బరువు ననుసరించి భావింత్రు మూర్ఖులు
పరువు ననుసరింత్రు ప్రాజ్ఞులెపుడు
మాట ననుసరింత్రు మంకునయులుచూడ
మనసునను సరింత్రు మంచివారు

తే॥ స్థూలమునకే విలువనిచ్చు కాలమిద్ది
సూక్ష్మమును గానలేరైరి శుంఠమతులు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 73

సీ పేదల సేవింప పెనుజాలితో బల్కి
పేదవారలనెత్తి బెట్టికొనుచు
వీధి వీధి తిరిగి విరివిగా సభలందు
గొంతెత్తి ప్రతినలకూం కూం
పదవుల నార్జించి పదపడి లీడర్లు
పేదవారెదురైన పెడమొగాలు
పెట్టిదాటుచుపోవు బెట్టి ధర్మమ్మొకో
కొంచెమాలోచించు కొనరు వారు

తే బీదవారలు ఇడు ఓటు భిక్షచేత
బీదవారల మేలునే అదమఱచి
స్వార్థపరతతో గ్రద్దలై బ్రతుకుచుంటె
ఇక్కడక్కడ పతనమ్ము నిక్కమగును 74

సీ పేద పేదయటంచు పేదలగొల్వగా
పెద్దగద్దెక్కెపో వెదవ యొకడు
పేద పేదయటంచు పేదలవెతలెల్ల
కతలు వ్రాసిన వారు కలిమిగొనిరి
బీద బీద యటంచు బీదపై కైతల్లి
ఘనసత్కృతిని బొందెకవియొకండు
బడుగు బడుగులంచు బడుగు బ్రతుకులపై
చిత్రాలు నిర్మించి సిరులు కనిరి

తే కాని పేదవారెన్నడు కారు బాగు
కారణంబేమి స్వాతంత్ర్యకాలమైన
దేశభక్తులు వీరలా? దేవ దేవ!
వీరి చిత్తశుద్ధిని చూచి విసిగెపసులు 75

సీ  ఏనుగంతటిదైన నేమి చెడ్డుల్ చేసె
తిండివలన గాదె నుండె శాంతి
జిఋత పులింతైన జెదరు దేశంబెల్ల
గూడు వలన గాదె క్రూరమొందె
అకుదేలు భ్రమరమై కీర్తిగాంచుట
సహవాసమున గాదె జగతినరయ
నీటిస్నేహము జేయ నిష్ఫలంబయి పోదె
సొబగైన మధురంపు జుంటితేనె

తే  గ్రాస సహవాసములె వ్యక్తి ఘనతకెల్ల
గ్రాస సహవాసములె నైచ్యకారణములు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 76

సీ  సకలజీవుల తన సంతతిగా నెంచి
రక్షించి పోషించు రాజ పతివి
ఇతరుల బాధల నెల్లను తనవిగా
భావించి మాన్పెడు ప్రభులపతివి
ధర్మచరిత్రాన ధర్మంబు స్థాపించు
ధర్మావతార భూధవులపతివి
ధర్మంబు దప్పెడు దుర్మార్గులను వంచి
ధర్మాత్ములను బ్రోచు ధర్మ పతివి

తే  రామరాజ్యంబునకు సాటి రామరాజ్య
మేయటంచును లోకంబులెత్తి పొగడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 77

సీ ఏవేళ నిల్లాలి నేడ్పించ గలవాని
సహనశీలము లేక జరుగువాని
చోరగుణము వాని జారగుణము వాని
కారుణ్య చిత్తుండు కాని వాని
కోపగుణము వాని పాపచారిత్రుని
పేరుశవాక్కుల తోడపలుకువాని
కయ్యాని కెప్పుడు కాలుద్రవ్వెడు వాని
నెయ్యంబు చెయ్యగా నేరనతని

తే పూనినీ భక్తి ఇంచుక లేనివాని
పొత్తునున్నట్టి బ్రతుకెల్ల మొత్తుకోలె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 78

సీ పురువునుదిన గోరి పరువులెత్తును కప్ప
ఆకప్పవెంబడి అరుగుపాము
పామునుగని చిత్రపక్షంబు పరువెత్తు
వేటకాడాపక్షి వెంటబడును
సృష్టిలోపలగల జీవజాలములను
కాచి వెంటనె యుండు కాలు డిటుల
జ్ఞానయుక్తంబైన మానవజన్మంబు
కడుదుర్లభంబయి కలుగుగాన

తే దీపమున్నప్పుడే ఇల్లు దిద్దినట్లు
జీవుడున్నప్పుడే నిన్ను చేరు మనిరి
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 79

సీ  శభరాంబలేశాంశ జాత యౌదమ్మక్క
దండకారణ్య భద్రాద్రి సీమ
సంచరించుచు పూర్వజన్మ పుణ్యము జేస
తావక విగ్రహ దర్శనంబు
కాగ భక్తిని మ్రొక్కి కడుపులకితయౌచు
గౌతమీ జలముల కడిగిమురిసి
కొండమల్లె విరుల గోగుల పూజించి
తగుకాయగడ్డలు తాటి పండ్ల

తే  ఆరగింపుల జేయ సంసార జలధి
దాట జేసిన శ్రీరామదైవ మీవు
భద్రగిరి పాల। శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। సువిశాలతత్వమూల। 80

సీ  శ్రీలొల్కు గోదావరీ వేల భద్రాద్రి
పైనీవువెలయుట భక్తుడైన
కంచెర్లగోపన్న కాంచి దమ్మక్కతో
గుడిగోపురంబు లకొమరుమిగుల
నిర్మింప జేసెను నీకు నిర్మల భక్తి
నష్టకష్టాలకు ఇష్టపడియు
వేలాదికీర్తనల్ విరివిగారచియుంచి
వాగ్గేయకారుడై వాసికెక్కి

తే  నిన్ను కీర్తించి సేవించి నిష్కలంక
రామదాసుడై తరియించె నిన్ను గాంచె
భద్రగిరి పాల। శ్రీరామ। భక్తలోల।
ధర్మగుణశీల। సువిశాలతత్వమూల। 81

సీ కడలిలోతడలట్లు కలిగివెళ్లి మలగు
అఖిలవిశ్వము పరమాత్మలోన
అకాశమందు మేఘావళి భంగిని
అఖిలమాయాలోకనువతరించు
మేఘాలలోపలమెఱపు తీగల వోలె
బ్రహ్మాండములు పుట్టిలయము చెందు
భూమిలో వనములు పుట్టి గిట్టిన యట్లు
బ్రహ్మంబులో సృష్టి పరగితరగు

తే ఏకమే భిన్నమైతోచు ఎండమావు
లట్లు సత్యంబు తెలిసిన అంతయొకటె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 82

సీ ఈ జీవయాత్రలో ఈ లోకమున జూడ
అడ్డుపడును మంచి చెడ్డలెన్నొ
పరిమళించు విరుల వనములు ఒకచోట
కంటక వనములు పెంటలొకట
చక్కని జింకలు సాదు జంతులొకట
క్రూరమృగాల్ వెఱ్ఱి కుక్కలొకట
పద్మముల్ భాసిల్లు పాలకొలకు లొకట
పాడు బురదమడ్గు జాడ లొకట

తే యాత్రికుడు తన దృష్టి గమ్యంబు నందు
చేర్చి నేర్పుతో పయనంబు చేయవలయు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 83

సీ పరమ ధర్మునకైన పాపకర్మునకైన
అనుభవింపక తీరదను భవంబు
పాతాళమున జొచ్చి బ్రతుకుచుండిన గాని
రానున్న ఫలితంబు రానెవచ్చు
ఎంతశోకించిన యెంత కాలంబైన
నుదుటిపై విధి వ్రాత చెదరిపోదు
ఎంతవారలయిన నేయత్నమున నైన
తప్పించుకొనలేరు దైవనియతి
తే కానమోద ఖేదంబుల కడకు నెట్టి
నిన్ను నమ్మి భజించుటే నిత్య సుఖము
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 84

సీ కనుజోడుచే నేను గాంచిన విధమెల్ల
స్వామినీదర్శన ఫలముగాను
అడుగులచే నేను నడచిన నడకంత
శ్రీశ నీకది ప్రదక్షిణముగాను
చేతులతో నేను జేసిన పనులన్ని
దేవ నీపాదాల సేవలుగను
క్షుత్పిపాసలకునేఁ గుడుచు భుక్తంబెల్ల
నార్య నీకది మహాయాగముగను
తే నోటఁబల్కు పల్కంత నీ నుతులుగాను
దలఁచి చేపట్టవయ్య నీ దాసజనుఁడ
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 85

సీ పరులకాసింపని బ్రతుకంతి యేచాలు
టూగుటూయలలోనూగ కాదు
అకటికై పట్టెడన్న మంతియె చాలు
పొట్ట పిగులమెక్కి పొఱలకాదు
గతులకోసము సుసంతతి ఇర్వురేచాలు
పనికి రానట్టేంద్రు పదుగురేల
అంతరంగసుశాంతి అందియుండిన చాలు
బహిరంగభోగాల భాగ్యమేల

తే జీవితాంతంబు భవదీయ సేవ చేయు
చుండ చాలు జీవునకు వేఱొండికేల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 86

సీ దండంబు దండమో దశరధరామయ్య
పసివాని గండముల్ వాపుమయ్య
కరుణ చల్లఁగదయ్య కల్యాణ రామయ్య
తనయుని వెఱపులన్ దఱుమవయ్య
సాకేత రామయ్య సరగునరావయ్య
యీకలినుండినన్ సాకుమయ్య
కోరి పిల్చితినయ్య కోదండ రామయ్య
చాలునీ మాయకు దాలయ్య

తే అయ్యముగురయ్యలకు మొదటయ్యవందు
రయ్యనినుఁ దప్పనన్య మే నరయునయ్య
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 87

సీ. పాంచ భౌతిక చిత్ర పాత్రమై భాసిల్లు
సృష్టియే నీమహాచిత్రశాల
ప్రణవ నాదాత్మ సప్తస్వరమయముని
సంగీత శాల ఈసకల జగము
వేదబోధిత సర్వవిజ్ఞాన విశ్వమే
రసకావ్యయుత మహాగ్రంధశాల
విశ్వకర్మసుకృత విశదమ్మునీదు నం
కల్పమే బ్రహ్మాండ శిల్పశాల

తే. దృశ్యవిశ్వంబు సర్వంబు నశ్యమగును
నాల్గుపూటల నటన నీ నాట్యశాల
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 88

సీ. ఉన్నవాడవొకడవున్నట్టు లుండక
వేయొండు జేసితివేడ్కతోడ
ఆయొక్కటిని బుట్టెనలరంగమూడును
మూటతో నైదును మొలచెనట్టి
ఐదుతోనైదయ్యె ఆ పదింటను పది
ఉదయించె మధితమై ముదముమీర
ఈ చదరంగాన ఎన్న ఎన్బది నాల్గు
లక్షల విధముల ప్రాణికోట్ల

తే. చేసి శ్రీదేవితో గూడి చిత్తమబ్బ
ఆడుకొందువు మాబాధజూడవలదె
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్వమూల! 89

సీ జీవనంబను కొండ చీకటి దారిలో
అమర దీపము సుమీ అక్షరంబు
జడదేహ వృక్షాన జ్ఞాన సుమమ్ముల
పూయించు కతిమబ్బు పూవు విద్య
సంసార జలనిధి సంచరించి తరించ
చదువు మానవులకు సాగునౌక
మలిన సంకలనమౌ మాంస చక్షువు కంటె
ధన్యంబు జ్ఞాన నేత్రంబు విద్య

తే జనున కుభయ సాఫల్యంబు చదువు చూడ
కామధేనువు వంటిది కనగ చదువు
విద్యలేని వాని బ్రతుకు వెట్టిబ్రతుకు
బ్రతుకునందాక విద్యలు పడయవలయు 90

సీ భారతీజనని కృపాప్రసాదపు విద్య
సద్విని యోగంబు సలుపదేని
కలుములతల్లిచ్చు కరుణతోడి సిరుల
సద్వినియోగంబు సలుపదేని
ఆర్యాంబయొసగు దయాప్రసాదపు శక్తి
సద్విని యోగంబు సలుపకున్న
మానవుండై పుట్టి మానవుండేకాడు
నీచ జన్మములెత్తి నేర్పులేక

తే చచ్చిపుట్టుచు ఈ సృష్టి చక్రమందు
కల్పకల్పాల సఫలుండు కాడువాడు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! సువిశాలతత్త్వమూల! 91

సీ అడుగడుగునకు వేయి అపరాధములు చేసి
జీవించుచుండిన చెనటివీడు
ఘడియ ఘడియ కోటిగండాలనుండినన్
సాకుచుండిన దయాసాగరుడవు
పాపభీతినిమాని స్వార్థభావము పూని
పరులను హింసించి బ్రతకువీడు
అవ్యాజకారుణ్య భవ్యమానసమున
క్షమియించి రక్షించు జగముపతివి

తే వీనివలన లాభమునీకు వీసమంత
యైన లేదు వీనికి మాత్రమఖిలమిడుదు
ధర్మశీల! బ్రహ్మానంద తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ భక్తలోల! 92

సీ చెలగన యోధ్యలో శ్రీరామ! నిన్గొల్వ
కలుషగణములెల్ల కరగి పోవు
బృందావనముచేరి శ్రీకృష్ణ సేవింప
బంధముల్ తెగిపరానంద మబ్బు
తిరుమల వేంకయ్యదరిజేరి శరణన్న
వరములు ఫలియించు వాంఛ కలుగు
శ్రీ రంగమునుజేరి శేషశాయిని మ్రొక్క
ఆరాటములువోయి అందుశాంతి

తే భద్రగిరిజేరి శ్రీరామభద్రనిన్ను
దర్శనముచేసి అర్చింప తరణమబ్బు
ధర్మపాలన నానావతారశీల!
భద్రగిరి పాల! శ్రీరామ భక్తలోల! 93

సీ కొలచిన వారికి కొంగుబంగారమై
గట్టుపై గలవేల్పు చెట్టు నీవు
తలచినవారిక దగ్గతిచుట్టమై
ఆదరించెడి పెద్ద అయ్యవీవు
[illegible]లచిన వారికి ప్రియ సన్నిహితుడవై
సహకరించెడి గుణ సాగరుడవు
వలచినవారికి వలపుల నొసగుచు
సాకుచుండిన మహా స్వామివీవు

తె జానకీనాధ నీదివ్య చరణములను
భావమున నిల్పి నన్నేలు భారమీదె
ధర్మశీల! బ్రహ్మానంద తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ భక్తలోల! 94

సీ శ్రీజానకీదేవి హృదయ సారసమిత్ర
విశ్వేశభువనైక వినుతపాత్ర
వేదాంతసారార్థ విమల తారకమంత్ర
షడ్విధమోక్ష ప్రసాదయంత్ర
భక్తాంజనేయ హృత్పూర్వన సంచార
బ్రహ్మర్షి వాల్మీకి వాక్ప్రసార
రామాయణామృత రసమయ సురగంగ
నిర్మలమానస ధర్మసంగ

తే ధరణి ధర్మసంరక్షావతారమూర్తి
భావమున నమ్మినాడ నీపాదయుగము
ధర్మశీల! బ్రహ్మానంద తత్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ భక్తలోల! 95

సీ పరమహంసాది సత్పక్షి పంక్తులలోన
చిట్టిదొబండారు పిట్టవోలె
నభమునుండి వెలుంగు నక్షత్ర రాశిలో
నెక్కడో కలచిన్న చుక్కవోలె
వారిజమందార పారిజాతాదిక
పుష్పావళిని చిన్నిపూవు వోలె
ఘనమహారణ్య వృక్షాదులందున గల
వృక్షనామపు జిట్టరేగు వోలె
శ్రీరామ నీ కపిసేనలో నొకమూల
కుప్పిగంతుల పొట్టికోతివోలె

తే కవులలో నామ మాత్రపుకవిని నేను
ఏమి తెలియదు మరియు నేనెంతవాడ
అంతనీ చల్వతోడ నింతంత గూడ
ధర్మగుణధామ! శ్రీపరంధామ! రామ! 96

సీ శీలవిద్యా లోల! శ్రిత భక్తపరిపాల!
ధర్మరక్షణ శీల కర్మజాల!
లే ఖ సన్నుత! సృష్టి లీలా క్రియో పేత!
సకల చరాచర జాతనేత!
నారాయణా! దివ్యనాగశయ్యా శాయి!
సార సోదర సుధా జలధి నిలయ
రామాతాకర పూజ్యనామ పావనమంత్ర
శిష్టలోకావన దుష్ట హరణ

తే యతిసు యోగీశ మౌనీంద్ర తతిజనాప్త
నవసుధారస మాధుర్యనయచరిత్ర
కరుణ గురియుచు మా చిత్త కమలమందు
విడక నివసించు నిరతంబు వేద వేద్య 97

ఇందులో సూక్తంబు లెన్నియున్నవో అన్ని
ఋషులు ప్రసాదించు కృపయెకాని
ఏమియు నాప్రజ్ఞ లేదెన్ని భంగుల
భక్తితో దూతనై పంచుచుంటి
దోషములేమైన దొరలిన వన్ని నా
స్వల్పబుద్ధి వలని సంభవములె
చదువు సంస్కారముల్ సక్రమంబున లేని
మందమతిని భక్తి మార్గగతుడ

తే. జ్ఞానులందఱు సవరించి సదయులగుచు
హంస దుగ్ధంబు నీతిగా నాదరించి
నన్ను మన్నింప వేడెద నతులొనర్చి
ఋషిఋణము దీర అనిశంబు కృషిసేతు 98

సీ. కౌండిన్య గోత్రంబు గలశిలే వంశుండు
ఖ్యాతిగా సింగరి తాతనాకు
జనకుండు సరసన జనని వీరమలమ
ధర ననుగను ధన్య దంపతులును
పినతండ్రి మల్లన పినతల్లి లక్కాంబ
దత్తతగొని పెంచు ధర్మమతులు
అగ్రజుల్ మువ్వురు నలర నాలవవాఁడ
కన్నతల్లికి నేను చిన్నిసుతుఁడ

తే. అంచితంబుగ బుధులు దీవించుచుండ
పూర్వ జిజ్ఞాస బాల్యానఁ బూని భక్తి
ఆత్మ శ్రీరామ పదభక్తి నమరియుంటి
నవని నారాయణాఖ్యుండ నలరవినుడి 99

సీ నగధారి! నీ దాసు నారాయణాఖ్యుండు
భక్తి పల్కిన సీసపంచ శతిని
భక్తితో ఎవరైన వ్రాసిన చదివిన
వినిపించినను మరి విన్న గాని
అఖిలాఘములు పాసి సుఖశాంతులను పొంది
నిత్యకళ్యాణముల్ నిండయింట
శ్రీరామచంద్ర! నీ కృపకు పాత్రులవుచు
సత్కీర్తిగాంచుచు జగమునందు

తే మాయతరియించి జ్ఞానులైమనుజ జన్మ
సఫలమొనరించుకొంద్రు సచ్చరితులగుచు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మగుణశీల! వేదాది తత్వమూల! 100

సీ శ్రీరామచంద్ర! నీ సీస పంచ శతిని
భక్తితో చదివిన భాగ్యమబ్బు
శ్రీరామ భద్రనీ సీస పద్యమ్ముల
వ్రాసిన వారికి వాసి కలుగు
శ్రీరామమూర్తి! నీ సీస పంచకృతిని
పంచిన వారికి మించు ఎరులు
శ్రీరామ భద్ర! నీ సీస పద్యమ్ముల
విన్నవారికి కల్గు ఉన్నతంబు

తే శ్రీశ! జానకీరామ! నీ సీస పద్య
పంచశతక సంపుటముగా పరగుచుండు
ఎందునుండునో ఈ గ్రంధమందు నీవు
చల్లగా నేలుచుండెద వెల్ల వేళ 101

సీ. శ్రీరస్తు శుభమస్తు ప్రియమస్తు జయమస్తు
అఖిల ప్రపంచకల్యాణమస్తు
సాధుసజ్జనగణ సన్మాన సద్గుణ
వృద్ధిరస్తు సుధర్మబుద్ధిరస్తు
నిరతసస్యహరిత భరితధరణిరస్తు
గోగణవన వృద్ధి కుశలమస్తు
వేదవిద్యాబ్రహ్మనాద విద్యాదైవ
భక్తి విద్యావృద్ధి భద్రమస్తు

తే. సకల జనలోక నిజసౌఖ్యశాంతిరస్తు
సతత భవదీయ దృక్సుధా సారమస్తు
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!
ధర్మశీల! బ్రహ్మానంద తత్త్వమూల! 102

సీ. మంగళంబగు నీకు మైథిలీ మాంగళ్య
మంగళంబిదొ మంగళాంగమునకు
కుశలంబు కుశలంబు కుశలవజనకుఁడా!
కుశలంబు నీ దివ్య గుణవితతికి
క్షేమంబు క్షేమంబు సీతామనోహరా!
క్షేమంబు నీ శుభ్రకీర్తి కెపుడు
భద్రంబు భద్రంబు భద్రాద్రి మందిరా!
భద్రంబు నీధర్మ పదవికెల్ల

తే. నిత్య కల్యాణమయ్యె నీ నిలయమునకు
బహాళ శుభములే ప్రొద్దు నీ పాదములకు
ధర్మశీల! బ్రహ్మానంద తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ! భక్తలోల!

సీ వాక్కాయ మనముల వలని చెయ్దంబులు
ప్రకృతి స్వభావాల వలని కృతులు
ఆత్మబుద్ధుల వలనైన సంకల్పముల్
హరి నీదు పాద పద్మార్పితములు
మఱియు నక్షరదోష మార్గ మెంతుండెనో
యెన్నమాత్రా లోపమెంత గలదొ
పదలక్షణంబెత భ్రంశమై పోయెనో
భావంబునే పొరపాట్లు కలవొ

తే వాని నన్నియు మన్నించి వత్సలతను
నన్నికేలు శ్రీనారాయణాది దేవ
ధర్మశీల! బ్రహ్మానంద తత్త్వమూల!
భద్రగిరి పాల! శ్రీరామ భక్తలోల! 104

ఓం తత్సత్
శాంతి శాంతి శాంతి
శ్రీ సీతారామచరణార విందార్పణమస్తు



